# రామాయణం - పాత్రల ఆదర్శం

ప్రథమ భాగము

51420



రచయిత

డా॥ జి. పద్మనాభం

1998.

# రామాయణం - పాత్రల ఆదర్శం

ప్రథమ భాగము

రచన :

డా॥ జి. పద్మనాభం

మనోరమ పబ్లికేషన్స్

తిరుపతి

1998

**Ramayanamu - Patrala Adarsamu**
Part - I

By
**Dr. G. Padmanabham**

PLACED ON THE SHELF
Date.. .. ............

First Edition : 1998.
Copies : 750.
Copy Rights Reserved

Price : Rs. 50/-



This book is published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams, Tirupati Under their Scheme "Aid to Publish Religious Books".

For Copies :
Smt. B. Manorama,
C/O Dr. G. Padmanabham,
Lecturer in Sanskrit,
Department of Sanskrit,
S. V. University,
Tirupati.




Printed at
**"Sri Sathya Sai Graphics"**,
Tirupati. Ph. 26807.

# ముందు మాట

డా॥ డి. నరసింహారెడ్డి,
రీడర్,
సంస్కృతవిభాగము,
శ్రీవెంకటేశ్వర విశ్వ విద్యాలయం,
తిరుపతి.

భారతీయ సంస్కృతికి ఆకరము లనదగినవి రామాయణ మహాభారతాది గ్రంథములే. హిందువులకు భగవద్గీతవలె రామాయణము కూడ ప్రమాణ గ్రంథము. మరియు చతుర్విధ పురుషార్థములను భోదించునది కావున ఇతిహాసమనియు వాల్మీకిచే రచింపబడినది కావున ఆదికావ్యమనియు పిలువబడుచున్నది. కావుననే ఇది సంస్కృతములో వెలువడిన అన్నికావ్యములకు మూలభూతమైనది.

**కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్ ।**
**పౌలస్త్య వధ మిత్యేవ చకార చరిత వ్రతః ॥**

లోకోత్తరుడైన శ్రీరాముని ఆదర్శ చరిత్రను చెప్పుచున్నందున 'రామాయణ' మనియు, సకల స్త్రీలోకమునకు ఆదర్శ భూతమైన సీతాదేవి పవిత్ర చరిత్రను వర్ణించినందున 'సీతాయాశ్చరిత' మనియు రావణుని వధను తెలుపుటవలన 'పౌలస్త్యవధ' యనియు మూడు విధములుగా పిలువబడుచున్నది. యిట్టి రామాయణము భారతజాతికి ఆదర్శవంతము -- శిరోధార్యము.

డా॥ జి. పద్మనాభం రచించిన ''రామాయణం - పాత్రల ఆదర్శం'' అను గ్రంథమున రామాయణంలోని క్షత్రియ పురుషపాత్రలు, స్త్రీ పాత్రలు ఏవిధంగా సమాజానికి ఆదర్శవంతులయినారో విపులంగా వివరించారు. ముఖ్యంగా తండ్రి కుమారుల అనుబంధం, అన్యోన్య దాంపత్యం, అన్నదమ్ముల ఆప్యాయత, గురుభక్తి సహేతుకంగా వివరించబడినది.

దశరథుడు తన భార్యకు యిచ్చిన వరముల కారణమున రాజ్య ప్రాప్తి తనకు తప్పిపోయినను, అందుకు కారణమైనకైకేయిని నిందించక అరణ్యమునకు బయలుదేరినట్టి ధీరుడు శ్రీరాముడు--

**పితాహి దైవతం తాత దేవతా నామపిస్మృతమ్ ।**

**తస్మాద్దైవత మిత్యేవ కరిష్యామి పితుర్వచః ॥**

అనగా తండ్రి దేవునితో సమానమనియు, దేవతలకు సైతము తండ్రియే దైవమనియు, కావునే దశరథుని దైవముగా భావించిన శ్రీరాముడు అడవులకు పోవుటకు సిద్ధపడెను.

మరియు సీతారాములు 'అన్యోన్యదాంపత్యం' ఈ లోకానికే ఆదర్శవంతం 'ధర్మేచ, అర్థేచ, కామేచ, మోక్షేచ నాతిచరామి' అను వైవాహిక మంత్రం ప్రకారం సీత రామునితో అరణ్యమునకు వెళ్ళడం బట్టి మనకు వారి అన్యోన్యత్వం తెలుస్తున్నది. మరియు ఉత్తర రామ చరితమున --

**అద్వైతం సుఖ దుఃఖ యోరనుగతం సర్వాస్వవస్థాసుయ**

**ద్విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యోరసః ।**

**కాలేనా వరణాత్యయా త్పరిణతే యత్ప్రేమ సారేస్థితం**

**భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హితత్ ప్రార్థ్యతే ॥**

మా దాంపత్య జీవితం సుఖ దుఃఖముల యందును, వివాహం మొదలు మృత్యువు వరకు గల అన్ని అవస్థలందును హరించుటకు కూడ వీలుపడని ప్రేమాను రాగాలతో కూడికొనియున్నది. మరియు మా దాంపత్యమందు ఎల్లప్పుడు సీత నాక్షేమమే కోరినది అని రాముడు దుఃఖించుటను బట్టి వారి అన్యోన్య దాంపత్య జీవితం మనకు ప్రస్ఫుటముగా తెలియుచున్నది. ఇదంతా మానవ జాతికి ఆదర్శవంతం.

డా॥ జి. పద్మనాభం నా అంతేవాసి, నా పర్యవేక్షణలోనే యమ్. ఫిల్, పి. హెచ్‌డి., లు పూర్తిచేసి ప్రస్తుతం నా సహాధ్యాపకుడుగా వుండటం నాకు సంతోషదాయకం. ఇతను ఇంకా అనేక రచనలు చేయాలని, ఇతని రచనలు పాఠక లోకానికి తప్పక ఉపయోగపడగలవని, అందులకు ఆ ఏడుకొండల వేంకటేశ్వరుడు ఇతనిని అనుగ్రహించాలని మనసారా అభినందిస్తున్నాను.

--: శుభం :--

**డి. నరసింహారెడ్డి.**



# అభినందన

డా॥ కె. ప్రతాప్,
ప్రొఫెసర్,
సంస్కృతవిభాగము,
శ్రీవెంకటేశ్వర విశ్వ విద్యాలయం,
తిరుపతి.

'ఆసమంతాత్ దర్శయతీతి ఆదర్శః, దర్పణః' అని నిర్వచనం. దూరంగా వున్నవాటిని దగ్గరగానూ, దగ్గరవున్నవాటిని దూరంగానూ సూక్ష్మ పదార్థాలను స్పష్టంగానూ, బృహదాకారాలను మరుగుజ్జులు గానూ చూపించేవి ఆదర్శాలు (Mirrors). భూత, భవిష్యత్కాలాలను వర్తమానంలో వర్తమానాన్ని భవిష్యత్తులో ప్రతిఫలింపజేసేవి కావ్యాదర్శాలు (Poetic mirrors). ప్రతిఫలించే వస్తు స్వరూపస్వభావాలు దర్పణం యొక్క ఉపరితల సమత్వ, స్వచ్ఛతలమీద ఆధారపడివుంటాయి. సత్యశోధనలో అవిశ్రాంత ప్రయత్నంతో అవిచలితమానసంతో తపించి, తపించి లోకోత్తర సమతాస్వచ్ఛతలను సంతరించుకున్నది వాల్మీకి హృదయాదర్శం. అందులో ప్రతిఫలించిన అపురూప చిత్రమే శ్రీమద్రామాయణము.

ఆధ్యాత్మిక ప్రపంచం బ్రహ్మ, జగత్, జీవ పదార్థాల చుట్టూ తిరిగినట్టు సారస్వత ప్రపంచం కవి, కావ్యం, రసజ్ఞుల చుట్టూ తిరుగుతుంది. ఆదికవి వాల్మీకి కవులకు ఆదర్శం.

ఆదికావ్యం రామాయణం కావ్యాలకు ఆదర్శం. రసనిధి, రసజ్ఞులప్రతినిధి శ్రీరాముడు మానవత్వానికే ఆదర్శం. ఇలా రామాయణ మహాకావ్యం వాల్మీకి హృదయకవాటంలోంచి సాధారణ జనమనోఫలకాలమీద ప్రతిఫలించిన కాంతిపుంజం. అందులోని పాత్రలు, ప్రదేశాలు, సన్నివేశాలూ, సమస్తమూ ఆదర్శమయాలే. కదలని శిలలు, కదిలేనావలు, ఎగిరేపక్షులు, తిరిగే కోతులు, పారేనదులు చేతనత్వంతో పల్లవిస్తుంటాయి, నూతనత్వంతో పరిమళిస్తుంటాయి. యావత్సృష్టినీ ఆదర్శమయం చేసిన మహనీయుడు వాల్మీకి మహర్షి అయితే శతాబ్దాలపాటు భారతీయ జనజీవనసరళిని శాసించిన, శాసిస్తూవున్న కావ్యం రామాయణము.

మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమ శ్శాశ్వతీస్సమాః ।
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్ ॥

అనే శ్లోకంతో ఆరంభమైన రామాయణమును ఆధారంగా చేసుకొని భారతీయ సాహిత్యం పరిపుష్టమైంది. ఎందరో కవులు రామాయణాంశాలనే కథావస్తువులుగా తీసుకొని కావ్యాలను నాటకాలను అల్లినారు. కాళిదాసు, భవభూతి, భోజుడు, మురారి ఒక్కరేమిటి ఎందరెందరో కవులు శ్రీమద్రామాయణాన్ని ఆధారంగా చేసుకొని ఎన్నెన్నో గ్రంథాలను రచించినారు. ఎవరికి ఏమి కావాలన్నా ఈ గ్రంథంలో దొరుకుతూ ఉంది. యిట్టి లోకోత్తరమైన ఈ గ్రంథాన్ని పరిశీలించిన వారిలో ఈ గ్రంథకర్త డా॥ జి. పద్మనాభం గారు ఒకరు. సామాన్య రైతుకుటుంబంలో జన్మించిన శ్రీయుతులు పద్మనాభం గారు శ్రీమద్రామాయణాన్ని పూర్తిగా పరిశీలించి ''శ్రీమద్రామాయణం-పాత్రల ఆదర్శం'' అనే ఈ గ్రంథాన్ని రచించి యున్నారు. యువకులు ఉత్సాహశీలురు, గురుభక్తి సంపన్నులు, వినీతులైన డా॥ జి. పద్మనాభంగారు ఎంతో కృషిచేసి వాల్మీకి, దశరథ, శ్రీరామ, భరత, శత్రుఘ్న, సుమంత, సీత మొదలైన పాత్రలు ఈనాటి సమాజానికి ఎలా ఆదర్శప్రాయులో సోదాహరణముగా వివరించి యున్నారు. ఎంతో శ్రమకోర్చి రచించిన ఈ గ్రంథానికి పాఠకులెంతైనా ప్రోత్సాహమంద చేయవలెనని, మున్ముందు యిలాంటి గ్రంథాల నెన్నింటినో రచించాలని సప్తాద్రినాథుడు వీరికి, వీరి కుటుంబానికి ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించాలని ఆకాంక్షిస్తున్నాను.

1-4-98. **డా॥ నలచక్రవర్తి.**



# ప్రస్తావన

శ్రీమద్రామాయణం మనకు ఆదికావ్యం. ఈగ్రంథము మనదేశ సాహిత్యంపైన, వ్యక్తులపైన ఎంతో ప్రభావమును చూపుతున్నది. ఈగ్రంథము వ్రాయబడి కొన్ని వేల సంవత్సరాలు కావస్తున్నా దీనిప్రభావము మాత్రము ఈనాటికి అవిచ్ఛిన్నముగా కొనసాగుతున్నది. సూర్యచంద్రాదులున్నంత వరకు ఇది అలాకొనసాగుతూ ఉంటుంది.

మన భారతీయ వాఙ్మయానికి వేదాలే మూలాలు. అలాగే శ్రీమద్రామాయణానికి కూడా వేదములే మూలములు. వేదప్రామాణ్యంలేని గ్రంథాలకు మన దేశంలో విలువుండదు. అందువలన వాల్మీకి మహర్షి కూడా వేదాలనే ప్రమాణముగా తీసికొని వేదాలలో వివరింపబడ్డ అంశాలనే శ్రీమద్రామాయణంలో వివరించారు.

**వేద వేద్యే పరేపుంసి జాతే దశరథాత్మ జే ।**

**వేదః ప్రాసాతసాధాసీత్ సాక్షాద్రామాయణాత్మనా ॥**

అనే శ్లోకమే యిందుకు ప్రమాణము. దీన్ని బట్టి వాల్మీకి ద్వారా వేదమే రామాయణంగా వెలువడిందని తెలియుచున్నది.

వేదాలు మానవ ఆదర్శ జీవనానికి ప్రతీకలుగా ఉన్నాయి. వేదాలను ఆధారంగాతీసుకొని రచింపబడ్డ రామాయణంలో కూడా ఆదర్శానికి పెద్దపీట వేయబడినది. ఆదర్శంలేని కావ్యంగాని జీవనంగాని వ్యర్థమే. ఈనాడు సమాజంలో అవకాశవాదాలు పెచ్చరిల్లుతూ వున్నాయి. ఆదర్శానికి స్థానమే లేదు. సమాజం తన విధులను తాను సక్రమంగా నిర్వర్తించడానికి ఆదర్శ గుణాలు ఎంతయినా అవసరం. ఇలాంటి ఆదర్శ గుణాలకు నిలయమైనది రామాయణం. దీనిలోని ఆదర్శగుణాలు ప్రజలకు తెలియ జేయాలనే తలంపుతో ఈ గ్రంథం వ్రాయబడింది. రామాయణంలోని ప్రతిపాత్ర అనేక ఆదర్శగుణాలతో తొనకిసలాడుతున్నది. కావ్యకర్త వాల్మీకి మొదలు కొని దశరథుడు, శ్రీరాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు మొదలగు పురుషపాత్రలు కౌసల్య, సుమిత్ర, సీత మొదలగు స్త్రీ పాత్రలు నాటి నేటి సమాజానికి ఏయే గుణాలలో ఎలా ఆదర్శపాత్రలుగా ఉన్నారో యిందు సోదాహరణంగా వివరించడం జరిగినది.

'రామాయణం - పాత్రల ఆదర్శం' మొదటి భాగం అనే గ్రంథంలో కేవలం మానవ జాతికి సంబందించిన స్త్రీ, పురుష పాత్రల ఆదర్శం, గుణాలు యిందులో

వివరించడం జరిగింది. ద్వితీయ భాగంలో వానరుల, మహర్షుల, రాక్షసుల ఆదర్శ గుణాలు వివరించబడ్డాయి. కాలాంతరమున ద్వితీయ భాగం కూడా ముద్రణకు నోచుకొనగలదని ఆశిస్తున్నాను. ఎంతో కష్టపడి రచించిన ఈ గ్రంథము పాఠకలోకానికి కొంతయినా ఉపయోగపడితే అదే పరమానందంగా భావిస్తాను.

## కృతజ్ఞతా నివేదనము

'రామాయణం - పాత్రల ఆదర్శం' అను గ్రంథ రచనకు శ్రీకారం చుట్టించిన మా విశ్వ విద్యాలయం ప్రొఫెసర్, ప్రస్తుత రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం కులపతులు, అనేక పురస్కారగ్రహీతలు, బహుగ్రంథకర్తలు మాగురువులైన ప్రొ॥ యస్. బి. రఘునాథాచార్యులు గారికి భక్తిపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఈగ్రంథమును పరిశీలించి 'ముందు మాట'ను వ్రాసి శిష్యవాత్సల్యముతో నిరంతరము ఎనలేని ప్రోత్సాహమునందించుచున్న గురువర్యులు డా॥ డి. నరసింహారెడ్డి గారికి నాహృదయ పూర్వక కృతజ్ఞతలు సమర్పించు కొనుచున్నాను.

అడిగినదేతడవుగా నాపై వాత్సల్యంతో అభినందనను రచించి యిచ్చిన ప్రస్తుత శాఖాధ్యక్షులు, సహృదయులు, గురువులైన ప్రొ॥ K. ప్రతాప్ గారికి మనః పూర్వక కృతజ్ఞతాంజలులు సమర్పించుకొనుచున్నాను.

మరియు నాకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను విద్యార్థిదశ నుంచి సహాయ సహకారాలందించి నన్ను అన్ని విధముల అన్ని వేళల ప్రోత్సాహపరచిన మాగురువర్యులు శ్రీ B.C.హుస్సేనిగారికి, తక్కిన సహాధ్యాపకులకు కృతజ్ఞతాభివందనాలు.

మరియు ఆధ్యాపక జీవనములో సదా ఉత్సాహమును కలుగజేయుచు ప్రగతి పథంలో నడిపింపచేయుచూ, శిష్య వాత్సల్యంచే ప్రోత్సాహం నందజేయుచున్న గురువులు, బహుగ్రంథకర్త, సహృదయులు మరియు అడిగినదే తడవుగా 'అభిప్రాయం' వ్రాసిచ్చిన డా॥ కానాల నలచక్రవర్తిగారికి, హృదయ పూర్వక ధన్యవాదములు తెలుపుకొంటున్నాను.

ఈ గ్రంథరచనకు చేదోడు వాదోడుగా తన సంపూర్ణసహకార మందించిన నా శ్రీమతి 'మనోరమ' కు ప్రేమ పూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ముద్రణకు ధన సహాయమునంద చేసిన తిరుమల తిరుపతి దేవస్థానముల వారి యాజమాన్యమునకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియచేయుచున్నాను.

ఈ గ్రంథరచనకు సహకార మందించిన మిత్రులు శ్రీదశరథగారికి, ఈగ్రంథమును చక్కగా తీర్చిదిద్ది ముద్రించి యిచ్చిన శ్రీ సత్యసాయి గ్రాఫిక్స్ వారికి కృతజ్ఞతలు తెలియ జేయుచున్నాను.

నమస్సుమాలతో,

**డా॥ జి. పద్మనాభం.**

లెక్చరర్,

సంస్కృత విభాగము,

యస్. వి. యూనివర్శిటీ,

తిరుపతి.

★★★



# విషయసూచిక





# ఆదికావ్యం - రామాయణం

శ్రీమద్రామాయణము ఆదికావ్యముగను, ఇతిహాసముగను పరిగణింపబడుచున్నది. ఇది ఒక్క సంస్కృత వాఙ్మయమునకేగాక సర్వవాఙ్మయములకును ఆది కావ్యమే. లౌకిక సంస్కృత భాషలో ఛందోరూపమున వెలువడిన మహాకావ్యము కనుకనే ఇది ఆది కావ్యమనియు దీనిని రచించిన వాల్మీకి ఆదికవి యనియు పేర్కొన్నారు. రామాయణంలో 24,000 శ్లోకాలున్నవి. అది ఏడుకాండలుగా విభజింపబడినది. అవి బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ, ఉత్తరకాండలు.

లోకోత్తర గుణోత్తరుడగు శ్రీరామచంద్రుని ఆదర్శచరిత్రమును వర్ణించుటచే--

**కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్ ।**
**పౌలస్త్య వధ మిత్యేవం చకార చరితవ్రతః ॥ బాల. కా. 4-7.**

ఈమహాకావ్యము శ్రీమద్రామాయణ మనియు, సమస్త నారీలోకమునకు తన సౌశీల్య సచ్చారిత్రముచే ఆదర్శభూతమై సకల సద్గుణములకును నిలయమైన పవిత్ర చారిత్రమును వర్ణించుటచే 'సీతాయాశ్చరితం' అనియును, ధర్మము నణచివేయుటయే పనిగ బెట్టుకొని దీన, సాధ్వీసాధుజనులను బాధించుటయే వృత్తిగ స్వీకరించి లోకపతనము గావించుచు, తన కత్తికెదురు లేక మదోన్మత్తుడై అధర్మమార్గమున సంచరించు రావణుని వధను వర్ణించుట ద్వారా 'పౌలస్త్యవధ' మనియును వ్యవహరింపబడుచున్నది. రామాయణము 'అభిగీతమిదం గీతమ్' తంత్రీ, లయ సమన్వితమై గాన యోగ్యముగుటచే 'గీత' మనియును, రఘువర చరిత్రమును వర్ణించుటతో పాటు ధర్మార్థకామ మోక్షరూపములగు చతుర్విధ పురుషార్థములను వర్ణించుట చేత ఇతిహాసము లేక చరిత్ర అనియును లోకోత్తరములను, సరసములును అగు అర్థములను వర్ణించుటను బట్టి మహాకావ్యమనియును వ్యవహరింపబడుచున్నది.

వాల్మీకి రామాయణము నందువలె భారతీయ గృహజీవిత మంత సమగ్ర సుందరముగ మరెక్కడను వర్ణింపబడలేదు. తల్లి, తండ్రి, భర్త, భార్య, కుమారుడు,

కూతురు, అన్న, తమ్ముడు, వదిన, మరదలు, దాసి, యజమానుడు, సేవకుడు, మిత్రుడు, శత్రువు మున్నగు వారు కుటుంబమునకు సంబంధించిన వారు. వీరు ఒకరి ఎడల మరొకరు ఎట్లు ప్రవర్తింపవలెనో రామాయణము చక్కగ విశదీకరించు చున్నది. భారతీయ సంస్కృతికి ఆధారమై సర్వప్రశంసా పాత్రముగ చేసిన కుటుంబ జీవిత సౌష్ఠవమునకు రామాయణము దర్పణము వంటిది.

రాముడు తండ్రియైన దశరథుని ఎడలను, తల్లుల ఎడలను, ముఖ్యముగ సవతి తల్లియైన కైక ఎడలను తమ్ముల ఎడలను, భార్య అయిన సీత ఎడలను, మిత్రుడైన సుగ్రీవుని ఎడలను, భక్తులైన గుహుడు, శబరి, హనుమంత, విభీషణాదుల ఎడలను, సహాయుడైన జటాయువు ఎడలను ప్రవర్తించిన విధము ఆదర్శప్రాయమైనది. అట్లే సీత-- భార్యగను, కోడలుగను, పతివ్రతగను, లక్ష్మణ భరతులు-- సోదరులుగను ప్రవర్తించిన విధము సర్వాదర్శ ప్రాయము.

వాల్మీకి రామాయణము ద్వారా లోకమున కిచ్చిన సందేశము సర్వశిరోధార్యమైనది. సత్యధర్మములు ఎన్ని ఆటంకములకుగురియైనను చివరికి విజయమును పొందును. సీతారాముల వృత్తాంతమిందులకు మంచి నిదర్శనము. త్యాగము ప్రశంసనీయమైన గుణము. దీనిని ప్రచారము చేసిన వారు శాశ్వతమైన కీర్తిని పొందుదురు. రాముడు, లక్ష్మణుడు, భరతుడు చేసిన త్యాగములు చాల గొప్పవి. అందువలననే వారి కీర్తి నేటికీ అజరామరమై విరాజిల్లు చున్నది.

రావణుడు దిక్పాలురను, సర్వలోకములను జయించిన మహావీరుడు. అయినను కాముకుడై సీత నపహరించి సబంధు మిత్రముగ నాశనమాయెను. ఇతర గుణసంపద ఎంతయున్నను కామమునకు వశుడైనవాడు వినాశము పొందును. కైక మంథర దురుపదేశమువిని లోకమున ఎంతో అపకీర్తి తెచ్చుకొన్నది. రాజ్యాంగము, లౌకిక భోగవాంఛయు మానవులకు ధ్వంసము చేకూర్చును. కైకయు, వాలియు యిందుకు నిదర్శనములు. కృతజ్ఞతను మించిన ఇంకొక గుణము లేదు. రాముడు జటాయువు నెడను, సుగ్రీవునెడను, హనుమంతుని ఎడలను ప్రవర్తించిన విధానము యిందుకు ఉదాహరణములు.

రామాయణమున కథా సన్నివేశములు సూచించు ఈ సామాన్య నీతులేగాక రాజనీతి కూడ విశదీకరించబడినది. ఇది చిత్రకూటమునకు వచ్చిన భరతుని రాముడు పరిపాలనము గూర్చి వేసిన ప్రశ్నల వలన తెలియుచున్నది. ఇదంతయు మున్ముందు సహేతుకముగ వివరించబడినది.



# రామాయణ రచన

భారతీయ సంస్కృతికి వేదములు ప్రమాణములు. వేదముల యందలి భాష అతి ప్రాచీనమైనది. అందుకనే మహర్షులు వేదములలోనున్న నీతి, ధర్మ, తత్త్వాదులను సులభముగ భోదించుటకు లౌకిక సంస్కృత భాషలో కథ, ఉపాఖ్యాన బహుళములైన గ్రంథములను వ్రాయుటను ప్రారంభించిరి. వేదార్థోప బృంహణమే వారి ప్రధాన ఉద్దేశ్యము. అట్లు లౌకిక సంస్కృత భాషలో మొట్టమొదటి కావ్య రచన సాగించిన వాడు వాల్మీకి మహర్షి. అందువలననే ఆదికవియనియు, అతడు రచించిన కావ్యమునకు ఆదికావ్యమనియు ప్రసిద్ధికలిగినది.

**వేద వేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే ।**
**వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా ॥**

పరమ పురుషుడైన శ్రీమన్నారాయణుడు దశరథాత్మజుడైన శ్రీరామచంద్రుడుగ అవతరింపగనే పరమపురుషతత్త్వ వర్ణన ప్రధానమైన వేదము శ్రీమద్రామాయణముగ అవతరించినది. దీనిని బట్టి పరమపురుషునికి శ్రీరామునికి, వేదమునకు శ్రీమద్రామాయణమునకును, భేదము లేదని తెలియుచున్నది. వాల్మీకి రామాయణమున తాను రామాయణమును రచించిన స్థితులు వివరించెను.

**తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ ।**
**నారదం పరి పప్రచ్ఛ వాల్మీకిర్మని పుంగవమ్ ॥** బా.కా.1-1.

దేవర్షియగు నారదుడొకసారి వాల్మీకి ఆశ్రమమునకు వచ్చెను. తపస్సంపన్నుడు వేదాధ్యయన తత్పరుడు, విద్వాంసులలో శ్రేష్ఠుడగు ఆమహర్షిని వాల్మీకి యిట్లు ప్రశ్నించెను--

**కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్ ।**
**ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో ధృఢ వ్రతః ॥**
**చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః ।**
**విద్వాన్ కః కః సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః ॥**
**ఆత్మవాన్ కో జిత క్రోధోద్యుతిమాన్ కోఽనసూయకః ।**
**కస్యబిభ్యతి దేవాశ్చ జాత రోషస్య సంయుగే ॥** బాల. కా. 1.2-4.

ఈమర్త్యలోకమున ఉత్తమగుణములు గలవాడు, వీర్యవంతుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యమును పలుకువాడు స్థిర సంకల్పం గలవాడు, ఉత్తమ చారిత్ర సంపన్నుడు, సర్వభూత హితకరుడు, విద్వాంసుడు, సమర్థుడు, ప్రియదర్శనుడు, ఆత్మవంతుడు కోపమును జయించినవాడు, అసూయలేనివాడు ఎవరో నాకు తెలుపుము.

నారదుడు అప్పుడు అట్టి గుణములు కలవాడు ఇక్ష్వాకు వంశము నందు పుట్టిన రాముని యందు గలవని అతని గుణగణములు ఈవిధంగా వర్ణించి చెప్పెను.

**ఇక్ష్వాకు వంశ ప్రభవో రామో నామ జనైః శ్రుతః ।**
**నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ ॥**
**బుద్ధిమాన్ నీతిమాన్ వాగ్మీ శ్రీమాన్ శత్రునిబర్హణః ।**
**విపులాంసో మహాబాహుః కంబు గ్రీవో మహాహనుః ॥**
**ధర్మజ్ఞః సత్యసంధశ్చ ప్రజానాంచ హితేరతః ।**
**యశస్వీ జ్ఞాన సంపన్నః శుచిర్వశ్యః సమాధిమాన్ ॥**
**ప్రజాపతి సమః శ్రీమాన్ ధాతా రిపునిసూదనః ।**
**రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా ॥** బా.కా.1: 8,9,12,13.

శ్రీరాముడు సమస్త జీవలోకమునకు రక్షకుడు. ధర్మపరిరక్షకుడు. స్వధర్మ స్వజన పరిపాలకుడును, వేద వేదాంగ తత్త్వజ్ఞుడును, సర్వలోక ప్రియుడు, సాధువు యుక్తాయుక్త వివేచన శీలి, సకల సద్గుణ సంపన్నుడు అని తెలిపి అతనికి దశరథ మహారాజు యువరాజ్యాభిషేకము చేయనెంచుటను మొదలుకొని, అతడు రావణ సంహారము చేసి సీతాసమేతుడై తిరిగి అయోధ్యానగరమునకు వచ్చి పట్టాభిషిక్తుడగు నంతవరకు జరిగిన శ్రీరామచరిత్రను వర్ణించి వెళ్లిపోయెను.

నారదుడు వెళ్లిపోయిన అనంతరము కొంతసేపటికి వాల్మీకి మహర్షి భరద్వాజుడను శిష్యుని వెంటబెట్టుకొని మాధ్యాహ్నిక క్రియలను నిర్వర్తించుటకు తమసా నదికి వెళ్లెను. ఆనదీ పరిసరములందు వ్యాపించి యున్న అరణ్యము, నయనానందకరముగ నుండెను. వాల్మీకి తన చేతిలోని కమండలమును నదీతీరమున నుంచి ఆ అరణ్యశోభను తిలకించుచు ఇటు నటు తిరగసాగెను. అట్టి సమయమున ఒక చోట విడివడక రతిసూచకమగు మధురకూజిత మొనరించు క్రౌంచ ద్వంద్వమును చూచెను. అపుడొక కఠినాత్ముడగు నిషాదుడు కరుణలేక అధర్మమని తలంచక సుఖముగ చరించు ఆపక్షి మిథునములోని మగపక్షిని ఆ మహర్షి చూచుచుండగనే బాణముతో కొట్టెను. అది చూచుచుండగనే ప్రాణములు విడచెను.

యిట్లు మగ పక్షి ప్రాణములు విడచుటను చూచి ఆడపక్షి మిక్కిలి కరుణ స్వరమున కూసెను. ఆపక్షియొక్క కరుణ స్వరమును విని ధర్మాత్ముడైన వాల్మీకి

మహర్షియొక్క హృదయము కరిగిపోయెను. యిట్టి దారుణమైన దృశ్యమును చూచుటచే జాలికలిగి శోకము ఉప్పొంగగ అప్రయత్నముగ అతని నోటినుండి ఛందోబద్ధమైన ఈ క్రింది వాక్కు వెలువడెను.

**మా నిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః ।**
**యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితమ్ ॥**

**బాల.కా.2-15.**

ఓ నిషాదుడా! క్రౌంచ మిథునము నుండి కామమోహితమైన మగపక్షిని వధించితివి. కావున నీవు చిరకాలము ప్రతిష్ఠను పొందకుందువుగాక! అని నిషాదుని శపించు ఆవచనములు తననోట ఎందుకు వెలువడినవని చింతించుచు శిష్యుని చూచి పాదబద్ధము అక్షర సమము, తంత్రీలయ సమన్వితములైన ఈ వచనముల సముదాయము శ్లోక మగును అని పలికెను. శిష్యుడందుకు సమ్మతించెను. తరువాత తమసా నదిలో స్నానము చేసి శ్లోకోత్పత్తి రూపమగు ఆవిషయమునే తలంచుచు ఆశ్రమమునకు పోయెను.

అక్కడ లోకకర్తయగు బ్రహ్మదేవుడతని ఆశ్రమమునకు వచ్చెను. అతనిరాకకు సంభ్రమాశ్చర్యములు చెంది వాల్మీకి లేచి ప్రాంజలిఘటించి అర్ఘ్య పాద్య ఆసనాదులచే అతనిని సంప్రీతుని చేసి ఉచితాసనమున కూర్చుండ బెట్టి తానును తన ఆసనమున కూర్చుండెను. తమసా నదీతీరమున జరిగిన సంఘటనను గూర్చి ఆలోచించుచు మాటి మాటికి మనసులో దుఃఖించసాగెను. దానిని చూచి బ్రహ్మ నవ్వుచు యిట్లనెను.

ఓ మహర్షీ! నీచేత నిబద్ధమైన ఆ ఛందము శ్లోకమేగాని, పదసముదాయముగాని లేక శాపమోకాదు. నీవు విచారింపకుము. ఛందోమయమగు ఆవాక్కు నా సంకల్పము ననుసరించియే నీ ముఖము నుండి వెలువడినది. అంతేగాని అతర్కికముగ సంభవించినదిగాదు. కావున ఓ మునిశ్రేష్ఠా!

**రామస్య చరితం సర్వం కురు త్వమృషి సత్తమ ।**
**ధర్మాత్మనో గుణవతో లోకే రామస్య ధీమతః ॥** **బా.కా. 2-32.**

నీవు ధర్మాత్ముడగు శ్రీరాముని చరిత్రమును నారదుని వలన ముందు వినిన వృత్తాంతము నాధారముగ చేసుకొని రామాయణమును రచింపుము. నా అనుగ్రహము వలన అతని వృత్తాంతమంతయు నీకు స్పష్టముగ తెలియగలదు.

**నతే వాగనృతా కావ్యే కాచిదత్ర భవిష్యతి ।**
**కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్ ॥**

**బాల.కా.2-36.**

నీవు రచించ బోవు కావ్యమున ఏవిషయము అసత్యముగాని, దోషయుక్తముగాని కానేరదు. కావున నీవు శ్లోకబద్ధమైన పాపములు పోగొట్టి ఆనందమును కలిగించు రామకథను రచింపుము.

ఈ విధముగ బ్రహ్మదేవునిచే ఆజ్ఞాపింపబడి భగవాన్ వాల్మీకి 'మా నిషాద ప్రతిష్ఠాంత్వం' అనుశ్లోకము ననుసరించి లౌకిక ఛందము నందు శ్రీరామ చరిత్రను రచించెను.



# రామాయణ ప్రాశస్త్యము

రామాయణము భారతదేశీయ కావ్యము. అందలి కథతోడను, పాత్రలతోడను అంతో ఇంతో పరిచయములేని భారతీయు లెవ్వరు ఉండరు. వాల్మీకి రామాయణమునకు లోకమున ప్రశస్తి కల్గుటకు అది అవతార పురుషుడగు శ్రీరాముని చరిత్రయగుటయు, దానిని ఆదికవి రచించుటయు మాత్రమేగాక మరికొన్ని యితర కారణములు కూడ యున్నవి.

**కావ్యం యశసేఽర్థకృతే వ్యవహార విధేశివేతరక్షతయే ।**
**సత్యఃపర నివృతయే కాంతా సమ్మితతయోపదేశయుజే ॥**

**కావ్యప్రకాశము.**

పూర్వలాక్షణికులు కావ్యము యశోధనములు కూర్చుననియు, వ్యవహారవేత్తృతను గల్గించుననియు, అమంగళమును నాశనము చేయుననియు, సద్యఃపర నిర్వృతి నాపాదించుననియు, కాంతా సమ్మితత్వముచే సదుపదేశము నొసంగుననియు, తత్ప్రయోజనములను మాత్రమే చెప్పియున్నారు. ఇతర కావ్యములు వీనిలో కొన్ని ప్రయోజనములను మాత్రమే సమకూర్చజాలును. అన్ని ప్రయోజనములను సమకూర్చ గలుగునది శ్రీమద్రామాయణ మొక్కటియే. దీనిని పఠించిన సర్వ వ్యవహారవేత్త యగుననుటలో సందేహములేదు. యిప్పటికిని క్లేశ అమంగళ పరిహారమునకు భారతీయులు సామాన్యముగ శ్రీమద్రామాయణమును, విశేషముగ సుందర కాండమును పారాయణము చేయుదురు. మరియు దీనిలోని ప్రతి కాండము నందును ఉపదేశ రత్నములు కలవు.

రామాయణ మహాభారతాలు మానవజీవితాన్ని ప్రభావితం చేసినట్లుగా మరేగ్రంథం చేయలేదని జవహర్‌లాల్ నెహ్రూ తాను రచించిన 'The Discovery of India' అనే పుస్తకంలో యిలా పేర్కొన్నాడు.

I do not know of any books any where which have excercised such a continuous and pervasive influence on the mass mind as these two (Ramayana and Maha Bharata) dating back to a remote antiquity they are still a living rorce; in the life of the Indian people not in the original Sanskrit except for a few intellectuals but in translations and Adaptations and in those innumerable ways in which tradition and legend spread and become a part of the texture of a people's life.

మరియు Winternitz అనుపాశ్చాత్య పండితుడు రామాయణమును గూర్చి చెప్పుచు-- రామాయణముయొక్క కాంతులు ఒక్క భారతదేశమునవేగాక ఖండాంతరములకు కూడా వ్యాపించినవి.

"It is a true popular epic like the Maha Bharata and has become the wealth of the whole nation. Scarcely has any other poem in the range of whole literature influenced the poetry and the life of the people for centuries. It has been kept alive for more than twenty centuries and continues to live. People of all grades and classes, high and low, princes and peasants, merchants and artisans, princesses and shepherdesses all are familiar with the characters and story of the great epic." అని చెప్పినాడు. ఇతడు చెప్పిన దానిలో అతిశయోక్తి యిసుమంతయులేదు.

భగవాన్ వాల్మీకి తన రామాయణం ద్వారా గృహస్థాశ్రమ ప్రాశస్త్యమును నిరూపించుటతో పాటుగ అందలి మాధుర్యమును పాఠకులకు తెలియజేస్తూ అట్టి ఆశ్రమ సాఫల్యమునకు సంపూర్ణమగు అనుశాసన పాలనము ఎట్లా ఆవశ్యకమో నిరూపించి అట్టి అనుశాసనమునకు కట్టుబడినవాడు ఎట్టి కష్టములనైనను అధిగమించగలడని చక్కగ నిరూపించినాడు.

గృహస్థాశ్రమమును ఒక రథముతో పోల్చిన, అందు భార్యా భర్తలిరువురును ఆరథమును లాగు గుఱ్ఱముల వంటివారు. ధర్మము ఆరథమును నడుపు సారధి, అర్థకామమయమగు సంసారము దాని మార్గము, మోక్షము గమ్యస్థానము. ఈ విషయమును భగవాన్ వాల్మీకి రామాయణమున వివరించినాడు.

సమాజము, వ్యక్తి, రాజు, కుటుంబము అందలి సభ్యులు వారికి పరస్పరముండవలసిన సంబంధ బాంధవ్యములు, వారు పరిపాలింపవలసిన సామాజిక ధార్మిక కర్తవ్యములు మొదలగునవి చక్కగ నిరూపించి వారిమధ్య సంఘర్షణము లేకుండుట విశ్వశాంతికి దోహదము చేయునని రామాయణమున చక్కగ ప్రతిపాదితమైనది.

మానవుడు భౌతిక - ఆధ్యాత్మిక అభ్యుదయములను సాధింపవలెనన్న ఇంద్రియ జయము ఆవశ్యకము. కామ క్రోధాదులను అదుపులో పెట్టక వానిని ఉచితస్థానమున ప్రయోగింపక ఇంద్రియములకు వశుడై, చరించువాడు ఎంత ఐశ్వర్యవంతుడైనను అభ్యుదయములకు దూరమై తప్పక నశించును. అని వాల్మీకి మహర్షి తన రామాయణం ద్వారా తెలియజేశాడు.

**ధర్మాదర్థః ప్రభవతి ధర్మాత్ప్రభవతే సుఖమ్ ।**
**ధర్మేణ లభతే సర్వం ధర్మసారమిదం జగత్ ॥**

**ఆత్మానః నియమై స్తైస్తైః కర్శయిత్వా ప్రయత్నతః ।**
**ప్రాప్యతే నిపుణై ర్ధర్మో న సుఖాల్లభ్యతే సుఖమ్ ॥** అర.కా.9.31-32.

అట్లే ధర్మపాలనమున అర్థకామ ప్రాప్తి కలుగు ననియు ధర్మమునకు అసాధ్యము ఏదియును లేదనియును, ధర్మము సర్వసుఖ మూలమనియును ఈప్రపంచ మంతయును ధర్మసార భూతమనియును అట్టి ధర్మమును ఆచరించుట కష్టసాధ్యమైనను మానవునకభ్యుదయ హేతువగుటచే ధర్మమార్గమును మేధావులందరు అనుసరించి మానవ జన్మను సార్థక మొనరించుకొనవలెనని ఈ రామాయణము ద్వారా తెలియజేశాడు.

వాల్మీకి రామాయణమునందు ధ్వని రూపముగ మనకు అందించెడి సందేశము దీని విశ్వజనీనతను కలిగించు చున్నది. కేవలము రామ రావణుల పాత్రలు మాత్రమే కాదు అనేక పాత్రలు మనకు సందేశము నిచ్చుచున్నవి. మనకు రామలక్ష్మణులవలె సోదరులు కలసి ఉండవలెనని వాచ్యముగ ఎచటను లేదుగాని ధ్వనిరూపమున మనకు తెలియుచునే యున్నది. కొడుకు అడవికి పోగా మరణించెడి తండ్రి, తల్లిమాటచే సంక్రమించెడి రాజ్యమును ఆశచే తీసికొనక మరల అర్పించెడి భరతుని వంటి సోదరుడు, రాజవంశమున జన్మించి భర్తతో పాటు అడవులకేగి అడవులలోనే సౌఖ్యమును వెదుకు కొని శత్రువు బెదిరింపులకు లొంగక, భర్తవలన విడుదలకు ఎదురు చూచెడి భార్య మనకు లోకమున కానరారు. అన్న చేసిన తప్పులను ఎత్తి చూపి చివరకు ఒక కట్టుబాటుతో శక్తికిమించి యుద్ధము చేసి ప్రాణములు విడిచిన కుంభకర్ణుడు, తండ్రియాజ్ఞను తప్పైనను శిరసావహించి ప్రాణములను వదలినట్టి కొడుకైన ఇంద్రజిత్తు, సోదరుడు ఎంత గొప్పవాడైనను వాడు చేసిన తప్పును చాటి చెప్పి వినకున్నచో వదలి, గుణజ్యేష్ఠుడైన రామునివంటి వానిని ఆశ్రయించుటకు జంకని విభీషణుని వంటివాడు, మనకు లోకమున కానరారు. శూర్పణఖలున్నారు, తారలున్నారు, రుమలున్నారు, అంగదులున్నారు. వీరందరు చేసిన ఉపదేశము వారినడతలలో మనకు వ్యక్తమగు చున్నది. లక్ష్మణ, హనుమత్, సుగ్రీవుల, సేవా సహకారములలో వైవిధ్యము, విశ్వామిత్ర జటాయు, ప్రభృతులలో స్వభావ భేదము వీటన్నిటినీ గమనించినచో ఇది సంపూర్ణ మానవకోటి జీవితమునకు అన్ని కాలములకు అవసరమైన ఉపదేశము లివ్వగలవి.

ఇది బృహత్ కావ్యము. కథకు సంబంధ మైన అవాంతర కథలు తమ పరిమితిని దాటక కవియొక్క నిర్మాణ దక్షతను, నిగ్రహమును, తెలుపు చున్నవి. తర్వాత తరముల వారికి సందేశము నిచ్చు చున్నది. యింతటి మహాకావ్యత్వం గల రామాయణం తరువాత వచ్చిన కవులకు ఎందరికో ఆధారభూతమైనది.

వాల్మీకి ఉత్తరకాండమున రామాయణము యొక్క వైశిష్ట్యమును గూర్చి యిట్లు చెప్పియున్నాడు.

ఏతావదేతదాఖ్యానం సోత్తరం బ్రహ్మపూజితమ్ ।
రామాయణ మితిఖ్యాతం ముఖ్యం వాల్మీకి నాకృతమ్ ॥
తతో దేవాః సగంధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః ।
నిత్యం శృణ్వంతి సంహృష్టాః కావ్యం రామాయణం దివి ॥
యిద మాఖ్యాన మాయుష్యం సౌభాగ్యం పాపనాశనమ్ ।
రామాయణం వేద సమం శ్రాద్ధేషు శ్రావయేద్బుధః ॥
అపుత్రోలభతే పుత్రం అధనో లభతే ధనం ।
సర్వపాపైః ప్రముచ్యేత పాదమప్యస్య యః పఠేత్ ॥
ఏతదాఖ్యాన మాయుష్యం పఠన్ రామాయణం నరః ।
సపుత్రపౌత్రో లోకేఽస్మిన్ ప్రేత్య చేహ మహీయతే ॥

**ఉ.కా.111.13-5,8.**

ఈ రామాయణము బ్రహ్మచే పూజింపదగినది. ఇది భగవత్సంబంధమైనది. కావున దీనిని దేవతలు, గంధర్వులు, మునులు స్వర్గము నందును సర్వదా సంతోషముతో వినుచుందురు. ఈ రామాయణ కథను చదివిన వారికి ఆయుష్షు వృద్ధి చెందును. పాపమును నశింపచేయును. సౌభాగ్యమును యిచ్చును. ఇది వేదముతో సమానమైనది. శ్రాద్ధకాలమునందు వినదగినది. పాదమాత్రమైనా పఠించినచో సంతానము లేనివారికి సంతానము కలుగును. ధనము లేని వారికి ధనము కలుగును. సమస్త పాపములు నమసి పోవును. రామాయణము పఠించువాడు కొడుకులతో, మనుమలతో, సంపదలతో కూడి సుఖపడును. అంత్యమున వైకుంఠమున శాశ్వతమైన సుఖమును పొందును.

ఇంతటి వైశిష్ట్యమున్నది కనుకనే రామాయణమును గూర్చి బ్రహ్మదేవుడు యిట్లు చెప్పినాడు.

యావత్స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే ।
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి ॥ **బాల.కా.2-37.**

ఈ భూతలము పై ఎంతకాలము కొండలు నిలచి యుండునో, ఎంతకాలము నదులుప్రవహించునో అంతవరకు ఈ రామాయణ కథ లోకమున ప్రచారములో నుండగలదు.



# వాల్మీకి

వాల్మీకి శుచి వర్తనుడు. తపోనిధి. బ్రహ్మనిష్ఠుడు. వాల్మీకి ఆశ్రమం గంగానది సమీపంలో తమసా నదీ తీరంలో యున్నదని చెప్పబడినది. మహాత్ముల జన్మవృత్తాంతము కాలక్రమమున నత్యద్భుతముగా పరిణమించుట సకల సారస్వత సిద్ధము. ఈ వాల్మీకిదియు నట్టిదే. వాల్మీకి శబ్దమునకు ''వల్మీకస్యాపత్యం'' వల్మీకము కొడుకనియు, ''వల్మీకాద్బహిరాగతః'' వల్మీకమునుండి బయటకు వచ్చినాడనియు వ్యుత్పత్తులు గలవు. యిందు రెండవ దానిని గూర్చి పద్మ పురాణ మిట్లు చెప్పు చున్నది.

ఒక కిరాతకుడు మహర్షుల ఉపదేశమును బట్టి రామనామము జపించుచు ఒక వనమునందు అట్లే చిరకాలముండగా అతని దేహము చుట్టు చెదలు పుట్ట పెట్టినది. ఆ పుట్టలో అతడట్లే తారకనామము జపించు చుండ ఒకనాడచటికి సప్తమహర్షులు వచ్చి కిరాతా! అని పిలిచిరి. ఆ కేక విని యతడు పుట్టను చీల్చుకొని బయటకువచ్చి వాల్మీకియనుపేర బ్రహ్మతేజ సంపన్నుడైన ఋషియై ప్రఖ్యాతి గాంచెను. ఇది యిట్లుండ వల్మీకుడనునొకముని నొకప్పుడు రేత స్ఖలనము కాగా దానిని ఒక సర్పాంగన మ్రింగెననియు, అది గర్భము దాల్చి మగశిశువును గనెననియు ఆ పిల్లవాడే వల్మీకుని పుత్రుడుగా వాల్మీకి యన్న పేరుగాంచెననియు స్కాంద పురాణము చెప్పుచున్నది.

ఇతడు తపస్సు చేసిన స్థలమందు పుట్టలు పెరిగియుండెను. తపో దీక్షానంతరమితడు ఆ పుట్టలనడుమ నుండి బయటికి వచ్చుటగని వారితనిని వాల్మీకియని పిలిచి యుందురని మనమొక విధముగా పద్మపురాణ సంప్రదాయమును సమర్థించుకొనవచ్చును గాని వల్మీకముని కొడుకని భావించుటయే సముచితము.

మరియు వాల్మీకి మొదట కిరాతకుడనియు దారులు కొట్టి దొంగగా జీవించేవాడని హఠాత్తుగా ఒకానొక సంఘటన వలన అతని హృదయంలో మార్పు వచ్చిందని ఐతిహ్యం. ఆధ్యాత్మరామాయణంలో వాల్మీకి మొదట బ్రాహ్మణుడేగాని కిరాతులతో కలిసి పోయి శూద్రక స్త్రీని వివాహమాడి సంతానాన్ని పొందాడని, దొంగగా జీవిస్తుండగా సప్తర్షుల వలన అతనిలోమార్పు వచ్చిందని చెప్పబడింది.

ప్రాచీన కాలంలో భారతదేశపు తూర్పు సముద్ర తీరభాగమంతా చోళ మండలంగా పేర్కొనబడినది. బ్రిటీష్ కాలంలో అది కోరమండలంగా మారింది.

ఈ సముద్రతీర ప్రాంతవాసులను చోళులని అనేవారు. చోళ శబ్దమే సంస్కృతంలో చోర శబ్దంగా మారింది. చోళులు దారులు కొట్టి నివసించేవారని ఈ అర్థ పరిణామము వల్ల తెలియుచున్నది. వాల్మీకి చోళ జాతికి చెందిన వాడు కాబట్టి అతడు పూర్వాశ్రమంలో దోపిడి కాడని కథ ప్రచారంలోకి వచ్చిందేమో చెప్పలేము.

రామాయణాను సారంగా వాల్మీకి ఆశ్రమం గంగానది సమీపంలో తమసా నది తీరంలో ఉండినది. కాని అతని ఆశ్రమం గంగానదికాక ఇప్పటి బుందేల్‌ఖండ్‌లోని బందా జిల్లాలో అలహాబాదు సమీపంలో యమునా నదీ తీరంలో ఒకపర్వతం మీద వుండేదని కొందరు అభిప్రాయపడుచున్నారు. ఇదే చిత్రకూట మనియు చెప్పబడింది. ఒకవేళ ఇది నిజమైనచో వాల్మీకి ఆశ్రమం అయోధ్యా సమీపంలోనే వుండేది. కాని వాల్మీకి రామాయణంలో పేర్కొన్న స్థలాలను జాతుల పేర్లను బట్టి అతనికి భారతదేశంలో పశ్చిమ ప్రాంతాలతో గాక తూర్పు ఈశాన్య ప్రాంతాలతో ముఖ్యంగా అయోధ్య మొదలుకొని ఒరిస్సా గోదావరి ప్రాంత ప్రదేశాలతోనే పరిచయమున్నట్లు తెలుస్తున్నది.



# దశరథుడు

ఇక్ష్వాకువంశము నందు పేరుగాంచిన ''మను'' మహర్షిచే అయోధ్యా పట్టణము నిర్మింపబడినది.

**అయోధ్యా మధురామాయా కాశీ కాంచీ హ్యవన్తికా ।**

**పురీ ద్వారా వతీచైవ సప్తైతే మోక్షదాయకాః ॥**

ఇది పేరుగాంచిన మోక్షము నొసగు ఏడుపట్టణములలో ఒకటి. అకారాది క్రమములో ఈ పట్టణమునకు మొదటి స్థానమున్నది. అట్టిపేరు గాంచిన అయోధ్యా పట్టణమునకు రాజు దశరథుడు. ఇతనికి కౌసల్య, సుమిత్ర, కైకేయి అను ముఫ్ఫురు భార్యలు గలరు. ఇతడు వేదవేత్త, ధర్మపరుడు, త్రిలోకవిఖ్యాతుడు మరియు బలవంతుడు, మహావైభవ సంపన్నుడు, ప్రజావత్సలుడు, ఉత్తమ శాసకుడు, రాజనీతిజ్ఞుడు. పుత్రవాత్సల్యం కలిగిన వాడు. ఇతనికి శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను నలుగురు కుమారులు గలరు. ఇట్టి దశరథుని యొక్క ఆదర్శము ఈ విధముగా పేర్కొనబడినది.

దశరథ మహారాజు అస్త్ర విద్యలలో మంచి నైపుణ్యముగలవాడు. వ్యక్తి ప్రత్యక్షముగ కనబడనప్పటికీ ధ్వనిని బట్టి బాణములు వేయుటలో సిద్ధహస్తుడు. అరణ్యములందు సంచరించు క్రూరమృగములను మనోబలముచే భుజ బలముచే వాడియైన ఆయుధములు ప్రయోగించి వాటిని చంపుటలో నిపుణుడు. నిజభుజ బలపరాక్రమములతో వర్ణాశ్రమ ధర్మములను [illegible] టకై ప్రజలకు తగిన వ్యవస్థ కలుగ చేయు చుండెను.

స్వయముగ వేదాధ్యయనం చేసి వే[illegible]ములను తెలుసుకొనెను. ప్రజా సంక్షేమమునకై యజ్ఞయాగాదులను చేయుచు చెఱువులను త్రవ్వించుచు, తోటలను పెంచుటలో ఆసక్తిని చూపించు చుండెను. ఇతడు రాజర్షి. రాజులకును ఋషులకును ఇతడు ఆదర్శ ప్రాయుడు ముల్లోకములలో ప్రసిద్ధుడు.

**యథామనుర్మహాతేజా లోకస్య పరిరక్షితా ।**

**తథా దశరథో రాజా లోకస్య పరిరక్షితా ॥ బాల. కా. 6.4.**

మను మహర్షి లోకమునెట్లు పరిపాలించెనో అట్లే ఇతడు అయోధ్యను పరిపాలించెను. మనువు తర్వాత అంతటి వాడితడు.

ఇట్టి దశరథ మహారాజు పరిపాలనలో ప్రజలు సౌఖ్యముగా నుండిరి. ధార్మికమగు మనస్సు కల్గి శాస్త్ర విషయములందు ఆసక్తి కలిగియుండిరి. ప్రజలు తమ ధనము చేతనే సంతృప్తి పొందుచుండిరి. సత్యమునే పలికెడి వారు. దశరథ మహారాజు పాలనలో నిర్ధనులెవ్వరు ఉండెడివారుకారు. అతని రాజ్యమందు కాముకుడుగాని, ధర్మకార్యములను ఆచరించనివాడుగాని, కుటుంబసభ్యులను పీడించెడివాడుగాని లేకుండిరి.

**కామీవా న కదర్యోవా నృశంసః పురుషః క్వచిత్ ।**
**ద్రష్టుం శక్యమయోధ్యాయాం నా విద్వాన్నచ నాస్తికః ॥**

ప్రజలందరు అష్టైశ్వర్యములతో తులతూగుచుండిరి. ప్రజలందరూ విద్యావంతులే. ఈప్రకారము సకల విధముల యోగ్యమైన గుణములు దశరథ మహారాజు కలిగియుండెను. దశరథుని యందున్న ఈ గుణములు వర్తమాన కాలమున నున్న పాలకులందరికీ ఆదర్శ ప్రాయమైనవని చెప్పుట యుక్తముగా యున్నది.

## దశరథుని గురుభక్తి

గొప్ప పరాక్రమము కలిగిన దశరథమహారాజుకు అధికార మదాంధకారమనునది ఏమాత్రము లేదు. పైగా మహర్షులన్నను, గురువులన్నను, అతిధి అభ్యాగతులన్నను ఇతనికి ఎనలేని ప్రీతి. ధార్మికుడగు ఈరాజు తనకేదైనా క్లిష్టదశ ఎదురైనచో తనగురువులతోను, పురోహితులతోను చర్చించెడివాడు. చాలాకాలము సంతానము లేనందున సంతానార్థియై పుత్రకామేష్టి యాగమును చేయవలెనని నిశ్చయించి- -

**తతోஉబ్రవీత్ మహాతేజాః సుమంత్రం మంత్రిసత్తమమ్ ।**
**శీఘ్రమానయ మేసర్వాన్ గురూంస్తాన్ సపురోహితాన్ ॥**

ప్రసిద్ధులగు గురువులను, పురోహితులను ఆహ్వానించమని సుమంత్రునితో చెప్పెను. దీనిని బట్టి అతనికి గల గురుభక్తి మనకు తెలియుచున్నది.

దశరథుడు పుత్ర సంతానార్థియై పుత్రకామేష్టి యాగమును చేయుటకు సమర్థుడెవరా అని ఆలోచించు చుండగ సుమంత్రుడు ఋష్యశృంగుని వృత్తాంతమును తెలియచేయగ ఆసమయమున వయస్సులో తనకంటే తక్కువైనను జ్ఞానవృద్ధుడైన ఆఋష్యశృంగుని ఆహ్వానించుటకు స్వయముగ అంగదేశమునకువెళ్లెను. దీనిని బట్టి విద్వాంసుడు గురుతుల్యుడగు ఋష్యశృంగుని ఎడ దశరథుడు ప్రదర్శించిన వైఖరి మనకు తెలియుచున్నది. వయస్సుతో నిమిత్తం లేకుండా జ్ఞానవృద్ధుని సత్కరించవలెను అన్న ఆదర్శము దశరథుని ద్వారా మనకు తెలియుచున్నది. యజ్ఞ నిర్వహణ బాధ్యతను

వశిష్ఠునకు అప్పగించుట వలన అతనికి తన గురువుల ఎడ గల భక్తి ఏపాటిదో తెలియుచున్నది.

విశ్వామిత్రుడు యాగ సంరక్షణార్థము శ్రీరాముని అభ్యర్థించుటకై అయోధ్యాపట్టణమునకు వచ్చి, ద్వారపాలకులతో తన రాకను దశరథునకు తెలుపమని కోరెను. ద్వారపాలకుల మాట విన్నంతనే ఏకాగ్ర చిత్తుడై వశిష్ఠునితో కలసి బ్రహ్మను దేవేంద్రుడు ఎట్లు ఎదురేగి స్వాగతం పలుకునో అట్లు దశరథుడు విశ్వామిత్రునకు స్వాగతం పలికెను. విశ్వామిత్రుడు దశరథునకు గురువు కాకపోయినప్పటికీ విశ్వామిత్రుని ఎడ తనకుగల భక్తి భావమును ప్రకటించుకొనెను.

మరియు విశ్వామిత్రుడు రాముని తన వెంట పంపమని కోరగా పుత్రవాత్సల్యముచే దశరథుడు విశ్వామిత్రుని కోరికను తిరస్కరించుటకు సిద్ధపడెను. రాముని వయస్సు మొదలగు విషయములను దృష్టిలో పెట్టుకొని అట్లు పలికెను. కానీ, యథార్థమునకు విశ్వామిత్రుని కోర్కెను తిరస్కరించుటకు గాదు.

**త్రిషులోకేషు విఖ్యాతో ధర్మాత్మా ఇతి రాఘవః ।**
**స్వధర్మం ప్రతిపద్యస్వ నాధర్మం వోఢు మర్హసి ॥** బాల.కా.21.7.

అంత వశిష్ఠుడు దశరథునితో ఓరాజా! ధార్మికుడవగు నీవు నీ ధర్మమును నిర్వర్తింపుము. అధర్మమును ఆచరింపకుము. విశ్వామిత్రునిచే సురక్షితుడగు రాముని రాక్షసులు ఏమియు చేయలేరు, కాన నీవు సంశయించ వలదని చెప్పెను. దశరథుడు కులగురువగు వశిష్ఠుని తిరస్కరించ లేక పోయెను.

## పుత్రవాత్సల్యము

దశరథునకు పుత్రకామేష్టి యాగము... లక్ష్మణ, భరత శత్రుఘ్నులను నలుగురు కుమారులు కలిగిరి. లేక లేక కలిగిన కుమారులు కావున వారిని అల్లారుముద్దుగా పెంచు చుండెను. విశ్వామిత్రుడు యాగ సంరక్షణార్థము శ్రీరాముని తనతో పంపవలసినదని పలుకగా విశ్వామిత్రుని వాక్కులు విని క్షణకాలము మూర్ఛిల్లి అనంతరము తెప్పరిల్లుకొని, ఇట్లనెను.

**ఊన షోడశ వర్షోమే రామో రాజీవ లోచనః ।**
**న యుద్ధ యోగ్యతా మస్య పశ్యామి సహ రాక్షసైః ॥** బాల.కా.20-2.
**బాలో హ్యకృత విద్యశ్చ న చ వేత్తి బలాబలమ్ ।**
**న చాస్త్ర బల సంయుక్తో న చ యుద్ధ విశారదః ॥**

**విప్రయుక్తోహి రామేణ ముహూర్తమపి నోత్సహే ।**
**జీవితుం మునిశార్దూల నరామం నేతుమర్హసి ॥** బాల.కా.20-7,9.

రాముడు పదునారేళ్ళ ప్రాయము కూడా లేనివాడు. రాక్షసులతో తలపడునట్టి శక్తివంతుడు కాడని తెలియచేసెను. అనగా చిన్నారి అయిన రామునిపై అతనివాత్సల్యము ఏపాటిదో తెలియుచున్నది. యాగ సంరక్షణార్థము నేనే స్వయముగ వచ్చెదను. కావున నీవు రాముని తీసికొనిపోరాదు. శ్రీరాముడు బాలుడు, విలువిద్యలు నేర్వనివాడు, శత్రువుల బలాబలాలు తెలుసుకోలేనట్టివాడు. అస్త్రబలముగాని, యుద్ధకుశలతగాని ఏమాత్రము తెలియనివాడు. రాముని వదలి ఒక్క క్షణమైనను జీవింపలేను. కావున రాముని తీసికొనిపోవలదు.

**యది వా రాఘవం బ్రహ్మన్ నేతు మిచ్ఛసి సువ్రత ।**
**చతురంగసమాయుక్తం మయా చ సహితం న య ॥** బా.కా.20-10.

రాముని తప్పక తీసికొని పోవలెనన్నచో చతురంగబలముతో నేను కూడ అచ్చటికి వత్తును. నన్ను కూడ అతనితో తీసికొనిపొమ్ము. అని విశ్వామిత్రుని వద్ద పరిపరివిధముల వాపోయెను. దీనిని బట్టి దశరథుని పుత్రవాత్సల్యము ఎట్టిదో తెలియు చున్నది.

మరియు భరత శత్రుఘ్నులు కేకయ రాజు యుధాజిత్తు కోరికపై కేకయ దేశమునకు వెళ్లిరి. యోగ్యులగు కుమారులు కేకయ దేశమునకు వెళ్లినందున దశరథుడు వారినే నిరంతరము స్మరించు చుండెను.

**సర్వ ఏవతు తస్యేష్టా శ్చత్వారః పురుషర్షభాః ।**
**స్వ శరీరా ద్వినిర్వృత్తాశ్చత్వార ఇవ బాహవః ॥** అయో.కా.1.5.

పురుష శ్రేష్ఠులగు నలుగురు కుమారులు ఆరాజుకు నాలుగు చేతులువంటివారు. ఈప్రకారము దశరథుడు తన నలుగురు పుత్రులపై ఎంతో వాత్సల్యము చూపుచుండెను. గుణగ్రాహికావున గుణములలో ఉత్తముడగు రామునిపై ఎక్కువ ప్రేమ కల్గిఉండెను. లోకమున ఎవరైనను యిట్టిప్రేమను ప్రదర్శించుట సామాన్యమే. యిందు దోషములేదు. ఈవిధంగా దశరథుడు చూపిన పుత్ర వాత్సల్యము తండ్రు లందరికీ ఆదర్శప్రాయమైనది.

## నిరాడంబరత

దశరథుడు జనకుని పిలుపుమేరకు సీతారాముల పెళ్లికి మిథిలానగరమునకు వచ్చెను. దశరథుడు సకల గుణాభిరాముడైన శ్రీరాముని తండ్రి. జనకుడు సీతాదేవికి తండ్రి. వీరిరువురును వివాహసందర్భమున దాత ప్రతిగ్రహీతలు. లోకమున వివాహ సందర్భములో ప్రతిగ్రహీతలు ఎంతో ఆడంబరమును ప్రదర్శించెదరు. కాని దశరథుడు ఎట్టి ఆడంబరమును ప్రదర్శించలేదు. భోజన విషయమందును, వివాహమునకు పూర్వము, వివాహానంతరము ప్రతిగ్రహీతలు ముప్పుతిప్పలు పెట్టుచుందురు. కానీ దశరథుడు మాత్రము ఎచ్చటైనను అట్టి పరిస్థితి కల్పించలేదు. జనక మహారాజు దశరథునితో ఇట్లనెను.

**శ్వః ప్రభాతే నరేంద్రేంద్ర నిర్వర్తయితు మర్హసి ।**
**యజ్ఞస్యాంతే నరశ్రేష్ఠ! వివాహమృషి సమ్మతమ్ ॥**

ఓ రాజశ్రేష్ఠా! రేపు ఉదయముననే యజ్ఞము పూర్తి అయిన పిమ్మట శ్రీరామాదులు వివాహము జరిపించవలసినదని కన్యాదాతగా జనకుడు అడిగెను. ఆసమయమున దశరథుడు జనకునితో--

**ప్రతిగ్రహో దాతృవశః శ్రుతమే తన్మయా పురా ।**
**యథా వక్ష్యసి ధర్మజ్ఞ తత్కరిష్యా మహేవయమ్ ॥ బా.కా.69-14.**

ధర్మజ్ఞుడా! కన్యాస్వీకారము ఎప్పుడును దాతయధీనమని పూర్వము చెప్పగా వింటిని. ఈవివాహ సమయములో నీవు ఎట్లు చెప్పెదవో అట్లే మేము ఆచరించెదమని వరుని తండ్రిగా పలుకుట ఎంతో ఆశ్చర్యకరముగా ఆదర్శముగనున్నది.

## ప్రజాస్వామ్యప్రియత్వం

దశరథుడు ప్రజాస్వామ్యమును పాటించుటలో మేటియైనవాడు. దశరథుడు రాజు అయినప్పటికీ నియంతృత్వంగలవాడు కాడు. బుద్ధిమంతుడైనప్పటికి స్వయముగ నిర్ణయములు చేసి ప్రజలపైరుద్దెడివాడు కాడు. పుత్రకామేష్టియాగము మొదలుకొని రాముని పట్టాభిషేకం నిర్ణయం వరకు అతడు ఏమాత్రము సొంత నిర్ణయములు తీసికొనక మహర్షుల, సామంతుల, ప్రజల నిర్ణయములు గైకొనియే కార్యములు ఆరంభించు చుండెను. రాజుల కాలములో యిట్టి ప్రజాస్వామ్యమును నెలకొల్పుటలో దశరథుడు ఆదర్శప్రాయుడనుటలో ఎట్టి సంశయములేదు. మూర్తీభవించిన ప్రజాస్వామ్యభావము కలవాడు దశరథుడు. దశరథునకు చాలా కాలము వరకు సంతానము కలుగలేదు. సంతానము కొరకు పుత్రకామేష్టి యాగము చేయవలసినదని సుమంత్రుడు తెలియజేసెను. అయితే సుమంత్రుని మాటనే ప్రధానముగ తీసికొనలేదు.

సుమంత్రుని మాటలు విని అతనితో ప్రసిద్ధులగు మహా గురువులను పురోహితులను తోడ్కొని రావలసినదని ఆదేశించెను. వారి నాహ్వానించి వారి ముందర సంతానార్థమై శాస్త్రములు నిర్దేశించిన ప్రకారము ఏ యాగములు చేయవలెనో దానినెట్లు నిర్వహించవలెనో అందుకు కావలసిన ఉపాయమేదో ఆలోచింపవలసినదని కోరి, వారు సూచించిన ప్రకారము యాగము నిర్వర్తించెను.

విదేహరాజగు జనకుని తరపున వచ్చిన దూతల సందేశమును విని మిగుల సంతోషముతో దశరథుడు వశిష్ఠునితోను, వామదేవాది మంత్రులతో--

**దృష్ట వీర్యస్తు కాకుత్స్థో జనకేన మహాత్మనా ।**
**సంప్రదానం సుతాయాస్తు రాఘవేకర్తుమిచ్ఛతి ॥** బా.కా.68-16.

ఆర్యులారా! జనకుడు రాముని పరాక్రమమును చూచి తనకుమార్తె నిచ్చి పెండ్లి చేయుటకు సిద్ధపడినాడు. ఇది మీకిష్టమైతే మనము జనకుని పట్టణమునకు పోవుదము అని పలికెను. దశరథుని కుమారిని యొక్క వివాహమిది. కుమారుని వివాహవిషయములో స్వయముగ నిర్ణయం తీసుకొనవచ్చును. కాని స్వయముగ నిర్ణయం తీసుకొనలేదు. దశరథుడు తాను ఏపనిని చేసినను తన పురోహితులకు, మంత్రులకు తెలిపియే చేయుచుండెను. మీకు సమ్మతి అయితేనే జనకుని నగరమునకు వెళ్లెదమని వారితో చెప్పెను. పురోహితులు, మంత్రులు ప్రజాప్రతినిధులతో సమానము. దీనిని బట్టి అతడు ఉత్తమ ప్రజాస్వామ్యమునకు కూడ మంచి ఆదర్శవంతుడని మనకు తెలియుచున్నది.

దశరథుడు శ్రీరామునికి పట్టాభిషేకము చేయవలెనని నిశ్చయించుకొనెను. నిశ్చయించినదే తడవుగా వివిధ దేశ రాజులందరినీ అయోధ్యకు రప్పించెను. అందరూ వచ్చిన తరువాత నిండు కొలువులో దశరథుడు ఇట్లు పలికెను.

**ప్రాప్య వర్షసహస్రాణి బహూన్యాయూంషి జీవతః ।**
**జీర్ణస్యాస్య శరీరస్య విశ్రాంతి మభిరోచయే ॥**
**సోఽహం విశ్రామ మిచ్ఛామి పుత్రం కృత్వా ప్రజాహితే ।**
**సన్నికృష్టాని మాం సర్వానను మాన్య ద్విజర్షభాన్ ॥**
**అనుజాతో హి మాం సర్వైః గుణైః శ్రేష్ఠో మమాత్మజః ।**
**పురంధర సమోవీర్యే రామః పరపురంజయః ॥**
**తం చంద్రమివపుష్యేణ యుక్తం ధర్మభృతాం వరమ్ ।**
**యౌవ రాజ్యేనియోక్తాస్మి ప్రీతః పురుష పుంగవమ్ ॥**
**రాజప్రభావ జుష్టాం చ దుర్వహా మజితేంద్రియైః ।**
**పరిశ్రాంతోస్మిలోకస్య గుర్వీంధర్మధురం వహన్ ॥** అ.కా.2.8-12.

సభాసదులారా! నేను చాలా కాలమునుండి రాజ్యభారమును వహించి వృద్ధాప్యముచే అలసిపోయాను. అందువలన నాగుణములు పోలిన గుణములు గలవాడు, ధార్మికులలో ఉత్తముడు, నరశ్రేష్ఠుడు పుష్యమీ నక్షత్రముతో కూడి చంద్రునివలె ప్రకాశించు నట్టి రాముని యౌవరాజ్యాభిషిక్తునిగావింప నిశ్చయించినాను.

నేను చక్కగ ఆలోచించి ఈనిర్ణయము స్వీకరించితినని మీరు భావించినచో మీరీ అభిషేకమునకు అనుమతించుడు అని పలికెను. రామపట్టాభిషేకము హితకరమైనది. ఇంతకంటే హితకరమైన విషయము ఏదైనా యున్నచో తెలియచేయగలరు. ఎందువలననగా మధ్యస్థుల ఆలోచన, ఉభయపక్షముల ఆలోచన వాదోపవాదములచే నిర్దుష్టమై మిక్కిలి ప్రయోజనమైనట్టిదని పలికెను.

ఇచ్చట దశరథుడు రాజు. ఆయన ఏమైనను చేయవచ్చును. కాని ప్రజాహితమును దృష్టియందుంచుకున్నవాడు కావున తానే స్వయముగ ఆలోచన చేయక అచటకు వచ్చిన రాజులు ప్రజలు మొదలగు వారి అభిప్రాయములను అడిగెను. రాజు అడిగినతోడనే రాజులు ప్రజలు అందరును దశరథుని మాటను అంగీకరించి తమ హర్షమును ప్రకటించిరి. ఇది దశరథుని ఉత్తమ ప్రజాస్వామ్యమునకు అద్దం పడుతున్నది.

ఈ ప్రకారము పుత్రకామేష్టి యాగము మొదలుకొని రాముని పట్టాభిషేకము వరకు దశరథుడు చూపించిన ప్రజాస్వామ్యత పాలకులకు, రాజులకు, ప్రజలకు అందరికి ఆదర్శప్రాయముగనున్నది. విశేషించి ప్రజాస్వామ్యయుతమైన మన భారతదేశమునకు దశరథునికి యున్న ఈ గుణములు మిక్కిలి అనుకరణీయమైనవి.



# జనకుడు

హ్రస్వరోముని కుమారుడు జనకుడు. ఇతడు మిథిలాధిపతి. ధర్మశీలుడు. యజ్ఞము చేయుటకు భూమిని శోధించు చుండగ నాగటి చాలునందు సీత ఆవిర్భవించెను. సీత అయోనిజ అయినప్పటికీ తన కన్న కూతురు వలె పెంచి పెద్ద చేసెను. జనకుడు మహాశాంతమూర్తి. కాని ఏమాత్రం అసమర్థుడు కాడు. ధీరోధాత్తుడు. భగవద్గీత జనకుని కర్మయోగిగా చెప్తుంది.

**కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।** **భగవద్గీత 3-20.**

ఎవరిని పేరెత్తి ఉదహరించని వాసుదేవుడు జనకుని స్మరించి కర్మ సిద్ధునిగ పేర్కొన్నాడు. జనకుడు ధార్మికుడు. తత్త్వవేత్త, రాజర్షి ఎన్నో యజ్ఞయాగాదులు చేసినట్టి నిష్ఠాగరిష్ఠుడు. మునులన్న ఎంతో శ్రద్ధా భక్తులు గలవాడు. సంప్రదాయములను పాటించుటలోను తనపని తాను చేయుటలోను యితనికి మించిన వారు లేరు. యిట్టి గుణగణములు కల జనకుడు ఎంతో ఆదర్శప్రాయుడై లోకమున కీర్తి నొందెను.

## జనకుని భక్తి

**బహూనీహ సహస్రాణి నానా దేశనివాసినామ్ ।**
**బ్రాహ్మణానాం మహాభాగ వేదాధ్యయన శాలినామ్ ॥** **బా.కా.50-3.**

జనకుడు యజ్ఞయాగాదులు నిర్వహించుటలో దిట్ట. జనకమహారాజు దేశమున వేదాధ్యయనముతో ప్రకాశించునట్టి వివిధ దేశములకు చెందిన అనేక వేల మంది బ్రాహ్మణులకు నివాసమేర్పరచెను.

విశ్వామిత్రుడు రామ లక్ష్మణులతో కలసి మిథిలానగరమునకు వచ్చినాడను విషయమును తెలుసుకొని తన పురోహితుడగు శతానందుని ముందుంచుకొని వినయవిధేయతలతో విశ్వామిత్రుని ఆహ్వానించెను. ఋత్విజులతోను, పురోహితులతోను, విశ్వామిత్రునికి స్వాగతం పలకి ఆసనం అలంకరించవలసినదని కోరెను.

**అద్య యజ్ఞసమృద్ధిర్మే సఫలాః దైవతైః కృతా ।**
**అద్య యజ్ఞ ఫలం ప్రాప్తం భగవద్దర్శనాన్మయా ॥** **బా.కా. 50-13.**

విశ్వామిత్రుని ఆగమమునకు ఎంతో సంతోషపడి అతనితో మహర్షీ! ఈనాడు నాయజ్ఞమునకు సమగ్రత కల్గినది. ఆ సమృద్ధిని దేవతలిప్పుడు సఫలము గావించిరి. భగవంతుడగు నీదర్శనము చే నాకిప్పుడు యజ్ఞ ఫలము కలిగినది.

**ధన్యోఽస్మ్యనుగృహీతోస్మి యస్యవేముని పుంగవ ।**

**యజ్ఞోప సదనం బ్రహ్మన్ ప్రాప్తోఽసి మునిభిస్సహ ॥**

**ద్వాదశాహంతు బ్రహ్మర్షే శేషమాహుర్మనీషిణః ।**

**తతో భాగార్థినో దేవాన్ ద్రష్టు మర్హసి కౌశిక ॥** బా.కా. 50-15,16.

మీరు మునులతో కూడి నాయజ్ఞసదనమునకు వచ్చితిరి. నేను ధన్యుడనైతిని. ఈ యాగము పూర్తి అగుటకు పండ్రెండు దినములు పట్టును. అంతవరకు మీరిచటనే యుండి యజ్ఞ భాగములను కోరివచ్చు దేవతలను చూడవలసినది. అని అంజలి ఘటించి విశ్వామిత్రునికి నమస్కరించెను.

ఈ ప్రకారము మహర్షులంటే అతనికి ఎంత ప్రీతియో తెలియు చున్నది. ఈ గుణము, ధార్మిక బుద్ధి గలిగిన అందరికీ ఆదర్శ ప్రాయముగా తోచుచున్నది.

## జనకుని సోదర ప్రేమ

జనకుని తండ్రి హ్రస్వరోముడు. ఆ హ్రస్వరోమునకు ఇద్దరు కుమారులు ఇద్దరిలో పెద్ద వాడు జనకుడు. రెండవ వాడు మంచి బలపరాక్రమములు గల కుశధ్వజుడు. జనకుని మాటలలో చెప్పవలెనన్న --

**వృద్ధే పితరి స్వర్యాతే ధర్మేణ ధురమావహమ్ ।**

**భ్రాతరం దేవ సంకాశం స్నేహాత్ పశ్యన్ కుశధ్వజమ్ ॥**

బా.కా.70-15.

కుశధ్వజుడు దేవునితో సమానమైనట్టివాడు. మహాప్రతాపశాలి, మహా ధార్మికుడని తెలయుచున్నది. కావున తండ్రి మరణానంతరము కుశధ్వజుని ప్రేమతో చూచుకొనుచు ధర్మముతో రాజ్య భారమును స్వీకరించెను.

ఒకసారి సుధన్వుడను రాజు అత్యుత్తమమగు శివ ధనస్సును, పద్మముల వంటి కన్నులు గల సీతా దేవిని తనకు యివ్వమని దూతలను జనకుని వద్దకు పంపెను. జనకుడు అందుకు నిరాకరించుటచే సుధన్వుడు
యుద్ధం ప్రకటించగా జనకుడు అతనిని చంపి అతని రాజ్యమునకు తన తమ్ముడైన కుశధ్వజుని రాజుగా చేసి తనంత వానిని గావించెను. శ్రీరాముడు శివ ధనస్సు నుగెలిచిన పిమ్మట జనకుడు తమ్ముని పైగల ప్రేమచే శతానందునితో యిట్లు చెప్పెను.

**తమహం ద్రష్టు మిచ్ఛామి యజ్ఞగోప్తాసమే తతః ।**

**ప్రీతి స్యోపి మహాతేజా ఇమాం భోక్తా మయా సహ ॥** బాల. 70-4.



నా తమ్ముడు సాంకాస్య పట్టణమున ఇక్షుమతీ జలములు త్రాగుచు నివసించు చున్నాడు. అతడు ఈ వివాహ మంగళమును చూచి నాతో కలసి ఆనందింపగలడు. దీని వలన జనకునకు తన తమ్మునిపై గల అవ్యక్త అనురాగము స్పష్టమగుచున్నది.

శ్రీరాముడు శివ ధనుస్సును విరిచి సీతను భార్యగా పొందెను. జనకుని రెండవ కుమార్తె ఊర్మిళను దశరథ వశిష్ఠుల కోరిక పై లక్ష్మణున కిచ్చుటకు జనకుడు సంసిద్ధుడయ్యెను. విశ్వామిత్ర మహర్షి వశిష్ఠ సహితుడై కుశధ్వజుని కుమార్తెలగు మాండవీ, శ్రుత కీర్తులను భరత, శత్రుఘ్నుల కిమ్మని జనకునికి తెలయు చేసెను. జనకుడు తమ్ముని పై గల ఆదరాభిమానములతో మాండవీ శ్రుతకీర్తులను భరత, శత్రుఘ్నులకు యిచ్చుటకు అంగీకరించెను.

ఈ ప్రకారము తండ్రి మరణించినది మొదలు కుశధ్వజుని చక్కగా ప్రేమించడము, వివాహాది శుభ సందర్భములలో తమ్మునితో కలసి ఆనందమును పంచుకొనడము మొదలగు గుణగణములచే నొప్పారుచు పెద్ద అన్న తమ్మునితో ఎట్లు కలసి మెలసి ఉండవలయునో తెలుపుచు భ్రాతృ ప్రేమకు ఆదర్శ ప్రాయుడైనాడు.

## సత్యవాక్పాలన

జనకుని అంతఃపురమున శివధనస్సు ఒకటి ఉండెను. జనకుని పూర్వీకుడైన నిమి చక్రవర్తికి ఆరవ కుమారుడైన దేవరాతుడను వానికి ఆవిల్లు శివునిచే న్యాసముగా యివ్వబడినది. ఆవిల్లు మిగుల భారము కల్గినట్టిది.

**నృణాం శతాని పంచాశద్వ్యాయతానాం మహాత్మనామ్ ।**
**మంజూషా మష్టచక్రాం తాం సమూహుస్తే కథంచన ॥ బా.కా.67-4.**

దీర్ఘ శరీరులు మహాత్ములగు ఐదువేల మంది ఎనిమిది చక్రములు గల ఆ ధనుస్సు పేటికను మోసుకొని వచ్చుటకు తగినవారు. అట్టి ధనస్సును ఎవరైతే ఎక్కుపెట్టెదరో వారికి సీతనిచ్చి వివాహము చేసెదనని జనకుడు ప్రతిజ్ఞచేసెను. సీత వీర్యశుల్క అని జనకుడు ప్రకటించెను.

**తత స్సర్వే నృపతయ స్సమేత్య ముని పుంగవ ।**
**మిథిలా మభ్యుపాగమ్య వీర్య జిజ్ఞాస వస్తదా ॥ బా.కా.66-17.**

జనకుని ప్రతిజ్ఞకు ఆవింటి శక్తిని తెలుసుకొన గోరిన వారై ఎందరెందరో రాకుమారులు వచ్చి తిరిగి వెళ్ళిరి. వారిలో ఏఒక్కరైనా గానీ వింటిని పట్టుకొనుటకు గాని, భారమును పరీక్షించుటకుగాని, చేతితో కదుల్చుటకు గానీ సమర్థులు కాలేకపోయిరి.

ఫలితముగా పరాక్రమవంతులగు ఆరాజుల పరాక్రమము తక్కువని జనకునిచే తిరస్కరింపబడిరి.

**ఆత్మాన మవధూతం యే విజ్ఞాయ నృపపుంగవాః ।**
**రోషేణ మహతా విష్టాః పీడయన్ మిథిలాంపురీమ్ ॥ బా.కా.66-21.**

అట్లు తిరస్కరించబడిన రాజులందరూ అవమాన భారముతో ఒక్కుమ్మడిగా మిగుల రోషముతో మిథిలా నగరమును పీడించిరి. అట్లు సంవత్సరకాలము వారితో పోరాటము సల్పెను.

జనకుడు ఆడిన మాట తప్పకుండుటకై పరాక్రమవంతులగు ఈ రాజులందరిని ఎదిరింపవలసి వచ్చెను. అందువలన తగిన పరాక్రమము కలిగినవాడు వచ్చునంతవరకు సీతకు పెండ్లి చేయలేదు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటబెట్టుకొని మిథిలానగరమునకు వచ్చినప్పుడు విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు శ్రేష్ఠమగు శివధనుస్సును చూడగోరుచున్నారు అని పలుకగా జనకుడు ఆ ధనస్సును రామునికి చూపించెను.

**యద్యస్య ధనుషో రామః కుర్యాదారోపణం మునే ।**
**సుతామయోనిజాం సీతాం దద్యాం దాశరథే రహమ్ ॥**

**బా.కా.66-26.**

రాముడు ఈ ధనస్సును ఎక్కుపెట్టినచో సీతనిచ్చెదనని తాను మునుపు చేసిన ప్రతిజ్ఞను ధ్రువపరచెను.

ఈ ప్రకారము జనకుడు మొదటి నుండి ఆడిన మాట తప్పకుండా స్థిరముగా ఉండుటకు ప్రయత్నించినాడు. ఎన్ని కష్టము లొచ్చినను చివరకు రాజులందరూ మూకుమ్మడిగా దండెత్తినను ఏమాత్రము వెనుకాడక సీతా వివాహవిషయములో తాను అన్నమాట నిలబెట్టుకొని రాముడు శివధనస్సును విరచిన తరువాత సీతనిచ్చుటకు అంగీకరించెను.

పైవిధముగా ఆడినమాట తప్పకుండుట అను జనకుని గుణము ప్రజలకు ఆదర్శప్రాయముగా నున్నది.



# శ్రీరాముడు

రామాయణ పాత్రలలో ప్రధానమైన పాత్ర శ్రీరాముడు. రాముని గురించి ఆపాత్ర యందలి ఆదర్శమును గురించి తెలుసుకొనుటకు పూర్వము 'రామ' అనే పదమును గురించి తెలుసుకొనుట సముచితము.

**నారాయణాష్టాక్షరే తు రామనామాద్యవర్ణనమ్ ।**
**నయోజితం యది తదా నాయ నాయమనుర్భవేత్ ॥**

**-నామార్థవివేకము.**

ఓం నమో నారాయణాయ అనే అష్టాక్షరీ మంత్రము నందలి 'రా' అను అక్షరమును 'నమశ్శివాయ' అను శివ పంచాక్షరీ మంత్రము నందలి 'మ' కారమును కలిపి రామ అను పదము (నామము) ఏర్పడినదని వేదాంతులు చెప్పుచున్నారు.

**దివ్యశ్రీ శివ పంచార్ణే రామనామాన్త్య వర్ణకమ్ ।**
**నయోజితం యది తదాన శివాయ భవేన్మనుః ॥ -నామార్థవివేకము**

రామనామ మందలి మొదటి రేఫము 'తత్త్వమసి' అను మహావాక్యమందలి తత్ పదమునకు చెందినది. రెండవ వర్ణమైన 'మ' కారము 'త్వం' పదమునకు అర్థమని తెలియుచున్నది. అట్టి దైవాంశ స్వరూపుడగు శ్రీరామచంద్రుడు రామాయణమునందు ప్రతి కార్యము లోను న్యాయమార్గమున పయనించుచు రాజుగ, కుమారుడుగ, భర్తగ, జ్యేష్ఠభ్రాతగ, ఆర్తత్రాణపరాయణుడుగా, మిత్రునిగ, రక్షకునిగ, తండ్రిగ, బాధ్యతగల పౌరునిగ, ప్రతిచోటను మిక్కిలి ఆదర్శ పురుషునిగ మనకు కన్పించుచున్నాడు.

శ్రీరాముడు దశరథుని జ్యేష్ఠ కుమారుడు, సర్వసద్గుణసంపన్నుడు, మానవమూర్తి అయినప్పటికీ దేవతలకు సయితము ఆదర్శప్రాయుడు, మానవాకృతిలో అవతరించి మానవత్వమునకే ఎనలేని గౌరవ మాపాదించిన మహనీయుడు. అతని గుణగణములచే నాకర్షింపబడని వివేకవంతులెవ్వరుఉండరు.

శ్రీరాముడు రామాయణమున ప్రదర్శించిన పితృభక్తి అప్రతిమానమైనది. పితృవాక్యపరిపాలనకై అతడు కావించిన త్యాగము వర్ణనాతీతము. అట్లేదూతల ఎడను, గురువుల ఎడలను అతడు చూపిన భక్తి శ్రద్ధలు వర్ణనాతీతములు.

జన్మించినది మొదలు పట్టాభిషిక్తుడగునంత వరకు ఎన్నో ఒడిదుడుకులను కష్టసుఖములను, భయానక సన్నివేశములను నిర్వేదములను తట్టుకొని సుఖ దుఃఖము

లందు సమానముగ నుండవలయునని సమాజమునకు పాటి చెప్పిన మర్యాదా పురుషోత్తముడు శ్రీరాముడు.

శ్రీరాముడు సకలగుణాభిరాముడు, దేవతలకు ఎట్టి గుణములుండునో అట్టి గుణగణములన్నియు కల్గిన వాడు.

**అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥**
**అహింసా సత్యమక్రోధః త్యాగఃశాంతిరపైశునమ్ ।**
**దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥**
**తేజః క్షమా ధృతిః శౌచ మద్రోహో నాతిమానితా ।**
**భవన్తి సంపదం దైవీం అభిజాతస్య భారత ॥** **భ.గీ.16.1.3.**

అనగా భయము లేకుండుట, సత్త్వసంశుద్ధి జ్ఞానయోగము నందు దృష్టికలిగియుండుట, దానము, ఇంద్రియ నిగ్రహము, స్వాధ్యాయము, తపస్సు ఋజుత్వము హింస లేకుండుట, సత్యవాక్కు, కోపము లేకుండుట, శాంతి త్యాగము కలిగి యుండుట, అసత్యము పలకకుండుట, సకల భూతములందు దయకలిగి యుండుట, ఆశ లేకుండుట, మృదుత్వము లేకుండుట, సిగ్గు కలిగి యుండుట, నిలకడ కలిగి యుండుట, తపస్సు, ఓర్పు ధైర్యము, శుచిత్వము కలిగి యుండుట, ద్రోహము చేయకుండుట, అహంభావము లేకుండుట మున్నగునవి. ఈ గుణములన్నియు దైవీ గుణములని శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో వివరించియున్నాడు.

**ఇక్ష్వాకువంశ ప్రభవో రామో నామ జనైః శ్రుతః ।**
**నియతాత్మా మహావీర్యోద్యుతిమాన్ ధృతిమాన్ వశీ ।**
**బుద్ధిమాన్ నీతిమాన్ వాగ్మీ శ్రీమాన్ శత్రునిబర్హణః ॥**

**బా.కా.1.8-9.**

ఇట్టి గుణములన్నియు శ్రీరామునికి కలవని బాలకాండమున వాల్మీకి మహర్షి తెలిపినాడు.

అతని చరిత్ర లోకమునకు ఆదర్శభూతము. మానవ శరీరమును ధరించిన ప్రతివ్యక్తియు ఎట్లు నడచు కొనవలెనో స్వయముగ ఆచరించి చూపిన కర్మయోగి మానవులకు సంబంధించిన సామాజిక, ధార్మిక, నైతికములగు సకల నియమములను తప్పక పాటించిన ధర్మమూర్తి, కనుకనే అతని ఆదర్శ చరిత్రము సకల మానవాళికి ప్రీతి పాత్రమైనది.

భారతీయ జన సమాజమున తల్లి దండ్రులకు గల స్థానము విశిష్టమైనది. వారి తరువాత ఆచార్యుడు అందరికి పూజ్యుడు. భారతీయులు తల్లిదండ్రులను దైవములుగ భావించి పూజింతురు. ఈవిధముగ చేయుటకు గల కారణములు తెలుసుకొందుము. 'జన్మాద్యస్య యతః' --బ్రహ్మసూత్రం.1-1-2. పరమేశ్వరుడు భూత సృష్టికి హేతువగుట చేత ఎల్ల జీవులకు ఆరాధ్యుడగుచున్నాడు. అట్లే ఏజీవియైన మానవ శరీరమును ధరించుటకు తల్లి దండ్రులు హేతుభూతులు. కనుక మానవులకు శరీరమునిచ్చిన తల్లిదండ్రులు ఆరాధ్యులు. అందువలననే 'మాతృదేవోభవ, పితృదేవోభవ' అని శృతి వచనము. శరీరమున్నప్పుడే మానవుడు ఏపనినైనను చేయగల్గుచున్నాడు. కనుకనే కాళిదాసు కుమారసంభవములో-- 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్' ధర్మ సంపాదనమునకు ఉపయోగపడు సాధనములలో మొదటిది శరీరము అని తెలిపినాడు. ఉత్కృష్టమైన మానవ శరీరమును ప్రసాదించిన తల్లిదండ్రులు దైవముతో సమానమనుట సమంజసము.

తల్లిదండ్రులు పిల్లలకు కేవలము ధర్మ సాధన భూతమగు శరీరము నిచ్చుటయేగాక తమ సంతానము యొక్క శారీరక మానసిక వికాసముల కొరకు తమ సర్వసుఖములను త్యాగముచేసి, తమ సర్వస్వమును ధారపోయుచున్నారు. తల్లిదండ్రులు తమ బిడ్డలపై వాత్సల్యామృతమును కురిపించకున్న మానవజాతి యిట్టి మహత్తరమైన వికాసమును పొంది యుండెడిదికాదు.

**పురుషస్యేహ జాతస్య భవన్తి గురవస్సదా ।**
**ఆచార్య శ్చైవ కాకుత్‌స్థ పితామాతాచ రాఘవ ॥**
**పితాహ్యేనం జనయతి పురుషం పురుషర్షభ ।**
**ప్రజ్ఞాం దదాతి చాచార్య స్తస్మాత్సగురు రుచ్యతే ॥** అ.కా.113.2-3.

జన్మనిచ్చిన మానవులకు తల్లి తండ్రి, ఆచార్యుడు సర్వదా గురువులు. అనగా పూజ్యులు. ఎట్లనగా తల్లిదండ్రులు జన్మనిచ్చుటచేతను, ఆచార్యుడు ప్రజ్ఞనిచ్చుట చేతను గురువులనబడు చున్నారు. కనుకనే వేదము ఆముగ్గురను మానవునికి ఆరాధ్యులని ఘోషించు చున్నది.

లోకమున ఒక ధర్మమును ప్రవచించుట సులభము. దానికి తాను తుదివరకు కట్టుబడి యుండుట చాలాకష్టము. కావుననే తాను చెప్పిన ధర్మమునకు లేక తానాడిన మాటకు లేక తాను నమ్మిన లక్ష్యమునకు ఎట్టి విపత్కరమైన పరిస్థితి దాపురించినను చలింపక కట్టుబడిన వారిని మనము మహాత్ములను చున్నాము. సాధారణ మానవుడు సైతము పరిస్థితులు తనకు అనుకూలముగనున్నప్పుడు అనగ నొక పనిచేయుట వలన

తన కెట్టి కష్టము కలుగని నాడు తానాడిన మాటకు లేక తాను నమ్మిన ధర్మమునకు కట్టుబడి యుండును. ''హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధి శ్శ్యామికాపివా.'' **(రఘువంశము1.4.)** మహాకవి కాళిదాసు చెప్పినట్లు బంగారము స్వచ్ఛమైనది, కానిది తెలుసుకొనవలెననిన అగ్నియందు పెట్టిననాడుగాని తెలియదు. కనుక విపత్కర పరిస్థితులు దాపురించినను, లేక సర్వనాశనమే వచ్చినను ఎవరు ధర్మమునకే కట్టుబడియుందురో వారే నిజమైన ధార్మికులు. సాధారణ మానవులు తమ స్వార్థమునకు హాని వాటిల్లినపుడు ధర్మమును సులువుగ త్యజింతురు. కాని మహర్షులు తాము నమ్మిన సత్యమునకే కట్టుబడి యుందురు. మన పూర్వీకులు అట్టి ధీరులనే మహాత్ములనిరి. శైబ్యుడు, అలర్కుడు హరిశ్చంద్రుడు, శ్రీరామ చంద్రుడు, కర్ణుడు, ఏకలవ్యుడు మున్నగు వారు ఆ కోవకు చెందినవారే. వారు తమ సర్వస్వమును త్యాగముచేసి తమ ఆత్మవత్త్వమును చాటిరి.

## పితృవాక్యపాలన

రామునికి గల పితృభక్తి ప్రశంసనీయమైనది. అనితర సాధ్యమైనది. సహజముగ లోకమునందు తండ్రిపైన భక్తి ప్రపత్తులు చాటుకొనుచుందురు. అయితే ఆ భక్తికి కూడ ఒక హద్దు ఉంటుంది. తండ్రి తనకు ఏలోటుపాట్లు లేకుండా చూచి ఆర్థికముగ ఎంతో సహాయ పడుచున్నచో అట్టి తండ్రిని ఎంతో భక్తితో కొలుచు చుందురు. అట్లు ఆదాయం చూపకపోయిన సముచిత గౌరవము ఇవ్వకపోయిన తనసుఖమునకు ఏమాత్రము ఆటంకము కల్గిన ఆస్తి పంపకములలో రవ్వంత తేడా వచ్చినా, తండ్రిపై ఆగ్రహోదగ్రులగు కుమారులను ఎంతో మందిని చూచుచున్నాము. అల్పమగు ఆస్తి పంపకములలో కొద్దిపాటి తేడా వచ్చినను ఆవేశముతో తండ్రులను కొట్టడము, హింసించడము, చివరికి నరికి వేయడం మొదలగు సంఘటనలను మనము చూచుచునే యున్నాము. కాని శ్రీరామచంద్రుని పితృభక్తి అట్టిదికాదు.

తన తండ్రి న్యాయముగ తనకు రావలసిన రాజ్యము యివ్వనప్పటికి తండ్రి యిచ్చిన వరము కారణముగ త్రుటికాలములో తప్పిపోయిన రాజ్యప్రాప్తి విషయమున ఏమాత్రము చలించక అరణ్యావాసమునకు బయలుదేరినట్టి ధీరుడు.

**పితా హి దైవతం తాత దేవతానా మపిస్మృతమ్ ।**
**తస్మాద్దైవత మిత్యేవ కరిష్యామి పితుర్వచః ॥** అ.కా.34-52.

రాముని దబ్బ్యాష్టిలో తండ్రి దేవునితో సమానము. దేవతలకు సయితము తండ్రియే దైవము. కావున దశరథుని దైవమని భావించియే అతని వాక్యమును పాటించుటకు సంసిద్ధుడయ్యెను.

విశ్వామిత్రుడు యాగ సంరక్షణార్థము రామ లక్ష్మణులను పిలుచుకొని పోవుటకై అయోధ్యాపట్టణమునకు వచ్చెను. దశరథుడు వారిని విశ్వామిత్రుని వెంట పంపించుటకు సిద్ధపడక పోయెను. అనంతరము వశిష్ఠుని ప్రభోధం అనుసరించి వారిని విశ్వామిత్రుని వెంట పంపెను. మార్గమధ్యమున విశ్వామిత్రుని ప్రేరణచే స్త్రీ యను దయ చూపక తాటకిని వధించెను. తండ్రిచే పంపబడిన శ్రీరాముడు విశ్వామిత్రుని ఆజ్ఞమేరకే ఆమెను వధించెను. దశరథుడు సుమంత్రునితో రాముని తీసుకొని రమ్మని ఆజ్ఞాపించగా సుమంత్రుడు రాముని దశరథుని వద్దకు తీసుకొని వచ్చెను.

మునుపెన్నడు దీనంగా లేని తండ్రిని చూచి రాముడు కలత నొందెను. తన తండ్రి యింతకు ముందు తననెప్పుడు చూచినను, తానెట్టిస్థితిలో నున్నను తనను తప్పక అభినందించెడివాడు. అతడెంతకోపముతో నున్నను తనను చూచినవెంటనే కోపమంతయు మాయమై పోయెడిది. కాని ఈనాడు అతడు తనను చూచుటకే మిక్కిలి బాధపడుచున్నాడు. దీనివెనుక ఏదేని ప్రబలమైన కారణముండి తీరవలెనని అనుకొని కైకేయితో యిట్లనెను.

**అతోషయన్మహారాజ మకుర్వన్వాపితుర్వచః ।**
**ముహూర్తమపి నేచ్ఛేయం జీవితుం కుపితే నృపే ॥ అ.కా.18-15.**

తల్లీ! నేను అజ్ఞానముచే నాతండ్రికి కోపము వచ్చు కార్యమేదియైన చేసి యుండుటచే అతనికింత దుఃఖము కలిగినదా! ఎంతకోపముతో నున్నను నన్ను చూచిన తోడనే వాత్సల్యముతో నన్ను ముంచి ఎత్తు నా తండ్రి వివర్ణవదనుడై దీనుడై యుండుటకు కారణమేమి? నావలన ఏదేని పొరబాటు జరిగి యున్నచో నీవు దానిని సర్దుబాటు చేసి నాకు ప్రసన్నుడగునట్లు చేయుము. మహారాజును సంతోషపెట్టక ఆయన మాటను చెల్లింపక ముహూర్తకాలమైనను నేను జీవింపకోరను.

**యతో మూలం నరః పశ్యేత్ ప్రాదుర్భావ మిహాత్మనః ।**
**కథం తస్మిన్నవర్తేత ప్రత్యక్షే సతిదైవతే ॥ అ.కా.18-16.**

ఇక ఆయనకు కోపము వచ్చిన చెప్పెడిదేమి? ఎవరు ఈదేహమును నాకు ప్రసాదించిరో అట్టి ప్రత్యక్షదైవమగు తండ్రి యాజ్ఞ ఏపుత్రుడు మన్నింపడు? శారీరకముగ, మానసికముగ ఏదేని బాధ కలుగుటచే యిట్లుండెనా లేక ప్రియదర్శనుడగు భరతునకు గాని, మహాసత్త్వసంపన్నుడగు శత్రుఘ్నునకు గాని లేక నాతల్లులలో నెవరికైన, ఎవరైనా ఏదైనా యెగ్గుచేసిరా, ఒకవేళ తల్లీ! నీవు స్వాభిమానముచే నాతండ్రి మనస్సునకు నొప్పికలుగుమాటలేవియైన అంటివా? వెంటనే నాతండ్రియొక్క దుఃఖమునకు కారణమును తెల్పుము.

అహో దిజ్నా ర్హసే దేవి వక్తుమీదృశం వచః ।
అహం హి వచనా ద్రాజ్ఞః పతేయ మపిపావకే ॥
భక్షయేయంవిషం తీక్ష్ణం ప్రతేయమపి చార్ణవే ।
నియుక్తో గురుణా పిత్రా నృపేణ చ హితేన చ ॥
తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో యదభి కాంక్షితమ్ ।
కరిష్యే ప్రతిజానేచ రామోద్విర్నాభి భాషతే ॥ అ.కా.18.28-30.

నేను తండ్రిమాటను పాటించుటకు అగ్నిలో దుమకమన్నను దుమికెదను. ఘోరమైన విషమును తిన మన్నను తినెదను. సముద్రమున మునగమన్నను మునిగెదను. గురువు, తండ్రి, రాజు అన్నియు నాకు తండ్రియే. ఆయనకు నేను ఏమిచేయడము యిష్టమో దానిని ఆచరించెదను. ఆయన ఆజ్ఞ ఏమియో తెలుపుము నేను ఎప్పుడు రెండు నాలుకలు గల వాడినికాను. పైమాటలను బట్టి రాముని యొక్క పితృభక్తితో పాటుగ అతని ఋజుత్వము, భావావేశము మనకు స్పష్టముగ విదితమగుచున్నది.

ఆసందర్భమున కైక రామునితో-- నీవు పదునాల్గు సంవత్సరములు అడవులకు వెంటనే పోవలయుననియు నీకు బదులు భరతునికి రాజ్యాభిషేకము జరుగవలెనని మీతండ్రిని కోరితిని.కావున నీవు వెంటనే అయోధ్యా నగరమును విడిచి అడవులకు పోవలెను. నీవు వెళ్ళునంత వరకు నీ తండ్రి స్నానము చేయడు. భోజనం ముట్టడు అని పలికెను. అప్పుడు రాముడు ఏమాత్రము బాధపడక కైకతో యిట్లుపలికెను.

యదత్ర భవతః కించిత్ శక్యం కర్తుం ప్రియం మయా।
ప్రాణానపి పరిత్యజ్య సర్వదాకృతమేవ తత్ ॥
నహ్యతో ధర్మచరణం కించిద[illegible] [illegible]రమ్ ।
యథా పితః శుశ్రూషా తస్య [illegible] క్రియా ॥
భరతః పాలయే ద్రాజ్యం శుశ్రు[illegible]చ్చపి తుర్యథా ।
తథా భవత్యా కర్తవ్యం సహి ధర్మః సనాతనః ॥

అయో.కా.19-21,22,26.

తల్లీ! పూజ్యుడగు నాతండ్రికి ప్రాణముల నర్పించియైనను నేను చేయదగినంత ప్రియమును చేతును. కనుక నావలన అతనికి జరుగుటకు వీలున్న ప్రియమైన కార్యములను జరిగినట్లే భావింపుము. సంశయింపకుము. పితృశుశ్రూష, పిత్రాజ్ఞాపాలన కంటే వేరొక మహత్తర ధర్మమే లేదు. కనుక నాతల్లి వద్ద శెలవు తీసికొని వెళ్లెదను. కాని నీవు మాత్రం నాకు ఈ ఉపకారము చేయవలెను. నాతమ్ముడే రాజ్యమును

పాలించునుగాక, కాని నేనడవులకు పోయిన తరువాత నేను లేని లోపము కలుగకుండగ నాతండ్రి కతడు శుశ్రూషగావించునట్లు అతనిని శాసింపుము. అట్లు చేయుట సంతాన ధర్మము. దీనిని బట్టి శ్రీరామచంద్రుని నిర్మలమగు పితృభక్తి ఎటువంటిదో స్పష్టమగుచున్నది.

అనంతరము రాముడు తన తండ్రికి కైకేయికి ప్రదక్షిణమొనర్చి ముందుకు వెళ్లెను. రాముడు వనవాసమునకువెళ్లుటకై సిద్ధపడినపుడు కౌసల్యాదీనురాలై ఏడ్చుచున్న సమయములో ఆమెతో ధర్మయుక్తమగు వాక్యముల నిట్లు పలికెను.

**నాస్తి శక్తిః పితుర్వాక్యం సమతిక్రమితుం మమ ।**
**ప్రసాదయే త్వాం శిరసా గంతుమిచ్ఛామ్యహం వనమ్ ॥**

**అయో.కా.21-30.**

నాకు తండ్రి వాక్యమును అతిక్రమించు శక్తిలేదు. సాష్టాంగ నమస్కారముచేసి నిన్ను ప్రసన్నురాలను చేసుకొనుచున్నాను. నేను అడవికి వెళ్ళగోరుచున్నాను.

**నఖల్వే తన్మయ్యై కేన క్రియతే పితృశాసనమ్ ।**
**ఏతైరపి కృతం దేవి యే మయా తవ కీర్తితాః ॥** **అ.కా.21-35.**

వెనుకటికి కండు మహర్షి, పరశురాముడు, సగరుని కుమారుడు వీరంతయు తండ్రి మాటను పాటించి యున్నారు. నేను ఒక్కడినే తండ్రిమాట పాటించుటలేదు. ముందు పేర్కొన్న వారందరు పితృవాక్యమును పాటించిన వారే.

అనంతరము లక్ష్మణునితో కూడ లక్ష్మణా! ఉత్తమమగు పితృవాక్యము ధర్మమే ఫలముగా కలిగినట్టిది. కావున నేను అడవులకు వెళ్లెదను అని చెప్పెను. ఈవిధముగ తండ్రిపైగల గౌరవమునుకైక ఎదుట, కౌసల్య ఎదుట, లక్ష్మణుని ఎదుటను మున్ముందూ మహర్షుల ఎదుటను తెలియజేసినట్టి మహాధర్మ సంపన్నుడు. అట్టి ధర్మాత్ముడగు రాముడు పితృవాక్య పరిపాలనలో సాటిలేని మేటియై సకల లోకములకు ఆరాధ్యుడైనాడు. పుత్రులందరూ పితృవాక్యమును పాటించుటకు శ్రీరాముని ఆదర్శముగ తీసుకొనడము ఎంతయో సముచితము.

## పెద్దల ఎడ గౌరవము -- వినయము

శ్రీరాముడు పెద్దల ఎడ గౌరవము వినయ విధేయతలు కలిగిన వాడని రామాయణము నందలి అనేక ఘట్టముల వలన తెలియుచున్నది. రామలక్ష్మణులు 16సంవత్సరముల వయస్సు కలిగిన నాటికే విశ్వామిత్రుడు యాగ సంరక్షణార్థమై వారిని తన వెంట పిలుచుకొని వెళ్లెను. విశ్వామిత్రుడు మహర్షుల లోకెల్ల శ్రేష్ఠుడు.

అందువలన ఆయనపై ఎంతో గౌరవమును, భక్తిని, వినయమును ప్రదర్శించినాడు. విశ్వామిత్రుడు గోబ్రాహ్మణ హితము కొఱకు తాటకను సంహరించమని కోరగా అచంచలమైన నియమములు గల రాముడు ధైర్యవంతముగు విశ్వామిత్రుని వచనములనాలకించి దోసిలి యొగ్గి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

**పితుర్వచన నిర్దేశాత్ పితుర్వచన గౌరవాత్ ।**
**వచనం కౌసికస్యేతి కర్తవ్య మవి శంకయా ॥** బా.కా.26-2.

నీవు విశ్వామిత్రుని మాటలను పాటించవలయును అను నాతండ్రి మాటల యందలి గౌరవము చేత, మీ వాక్కు నాకు నిస్సంశయముగ అనుష్ఠింపదగినది. అని చెప్పునపుడు శ్రీరాముడు విశ్వామిత్రుని ఎడలను, దశరథుని ఎడలను ఎట్టి గౌరవము, భక్తి, వినయము కలిగినట్టివాడో తెలియుచున్నది. విశ్వామిత్రుని యాగ సంరక్షణార్థము రామ లక్ష్మణులు వెళ్లునప్పుడు మార్గమున కనిపించిన ఆశ్రమములు నదులు మున్నగు వాటి యొక్క వృత్తాంతములను తెలుపమని శ్రీరాముడు విశ్వామిత్రుని కోరినపుడు అతని వినయము పెద్దల ఎడ గౌరవము ప్రస్ఫుటమగుచున్నది. శ్రీరాముని పాద స్పర్శకు అహల్య శాపవిమోచనమును పొందినది. శాపవిమోచనమును పొందిన అహల్య పాదములను తాకి నమస్కరించి ఆమె ఎడల వినయ విధేయతలను ప్రదర్శించెను. అనంతరము అట్లే గౌతముని ఎడలను భక్తి వినయములను ప్రదర్శించెను.

పట్టాభిషేకమునకు పూర్వము వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునితో ఉపవాసము చేయించుటకై అతని నివాసమునకు వెళ్లెను. వశిష్ఠ మహర్షి తన ఇంటికి వచ్చినాడని తెలుసుకొని సత్కరించదగిన వశిష్ఠమహర్షిని ఆతిథ్యముచే గౌరవించుటకై త్వరగా ఆతృతతో యింటినుండి బయటకు వచ్చెను. గురుదేవులను దూరముగ నున్నపుడే చూచి ఎదురేగి స్వాగతం పలుకవలెనను [illegible] శాస్త్ర వచనము ఆయననట్లు చేసినది. ఆవిధంగా త్వరపడుచు వశిష్ఠుని [illegible] స్వయముగ అతనిని పట్టుకొని రథము నుండి దించెను. గురువు [illegible] డల [illegible] భక్తి వినయము లుండవలెనో ఈఘట్టము ద్వారా నిరూపించినాడు. అంతే కాకుండా వశిష్ఠుడు తన గృహమునకు వచ్చినందున శాస్త్రోక్త విధిగా పూజించి రథము వరకు మరల ఆయనను అనుసరించి యింటికి మరలెను.

దశరథుని కైకేయి రెండు వరములు అడిగినపుడు నిస్సహాయుడై కైకేయి మందిరమున కుప్పకూలిపోయెను. దశరథుని కోర్కెపైన ఆహ్వానింపబడిన రాముడు కైకేయి మందిరమునకు వెళ్లి, వాడిన ముఖముతో దుఃఖితుడైన తండ్రిని చూచి వినయముతో తండ్రిపాదములకు, కైకేయి పాదములకు నమస్కరించెను. శ్రీరాముడు

వనవాసము చేయుటకై తల్లి యనుమతిని పొందుటకై కౌసల్య మందిరమున ప్రవేశించెను. పూజాకార్యక్రమములో నిమగ్నురాలైన తల్లికి నమస్కరించెను. అనంతరము ఆమె రాముని చూచి భుజింపమని కోరగా ఆమె మాటకు ఎదురు చెప్పకూడదని ఆమె యిచ్చిన అశనమును తాకెను. ఈవిధముగ తల్లిదండ్రులందు మిక్కిలి వినయ విధేయతలు ప్రదర్శించెను.

శ్రీరాముడు భరద్వాజుని ఆశ్రమమునకు వెళ్లినపుడు అత్రి మహర్షి ఆశ్రమమునకు, శరభంగుని ఆశ్రమమునకు సుతీక్ష్ణుని ఆశ్రమమునకు వెళ్లినపుడు అగస్త్యుని ఆశ్రమమునకు వెళ్లినపుడు ఆయా మహర్షుల వద్ద చూపించిన భక్తి ప్రపత్తులు, వినయ విధేయతలు స్మరింపదగినవి. ఈగుణము లన్నియు అందరికీ ఆచరించుటకు ఆదర్శ ప్రాయములైనవి.

## అన్యోన్య దాంపత్యము

మనకు షోడశ సంస్కారములలో వివాహము మిక్కిలి ప్రధానమైనది. కనుకనే మనపూర్వులు గృహస్థాశ్రమమునకు మిక్కిలి ప్రాముఖ్యము నిచ్చి యున్నారు. ఏలయన వేదచోదితమగు కర్మకాండమంతయును గృహస్థాశ్రమాధీనమైయున్నది. పారివారిక జీవనము, వంశోన్నతి, ఐహిక పార లౌకిక కళ్యాణము, ఋణత్రయ-విముక్తి మొదలగునవన్నియు గృహస్థాశ్రమాధీనములు. గృహస్థాశ్రమము సాధనాబహుళమైనది. ఈ ఆశ్రమ పాలన ద్వారా ఐహిక పారమార్థికములగు ద్వివిధాభ్యుదయములు సాధింపబడుచున్నవి.

వేదములు మానవుడు మూడు ఋణములుతో పుట్టునని చెప్పుచున్నవి. అవి 1. ఋషిఋణము 2. దేవఋణము 3. పితృఋణము. వీనిలో ఋషి ఋణము అధ్యయనం వలన తీరును. దేవఋణము యజ్ఞములు చేయుట వలన తీరును. పితృఋణము సంతానోత్పాదనము వలన తీరును. ఈమూడు ఋణములు తీర్చని వానికి ముక్తి లభించదని శాస్త్రములు చెప్పుచున్నవి.

**గృహస్థం హి సదా దేవాః పితరో తిథయస్తథా ।**
**భృత్యాశ్చోప జీవంతి తాన్ భరస్వ మహీపతే ॥**

**మహాభారతము.23-4.**

వ్యాసుడు గృహస్థాశ్రమ ప్రాధాన్యమును గూర్చి చెప్పుచూ దేవతలు, పితరులు, అతిథులు, భృత్యులు మున్నగు వారందరూ గృస్థునాశ్రయించియే బ్రతుకుచున్నారనెను. గృహస్థుడు స్వధర్మ నిర్వహణము ద్వారా బ్రహ్మలోకమును పొందును. ఇది అన్ని ఆశ్రమములలోను ఉత్తమమైనదని వేదనిష్ణాతులు చెప్పుచున్నారు.

**'వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే'** అని ఆర్యవచనము. వియ్యముగాని, కయ్యముగాని సమానులతోడనే జరుపవలెననే పై ఆర్యోక్తి యొక్క భావము. ఆదికవియగు వాల్మీకి భార్యాభర్తలలో నుండు పవిత్ర ప్రణయము యొక్క యౌదాత్యమును, స్నిగ్ధత్వమును, ప్రగాఢత్వమును, శాశ్వతికత్వమును సీతారాములు అత్రి అనసూయులు మొదలుగాగల పవిత్ర దంపతుల ఆదర్శ గార్హస్థ్యము ద్వారా నిరూపించియున్నాడు.

**ప్రియాతు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి ।**
**గుణాద్రూప గుణాచ్చాపి ప్రీతిర్భూయోభి వర్ధతే ॥ బా.కా.77-27.**

సీతారాముల ప్రణయములోని ప్రగాఢత్వమును గూర్చి వాల్మీకి మహర్షి - సీత తనకు, తన తండ్రిచే అంగీకరించబడి వివాహము చేసిన భార్య అగుట వలనను, ఛంధానువర్తన రూపగుణము గలది యగుట చేతను, సౌందర్యాతిశయము కలిగి యుండుట చేతను, ఆమె యందు శ్రీరామునకు ప్రేమ ప్రవర్ధమానము కాజొచ్చెను.

**తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే ।**
**అన్తర్గతమపి వ్యక్త మాఖ్యాతి హృదయం హృదా ॥ బా.కా.77-28.**

సీత యొక్క హృదయమందు గూడ భర్తయగు శ్రీరామచంద్రుడు, ద్విగుణమగునట్లుగ వసించు చుండెను. ఆమె యొక్క హృదయాంతర్గతమైన ఈనిగూఢ ప్రేమను, ఆమె యొక్క హృదయము అతని హృదయముతో స్పష్టముగ చెప్పుచున్నది.

**అద్వైతంసుఖ దుఃఖ యోరనుగతం సర్వాస్వవస్థాసు య ।**
**ద్విశ్రామో హృదయస్య యస్య జరసా యస్మిన్న హార్యోరసః ॥**
**కాలేనావరణాత్యయాత్పరిణతే యత్ప్రేమసారేస్థితం ।**
**భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ ప్రార్థ్యతే ॥**

**ఉత్తరరామచరితమ్ 1-39.**

ఈ దాంపత్యప్రణయము దంపతులలోని ద్వైతభావమును తొలగించి అద్వైతభావమును కలిగించును. సుఖదుఃఖములలోను ఉత్థాన పతనములలోను సర్వకాల సర్వావస్థలయందును వారొకరిపైనొకరు సదా సంలగ్నమనస్కులై యుండునట్లు చేయును. ప్రణయ సూత్రమున ఆబద్ధులైన దంపతులు నిత్యము పరస్పర సాహచర్యమును వాంఛింతురు. దాని కొరకు ఈలోకమునేగాదు పరలోకమును గూడ తృణీకరింతురు. ఇంతకంటే దీని మహత్త్వమును వేఱుగనెట్లు చెప్పనగును.

కనుకనే శ్రీరామచంద్రుడు పదునాలుగు సంవత్సరములు తండ్రి ఆజ్ఞచే అరణ్యవాసం చేయదలచి తల్లితోను, సీతతోను చెప్పి ముందుకు వెళ్ళుటకు సిద్ధపడెను.

అపుడు సీత నేనును నిన్ను అనసరింతునసీ, పతిని విడచిన భార్య జీవింపజాలదనీ, అంతేగాక కొంతకాలము వనవాసము చేయవలెనన్న బ్రాహ్మణులు పలకిన జ్యోతిష వాక్యమును తెలిపి అతనిని అనుసరించుటకే సిద్ధపడెను. రాముడు ఎంత వారించినను సీతాదేవి రాముని అనుసరించుటయే సనాతనధర్మమని భావించి రాముని అనుసరించెను.

**సాహి సృష్టా నవద్యాంగి వనాయ మదిరేక్షణే ।**
**అనుగచ్ఛస్వమాం భీరు సహధర్మచరీ భవ ॥ అయో.కా.30-40.**

అపుడు రాముడు నాతో వనవాసము చేయుటకై దైవముచే సృష్టించబడితివి. నన్ను అనుసరించి నాకు సహధర్మచారిణివి కమ్మని పలికెను. మరియు ''ధర్మేచ అర్థేచ కామేచ నాతి చరితవ్యాత్వయేయం నాతి చరామి ఇతివరః'' దర్మార్థ కామ మోక్షములందు అతిక్రమించను అను వైవాహిక మంత్రమును పాటించెను.

సీతారామలక్ష్మణులు దండకారణ్యమున ప్రవేశించిరి. దండకారణ్యమున పోవుచుండగ విరాధుడను రాక్షసుడు వీరిని అడ్డగించెను.

**ఇయం నారీ వరారోహా మమ భార్యా భవిష్యతి ।**
**యువయోః పాపయోశ్చాహం పాస్యామి రుధిరం మృధే ॥**

**అర.కా.2-13.**

వీరిని చూచి భూమి అదురునట్లు గొప్పధ్వని చేసిన సీతను పట్టి తన చంకలో పెట్టుకొని సుందరాంగియగు ఈవనిత నాకు భార్యకాగలదు యుద్ధమున పాపులగు మీరక్తమును త్రాగెదను. ఆసమయమున సీత విరాధుని చేతిలో చిక్కినందున ఎంతో బాధపడెను. ఆబాధతో లక్ష్మణునితో యిట్లు రాముడు పలికెను.

**పరస్పర్శాత్తు వైదేహ్యా న దుఃఖతర మస్తిమే ।**
**పితుర్వినాశా త్సౌమిత్రే! స్వరాజ్య హరణాత్తథా ॥ అర.కా.2-21.**

లక్ష్మణా! సీతను పరపురుషుడు స్పర్శించుటచే నాకిపుడు కలిగినంత దుఃఖము తండ్రి నెడ బాయుటచేగాని, రాజ్యము కోల్పోవుటచేగాని కలుగలేదు. అని దుఃఖితుడై కన్నీరు కార్చెను.

రాముడు మారీచుని చంపి ఆశ్రమమునకు పోవుచుండగా దారిలో లక్ష్మణుడు కనిపించెను. సీతను ఒంటరిగా వదలిపెట్టి రావడం రాముడు సహించలేకపోయెను. తిరిగి ఆశ్రమమునకు వచ్చి చూచినచో సీత కనిపించలేదు. సీతను ఏరాక్షసుడో అపహరించి యుండును లేదా మరణించి యుండును. ఏకారణముచేతనైనా బయటకు పోయి దారితప్పియుండును. అని సీత కానరాక పోవుటచే పరిపరివిధముల బాధపడెను.

**నైవదేవాః నదైతేయా నపిశాచా నరాక్షసాః ।**

**భవిష్యన్తి మమ క్రోధాత్ త్రైలోక్యేపిప్రణాసితే ॥ అర.కా.64-57.**

రాముడు సీత కొరకు వెదకి వేసారి లక్ష్మణునితో లక్ష్మణా! యక్షులుగాని, గంధర్వులుగాని, పిశాచములుగాని, రాక్షసులుగాని, కిన్నరులుగాని, దేవతలుగాని, సీతను ఉన్నదున్నట్లుగ నాకు అప్పగించకపోయినచో వారిప్పుడే నాపరాక్రమమును చూచెదరు.

నేను వింటిని ఎక్కుపెట్టి బాణములు విడువగ ప్రాణులు ఆకాశమున ఎగురలేవు. మరియు లోకములకు, ప్రకృతికి విరుద్ధములగు స్థితిని కలుగజేసెదను.

ఈప్రకారము రాముడు సీత విషయమును గూర్చి పరివిధముల విలపించుట వలన సీత యెడల గల అనురాగము మనకు తెలియుచున్నది. మరియు జనక మహారాజు సీతాసహితుడనగు, నా కుశలమడుగగా నేనేమి చెప్పుదును.

**త యా విహీనః కృపణః కథం లక్ష్మణ! ధారయే ।**

**యామా మనుగతా రాజ్యాద్భ్రష్టు నిహత చేతనమ్ ॥ కి.కా.1-110.**

రాజ్యభ్రష్టుడనై వికల మనస్కుడైన నన్ను ఆమె వెన్నంటి వచ్చినది. ఆమెనెడబాసి దీనుడనై ప్రాణములు ఎట్లు నిలుపుకొందును.

**ప్రాప్యదుఃఖం వనేశ్యామామాం మన్మథ వికర్శితం ।**

**నష్ట దుఃఖేన పృష్టేన సాధ్వీ సాధ్వభ్య భాషత ॥ కి.కా.1-113.**

సీత అడవిలో దుఃఖమును భరించుచూ కూడ తన దుఃఖమును పైకి కనబడనీయక నాతో దుఃఖమే లేని దానివలె చక్కగ మాటలాడును. మరియు అయోధ్యకు మరలి పోవగ నాతల్లి కౌసల్య కోడలెక్కడని ప్రశ్నించునే. సుకుమారమైన మనస్సుగల ఆమె కేమి చెప్పెదను. లక్ష్మణా! నీవు అయోధ్యకు వెళ్ళి సోదరునిపై అనురాగముగలవాడగు భరతుని చూడుము. సీతనెడబాసి నేను జీవింపజాలను. పైవిషయమును బట్టి రామునికి సీతపైగల అనురాగము ఎటువంటిదో స్పష్టమగుచున్నది. ఇది సీతారాముల అన్యోన్య దాంపత్యమునకు పరాకాష్ఠ. ఇది దంపతులందరికీ ఆదర్శప్రాయమైనది.

## శరణాగతరక్షణ

విభీషణుడు సీతను రామునికిచ్చి వేయవలసినదని పరిపరివిధముల రావణుని వేడుకొనెను. అయినను రావణుడు సీతనిచ్చుటకు అంగీకరించలేదు.

**యోఽన్యస్త్వేవం విధం బ్రూయాద్వాక్యమేతన్నిశాచర ।**

**అస్మిన్ముహూర్తేన భవేత్త్వాం తు ధిక్కులపాంసన ॥ యు.కా.16-15.**

పైగా విభీషణునితో ఓరి! రాక్షసుడా! నీవు తప్పవరెవడైన యిట్లు పలికియున్నచో వాడీక్షణమున బ్రతికి యుండేవాడుకాడు. నీవు రాక్షస కులమున చెడబుట్టినావు. అని నిందించెను. ఫలితముగ విభీషణుడు నలుగురు రాక్షసులను వెంటబెట్టుకొని రామలక్ష్మణులున్న స్థలమునకు వెళ్ళెను.

ఆయుధములతోను మంత్రులతోను వచ్చినందున తమపై దాడిచేయుటకే వచ్చియున్నాడని సుగ్రీవుడు హనుమంతుడు వానరవీరులతో కర్తవ్యమేమిటాయని చర్చించు చుండెను. అంత విభీషణుడు తన పేరును తాను సోదరునకు చెప్పిన హితమును గూర్చి తెలిపి తాను ఎంత చెప్పినప్పటికి రావణుని మనస్సుమారలేదని పైగా సేవకునివలె అవమానించాడని అందువలన ఆలుబిడ్డలను వీడి రాముని శరణుజొచ్చితినని మీరాయనకు నావిషయమును గూర్చి తెలుపమని పలికెను. అంత సుగ్రీవుడు రాముని వద్దకు వెళ్ళి విభీషణుని వృత్తాంతమును తెలిపెను. ఆవిధముగ తెలిపి, రాక్షసులు, కామరూపులు, కంటికి కనపడక తిరుగునట్టివారు, మంచి పరాక్రమ సంపన్నులు. వారియందు విశ్వాసము ఎన్నడును పనికిరాదు. ఇతడు రాక్షస రాజు రావణుడు పంపగా వచ్చిన గూఢచారి కావచ్చును. ఇతడు మనలో చేరి మిత్రభేదము చేయును. సందేహము అవసరములేదు లేదా మిత్రభేదము కల్గింపకున్నను సమయము కొరకు వేచి యుండి విశ్వసించిన మనలను ఎప్పుడైన దెబ్బ తీయవచ్చును. ఎవరి బలమునైన స్వీకరింప వచ్చునుగాని శత్రుబలమును మాత్రము స్వీకరించరాదు. శత్రుపక్షమునుండి వచ్చిన ఇతనిని ఎట్లు నమ్మవచ్చును. కావున ఇతనిని పట్టుకొని బంధించుటయే ఉత్తమమని సుగ్రీవుడు చెప్పెను.

రాముడు ఈవిషయమునంతయు విని హనుమంతుడు మొదలగు వానర వీరులతో విభీషణుడు చెప్పినది, విభీషణుని గూర్చి సుగ్రీవుడు చెప్పినది మీరు వినియే యున్నారు. కావున మీకు తోచినది మీరు చెప్పవలసినదని పలికెను. అంతవారు ప్రభూ! ముల్లోకములలో మీకు తెలియనిదిలేదు. నీ సౌహార్ద్రాన్ని వెల్లడిచేయుచు స్నేహధర్మము కొలది నీవిట్లు అడుగుచుంటివిగాని నీకు తెలియకగాదు మరియు--

**త్వం హి సత్యవ్రత శ్శూరో ధార్మికో దృఢ విక్రమః ।**
**పరీక్ష్య కారస్మృతి మాన్ని సృష్టాత్మా సుహృత్సుచ ॥ యు.కా.17-36.**

ధార్మికుడవు, దృఢమైన పరాక్రమము గలవాడవు పరీక్షించియే పనులు చేయువాడవు, శరణాగత రక్షణము వ్రతముగ కలవాడవు అనిపలికిరి. అపుడు ప్రత్యేకించి అంగదుడు, శరభుడు, జాంబవంతుడు, విభీషణునికి రక్షణ ఈయవలదని చెప్పిరి. కాని హనుమంతుడు మాత్రము అతనిని తప్పక రక్షించవలయునని రామునితో చెప్పెను. వీరి మాటలు విన్న శ్రీరాముడు యిట్లు పలికెను.

సుగ్రీవా! ఈరాక్షసుడు పరమదుష్టుడే అయినను, కాకున్నను ఏమి అతడే విధముగనైనను నాకురవ్వంత కీడు చేయలేడు.

**పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్ ।**

**అంగుళ్యాగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరి గణేశ్వర ॥** యు.కా.18-23.

నేను చంపదలచినచో పిశాచాదులను, దానవులను, యక్షులను లంకయందే కాదు భూమండలము నంతటయును గల రాక్షసులను నాగ్రవేలిమొనతో చంపగలను. శరణుఅని వచ్చిన వానిని కాపాడనిచో భవిష్యత్తులో నిందవచ్చును.

**ఏవం దోషో మహానత్ర ప్రపన్నానా మరక్షణే ।**

**అస్వర్గ్యం చా యశస్యంచ బలవీర్యవినాశనమ్ ॥** యు.కా.18-31.

అనర్థములు కలుగును. అకీర్తికరము బలపరాక్రమములను నశింపచేయును. కావున శరణాగతుడిని రక్షించుట ధర్మసమ్మతము. దీనిని బట్టి రాముడు శరణాగతరక్షకుడని తెలియుచున్నది. మరియు రాముని యందుగల యిట్టి శరణాగత వాత్సల్యము అనుగుణము ప్రభువులకును, అధికారులకును, పాలకులకును, ఆదర్శప్రాయముగానున్నది.

## ధర్మరక్షణ

శ్రీరామచంద్రుని ధర్మ పరిరక్షణ సకల మానవాళికి ఆదర్శప్రాయము.

**రేఖామాత్రమపి క్షుణ్ణాత్ ఆత్మనో వర్త్మనః పరం ।**

**నవ్యతీయుః ప్రజాస్తస్య నియంతుర్నేమి వృత్తయః ॥** రఘు.వ.1-17.

రఘువంశపు రాజులే ధర్మాత్ములు. వైవస్వతమనువు నుండి దిలీపుని వరకు ఎన్నో తరములు గడచినవి. అయినను ఆవంశపు రాజులు మనువు చెప్పిన ధర్మమార్గమున తాము నడచుచు తమ ప్రజలను నడిపించు చుండెడివారని కాళిదాసు యొక్క రఘువంశము వలన తెలియుచున్నది.

శ్రీరాముడు ధర్మమునకు కట్టుబడినవాడు కనుకనే పదునాలుగు సంవత్సరములు అడవికి వెళ్ళమని తండ్రి చెప్పకపోయినప్పటికీ కైకేయి కిచ్చిన మాటను నిలబెట్టుటకై అరణ్యవాసము చేసినట్టి ధర్మాత్ముడు. కౌసల్య రామునితో నేనును నీతో పాటు వనవాసమునకు వచ్చెదనని చెప్పగా ఆసమయమున రాముడు తల్లితో ధర్మయుక్తములగు మాటలు కొన్ని పలికెను.

**భర్తుః పునః పరిత్యాగో నృశంసః కేవలం స్త్రియాః ।**

**సభవత్యా న కర్తవ్యో మనసావిగర్హితః ॥** అయో.కా.24-12.

స్త్రీభర్తను విడచుట వలన మిక్కిలి పాపము కలుగును. కావున భర్తని వదలి పెట్టడము నీవు చేయకూడదు. దశరథుడు జీవించి యున్నంత వరకు నీవతనికి పరిచర్య చేయవలసినది. అదియే శాశ్వతమగు ధర్మము.

**యావజ్జీవతి కాకుత్థ్సః పితామే జగతేపతేః ।**
**శుశ్రుషా క్రియతాం తావత్ సహిధర్మః సనాతనః ॥**

**అయో.కా.24-13.**

అని రాముడు చెప్పగ కౌసల్యయు రాముని ధర్మోచితమగు వాక్యములకు సంతసించి అట్లే ఆచరింతునని చెప్పెను. తల్లియైనను అధర్మమార్గమున నడచు చుండినచో ధర్మమార్గమును బోధించునట్టి ఉత్తమ ధర్మశీలుడు రాముడు.

రాముడు వనవాసమునకు వెళ్ళుటను చూచి సహించలేని లక్ష్మణుడు రామునితో--

**ప్రోత్సాహితోఽయం కైకేయ్యాసదుష్టో యదినః పితా ।**
**అమిత్రభూతో నిస్సంగం వధ్యతాం బధ్యతా మపి ॥**

**అయో.కా.21-12.**

దశరథమహారాజు స్త్రీలోలుడై ఏదేని ఆజ్ఞాపించినచో దానిని పాటించవలసిన అవసరములేదు. నీవు ఈ రాజ్యమును స్వాధీనము చేసుకొనుము. నాచే రక్షితుడవైన నిన్ను ఎవ్వరూ ఏమియు చేయలేరు. నేను తండ్రి అయిన దశరథుని బంధింతును. అతనిని చంపివైచెదను.

**గురో రప్యవ లిప్తస్య కార్యాకార్య మజానతః ।**
**ఉత్పథం ప్రతిపన్నస్య కార్యంభవతి శాసనమ్ ॥ అయో.కా.21-13.**

ఆచార్యుడు కూడ గర్వితుడై ఉచితానుచితవేదో తెలుసుకొనక దుష్టమార్గమును అవలంబించినచో అతడు దండింపదగినవాడు అగును. అనిపలుకగా ధర్మమునే ప్రధానముగా ఎంచుకొన్న రాముడు నాయనా ! కైకేయి ముందు, నాతండ్రి మాట జవదాటనని పలికితిని. ఆవిధముగా ప్రతిజ్ఞ చేసి నాతండ్రి ఆజ్ఞను అతిక్రమింపలేను. తల్లియగు కౌసల్య, నేను, సీత, లక్ష్మణుడు, సుమిత్ర ఎల్లరును తండ్రి ఆదేశము అనుసరించియే తీరవలెను. ఇదియే సనాతన ధర్మము. కావున ధర్మ సమ్మతమగు వన వాసము చేయవలెను.

లక్ష్మణా! లోకమున ధర్మమునకు ఫలములైన సౌఖ్యములు లభించుటలో ఉపాయములుగ నిశ్చయింపబడిన ధర్మము, అర్థము కామములను మూడును ధర్మము నందే యున్నవి. భార్య ఎట్లు అనుకూలవతియై ఎట్లు ధర్మమును కలిగించునో,

ప్రియురాలై కామమును సాధించునో, సత్సంతానము కలదై సకలార్థములు సాధింపచేయునో అట్లే ధర్మమే సకల పురుషార్థసాధనము కావున ధర్మమును ఆశ్రయింపవలయును. కావున నీవట్లుపలుకవలదు. తండ్రి మున్నగు వారిపై కోపమును, నన్నుగూర్చిన శోకమును వదలి ధైర్యమును అవలంబించ వలయునని ధర్మోపదేశము గావించెను.

రాముడు వనవాసం వెళ్లుచూ తన అర్ధాంగియైన సీతతో సీతా! 'కులే మహతి సంభూతే ధర్మజ్ఞేధర్మచారిణి' పూజ్యులగు నాతండ్రి నన్ను అడవికి పంపుచున్నాడు. నీవు గొప్పకులమున పుట్టినదానవు. ధర్మమెరిగిన దానవు. నేను అడవికి వెళ్ళుచున్నాను. నాతండ్రి భరతుని యువరాజుగ నియమించినాడు. 'భరతస్య సమీపేతు నాహం కథ్యః కదాచన'. కావున నీవెన్నడు భరతుని చెంత నన్ను గొప్పగ పలుకకుము. నీవు భరతునిచే ఇప్పటినుండి పోషింపదగిన దానవు. కావున సాధారణ బంధువువలె ఉండవలెను. దశరథుడు భరతునికి రాజ్యము నిచ్చెను. కావున అతడును దశరథుడును నీచే సంతోషపెట్టదగినవారు. నేను అడవికి వెళ్ళగ నీవు వ్రతములు, ఉపవాసములు చేయుటలో ఆసక్తురాలవుకమ్ము. ఉదయముననే లేచి శాస్త్రోక్తముగ పూజచేసి దశరథునకు నమస్కరించుము. అనంతరము దుఃఖముచే కృశించినది, ధర్మమునే ముందుంచుకొన్న మాతల్లి కౌసల్యను ఆదరింపుము. మరియు తక్కిన తల్లులను గూడ పూజింపుము. తల్లులందరు నాకు సమానము.

**భ్రాతృ పుత్ర సమౌ చాపి ద్రష్టవ్యౌచ విశేషతః ।**
**త్వయా భరత శత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరౌ మమ ॥**

**అయో.కా.26-33.**

అనంతరము భరత శత్రుఘ్నులను నీసోదరులవలె, బిడ్డలవలె, విశేషమగు వాత్సల్యముతో చూచుకొనుము. వారు నాకు ప్రాణములకన్నా ప్రీతి పాత్రులే. భరతుడు దేశాధిపతికావున అతనికెన్నడు విరోధము కల్గించకుము. కనుక నీవు ధర్మమునందు ఆసక్తురాలవై, అమోఘమైన వ్రతమును ఆచరించమని చెప్పెను.

## శ్రీరాముని భ్రాతృప్రేమ

సకల గుణములకు నిలయుడైన శ్రీరామచంద్రుని సోదర ప్రేమ మిక్కిలి ఆదర్శప్రాయమైనది. నేటి సమాజమున ఏకగర్భజనితులైనప్పటికి వారిమధ్య పరస్పర ప్రేమ కనిపించుటలేదు. ఫలితముగ ఒకరిపైన ఒకరు దాడి చేయడము, ఆస్తి నపహరించడము, సంహరించడము మొదలగు దుష్కృత్యములను ఆచరించుచున్నారు.

శ్రీరాముని విషయమున అట్లుగాదు. కౌసల్యకు శ్రీరాముడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణ, శత్రుఘ్నులు జన్మించినారు. అనగా తల్లులు వేరని స్పష్టముగ తెలియుచున్నది. కాని నలుగురికి దశరథమహారాజే తండ్రి, కాని ఆనలుగురు అన్నదమ్ముల మధ్యన ఉండెడి సోదర స్నేహము దైనందిన జీవనములో ఆచరించుటకు సాధ్యము కానిది. కాని శ్రీరామచంద్రుడు లక్ష్మణాది సోదరులు అది సాధ్యమే అని నిరూపించినారు. శ్రీరాముని భ్రాతృప్రేమ ఎట్టిదో బాలకాండమున మనకు కన్నులకు కట్టినట్లు కనిపించుచున్నది. నిరంతరము తనను నీడలా వెంటాడుతున్న లక్ష్మణునిపైగల సోదరప్రేమ ఎట్టిదో వాల్మీకి యిట్లు తెలియజేసెను.

**న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః ।**
**మృష్టమన్న ముపానీత మశ్నాతి నహి తం వినా ॥ బాల.కా.18-31.**

లక్ష్మణుడు లేనిచో శ్రీరామచంద్రుడు నిద్రించెడివాడుకాదు. మృష్టాన్నము లభించినను, లక్ష్మణుడు లేనిచో భుజించెడి వాడు కాదు. అట్లే భరత శత్రుఘ్నుల యెడలను భావించెడివాడు.

తన తండ్రి తనకు యువరాజ్యాభిషేకము చేయుదునని తెలియజేయగ, శ్రీరామచంద్రుడు ఆ ప్రియమగు వార్తను తన తల్లికి, తన తమ్ముడగు లక్ష్మణునికి, తన అర్ధాంగియగు సీతకు చెప్పినాడు. ఆసమయమున రాముడు లక్ష్మణునితో చెప్పిన వాక్యములను పరిశీలించినచో అతని భ్రాతృప్రేమ స్పష్టముగ తెలియగలదు.

**లక్ష్మణే మాం మయాసార్థం ప్రశాధిత్వం వసుంధరామ్ ।**
**ద్వితీయంమే అంతరాత్మానం త్వామయం శ్రీరుపస్థితా ॥**

**అయో.కా.4-43.**

లక్ష్మణా! నాతో కూడ ఈభూమండలమును పాలింపుము. నా రెండవ అంతరాత్మ వంటి నీకు యిపుడు ఐశ్వర్యము పట్టినది.

**సౌమిత్రే భుంక్ష్వ భోగాం స్త్వ మిష్టాన్ రాజ్యఫలానిచ ।**
**జీవితం చాపి రాజ్యం చ తదర్థమపి కామయే ॥ అయో.కా.4-44.**

లక్ష్మణా నీవు యిష్టములగు భోగములను రాజ్యఫలములను స్వేచ్ఛగ అనుభవించుము. నేను జీవితమును, రాజ్యమును కూడ నీకొరకే కోరుచున్నాను.

కేకయ రాజ్యమునుండి తిరిగి వచ్చిన భరతుడు శ్రీరాముని వనవాస వార్తను విని మిక్కిలి కోపము చెంది తల్లిని దూషించి రామునికి రాజ్యము అప్పగించుటకై కొంత సైన్యమును వెంటబెట్టుకొని చిత్రకూట పర్వతమునకు బయలుదేరును. ఆసమయమున లక్ష్మణుడు సాల వృక్షము నెక్కి చూడగ భరతుని

సైన్యము కనిపించెను. అదిగాంచి భరతుడు తమపైకి దండెత్తి వచ్చు చున్నాడని తెలిసికొని అగ్రహోదగ్రుడై అతనిని చంపుటకు అనుమతి నివ్వవలసినదని శ్రీరాముని కోరెను. ఆసమయమున లక్ష్మణుని అనునయించి తనకుగల అపారమైన సోదరప్రేమను చాటుకొనెను.

**ధర్మ మర్థంచ కామంచ పృథివీం చాపి లక్ష్మణ ।**
**ఇచ్ఛామి భవతామర్థే ఏతత్ప్రతి శృణోమి తే ॥ అయో.కా.97-5.**
**యద్వినా భరతం త్వాంచ శత్రుఘ్నం వాపి మానద ।**
**భవేన్మమ సుఖం కించి ద్భస్మ తత్కురుతాం శిఖీ ॥ అయో.కా.97-8.**

లక్ష్మణా! భరతుని పట్ల నీవట్లు భావింపవలదు. ధర్మార్థకామములు, ఈభూమండలము వీటన్నిటిని నేను మీ కొరకే కోరుచున్నాను. నీవు, భరతుడు, శత్రుఘ్నుడు లేనట్టి ఏ అల్పసుఖమైనను నాకు వలదు.

**మన్యేఽహ మాగతోఽయోధ్యాం భరతో భ్రాతృవత్సలః ।**
**మమ ప్రాణాత్ప్రియతరః కులధర్మ మనుస్మరన్ ॥ అయో.కా.97-9.**

భ్రాతృవత్సలుడైన భరతుడు నాప్రాణములకంటే మిక్కిలి యిష్టమైన వాడు. జడలు నారచీరలు ధరించి వనమునకు వచ్చిన మనలను చూచుటకై వచ్చుచున్నాడేగాని వేరొకదృష్టితో గాదు. కుల ధర్మము ననుసరించి భరతుడు తిరిగి రాజ్యము నప్పగించుటకే వచ్చుచున్నాడు. అని సోదరులపై తనకు గల ప్రేమను ప్రకటించుకొని లోకమునకు ఆదర్శప్రాయుడైనాడు.

మరియు యుద్ధకాండమున ఇంద్రజిత్తు యొక్క నాగపాశముచే రామలక్ష్మణులు బద్ధులై మూర్ఛపోయిరి. శ్రీరాముడు తన తమ్ముని కన్నా కొంచెం ముందుగ మూర్ఛనుండి తేరుకొని సోదరుడు మృతకల్పుడై పడియుండుటను చూచి దుఃఖాతిశయముతో యిట్లు విలపించెను.

**కింన్ను మే సీతయా కార్యం లబ్ధయా జీవితేనవా ।**
**శయానం యోద్య పశ్యామి భ్రాతరం యుధి నిర్జితమ్ ॥**
**శక్యా సీతా సమానారీ మర్త్య లోకే విచిన్వతా ।**
**న లక్ష్మణ సమో భ్రాతా సచివః సాంపరాయికః ॥ యు.కా. 49.5-6.**

నాతమ్ముడిపుడు యుద్ధమున పరాజితుడై నేలపై బడియున్నాడు. నాకింక సీతతో గాని, నాప్రాణములతోగాని పనియేమున్నది. మనుష్యలోకమంతయు వెదకి సీత వంటి భార్యను సంపాదించవచ్చును. కాని నాకు సహాయుడును, యుద్ధ సమర్థుడును అగు లక్ష్మణుని వంటి తమ్ముని సంపాదించలేను. పైమాటల వలన రాముని భ్రాతృప్రేమ ఎటువంటిదో తెలియుచున్నది.

## అనుచరుల ఎడ ప్రేమ

శ్రీరామ చంద్రుడు తన అనుచరుల ఎడల అపారమైన ఆదరాభిమానములు కలవాడని ఆయా సంఘటనలను బట్టి బుజువగుచున్నది. ముఖ్యముగా గుహుడు, సుమంత్రుడు, జటాయువు మొదలగు వారి యెడల ప్రవర్తించిన తీరు మిక్కిలి ప్రశంసనీయమైనది. తాను లోకోత్తమ పురుషుడైనప్పటికి సాటిలేని పరాక్రమము గలవాడై, రాజైయుండి కూడ అనుచరుల సహాయము లేనిది ఏకార్యములను సాధించుటకు వీలు లేదని తెలియ జేసినట్టి ఆదర్శమూర్తి. యిందులో స్పృశ్య, అస్పృశ్య భేదములు, కులపట్టింపులు, మానావమాన భేదములను లెక్కించక తన అనుచరులను లెస్సగ ప్రేమించెను. ఒక్కొక్క అనుచరుని పైన ఎట్లెట్లు తన ఆదరాభిమానములను ప్రదర్శించి లోకమునకు ఆరాధ్యుడైనాడో తెలిసికొందము.

రామునికి ప్రియమిత్రుడు గుహుడు. రాముడు సీతా లక్ష్మణులతో కలిసి శృంగి బేరం వెలుపల విడిది చేసెను. అదిగాంచి గుహుడు వివిధ భక్ష్య, భోజ్యాదులతో సత్కరించుటకు సంసిద్ధుడాయెను.

నిషాదులకు రాజు అయినప్పటికీ గుహుడు తన అనుచరుడైనందున ఆయనతో ఎంతో స్నేహ పూర్వకముగ మాట్లాడి ఆయనపై తనకుగల అనురాగమును తెలుపుకొనెను. గుహుడా! నీవు కాలి నడకతో వచ్చి మమ్ము ఆహ్వానించుట చేతను, స్నేహము చూపుట చేతను, మేము అన్నివిధముల నీచే పూజింపబడితిమి. సంతుష్టులమైతిమి. అనిపలికి గుహుని కౌగిలించుకొని కుశల ప్రశ్నలడిగెను.

శ్రీరామునికి సుమంత్రుడు కూడ సహచరుడై ఎల్లప్పుడు రామచంద్రుని అనుసరించి తిరుగువాడు. కావుననే గంగానది దాటునపుడు రాముడు తన కుడి చేతితో సుమంత్రుని తాకుచు నీవు వెంటనే రాజునకు సన్నిహితుడవై యుండుమని పలికెను. సుమంత్రుడు రామునకు సూతుడైనను అతని ఎడల రామునికి ఎంతో ప్రేమ కలదని దీనివలన మనకు తెలియు చున్నది. వనవాసమునకు వెళ్లునపుడు రాముడు సుమంత్రునితో పలికిన మాటలు ఎంతో ఉదాత్తముగ నున్నవి.

**ఇక్ష్వాకూనాం త్వయా తుల్యం సుహృదం నో పలక్షయే ।**
**యథా దశరథో రాజా మాం నశోచే త్త థాకురు ॥**

సుమంత్రా! ఇక్ష్వాకువంశము వారికి నిన్నుబోలిన మిత్రుని వేరొకని కానను. దశరథమహారాజు నన్ను తలంచి దుఃఖింపకుండునట్లు చేయుము. ఇటువంటి రాముని సహచరుల ఎడగల ప్రేమ అందరికీ ఆదర్శవంతమైనది.

## సుఖదుఃఖములలో సమానత్వము

శ్రీరామ పట్టాభిషేకము కొన్ని గంటలలో జరుగనున్నదనగ సుమంత్రుడు వచ్చి దశరథుడు నిన్ను ఆహ్వానించుచున్నాడు అని రామునితో చెప్పెను. అంత రాముడు ఏమాత్రము ఆలస్యము చేయక కైక గృహమునందు యున్న దశరథుని దగ్గరకు వెళ్లెను. ఆసమయమున దశరథుని ముఖము వివర్ణమై యుండగ అతడు అట్లగుటకు కారణమేమని రాముడు కైకను అడిగెను. అంత ఆమె మీతండ్రిగారికి ఏదుఃఖమును లేదు. ఆయన యందు ఒక విషయ మున్నది. దానిని నీయందు భయముతో తెలుపలేకున్నాడు. నీకు యిష్టము లేని మాట తెలుపుటకు అతని నోట మాట రాలేదు. ఆయన చేసిన వాగ్దానమును నీవు నెరవేర్చవలెను. దానిని మీతండ్రి స్వయముగ నీకు చెప్పలేకున్నాడు అని చెప్పెను. నీవు తండ్రి వాగ్దానము ప్రకారము దండకారణ్యమున పదునాలుగు సంవత్సరములు నివసింపుము.

**సప్తసప్త చ వర్షాణి దండ కారణ్య మాశ్రితః ।**
**అభిషేక మిమంత్యక్త్వా జటాచీరధరో భవ ॥** **అయో.కా.18-37.**

నీ అభిషేకమునకై తెచ్చిన సామగ్రినంతయు ఉపయోగించి భరతునకు పట్టాభిషేకము చేయువలెను. వజ్రపాత సదృశమగు ఆవాక్యము విని రాముడు ఏమాత్రము బాధపడలేదు. పట్టాభిషేకము జరుగునని తెలిసినపుడు సంతోషించలేదు. అడవికి వెళ్ళమన్నప్పుడు బాధపడనూలేదు.

దీనిని బట్టి రాముడు సుఖదుఃఖముల యందు సమానముగ నుండువాడని తెలియుచున్నది.

ఇదే విషయమును దశరూపక మందు కూడా క్రింది విధముగా చెప్పబడినది.

**అహూతస్యాభిషేకాయాం విశ్రృష్టస్య వనాయ చ ।**
**నమయా లక్షితస్తస్య స్వల్పోప్యాకార విభ్రమాః ॥**

**దశరూపకం.పు.108.**

అభిషేకమునకు ఆహ్వానించినప్పటికి వనానికి పంపినప్పటికి రాముని ఆకారములో ఏమాత్రము మార్పులేదు. మరియు సుభాషిత రత్న బాండాకారములో చెప్పినటుల మహాత్ములు సంపదల యందును, ఆపదలయందును ఒకేవిధముగ నుందురు.

**సంపత్తౌ చ విపత్తౌచ మహతామేక రూపతా ।**
**ఉదేతి సవితా రక్తః రక్త ఏవ హస్తమేతి చ ॥**

ఉదాహరణమునకు సూర్యుడు ఉదయాస్తమయము లందు ఒకే విధముగ నుండును. ఉదయించునపుడు సంతోషముగను అస్తమించు నపుడు దుఃఖముగను ఉండడు. మరియు

**దుఃఖేష్వను ద్విఘ్నమనాః సుఖేషు విగత స్పృహః ।**
**వీతరాగ భయక్రోధః స్థిత ధీర్మని రుచ్యతే ॥** భ.గీ.2-56.

దుఃఖము నందు బాధపడకుండుటయు సుఖములందు అనురాగము లేక క్రోధము, భయము లేనట్టి స్థిరమైన బుద్ధిగలవాడే ముని అని భగవద్గీత తెలుపుచున్నది. సుఖదుఃఖముల యందు సమానముగ నుండవలెననిడి ఈగుణము మానవాళికి మిక్కిలి ఆదర్శప్రాయమైనది.

## త్యాగ గుణము

దశరథ మహారాజు వృద్ధాప్యము పైబడి నందున జ్యేష్ఠుడు సకల గుణోపేతుడైన రామునకు పట్టాభిషేకము చేయవలెనని నిశ్చయించెను. కాని విధి విలాసము వలన కైకేయి కివ్వవలసిన రెండు వరములకు లోబడి ఆకార్యము నెరవేర్చ లేకపోయెను. న్యాయముగ ఆ రాజ్యము శ్రీరామునకు రావలసినది. కాని మంథర ప్రోద్బలము వలన కైకేయి అతనికి రాజ్యము లేకుండ చేసినది. దశరథునకు గాని రామునకు గాని ప్రజాబలము యున్నది. అయినను ధర్మమునకు కట్టుబడి ఏమీ చేయలేకపోయెను. దశరథుని పిలుపుపై శ్రీరాముడు కైకేయి అంతఃపురమునకు వెళ్లెను. అచట కైకేయి రామునుద్దేశించి-- రామా! పూర్వము దేవాసుర యుద్ధమున నీతండ్రికి బాణములు గుచ్చుకొనగ అతనిని యుద్ధమున కాపాడితిని. అట్లు కాపాడి నందులకుగాను ఆయన రెండువరముల నిచ్చి యున్నాడు. ఆరెండు వరములలో ఒకటి భరతునికి పట్టాభిషేకమును, రెండవది నీవిపుడే దండకారణ్యమునకు పోవలెనని కోరితిని.

**తత్రమే యాచితో రాజా భరతస్యాభిషేచనమ్ ।**
**గమకం దండకారణ్యే తవ చాద్యైవ రాఘవ ॥** అయో.కా.18-33.

కైకేయి పలుకులను విని రాముడు ఏమాత్రము బాధనొందక నీవు చెప్పినట్లే అగుగాక. జడలు, నారచీరలు ధరించి నేను అడవిలో నివసించుటకుగాను వెళ్లెదను. నీవు సంతోషపడుము. మాతండ్రి చెప్పలేదని విచారపడవద్దు. నేనిచట నుండి వెంటనే వెళ్లెదను. అని కైక చెప్పిన ఒక్కమాట వలన తనకు రాబోవు రాజ్యమునంతయు వదలు కొనెను. కనుకనే త్యాగధనుడు శ్రీరాముడు.

రాముడు అడవులకు వెళ్లిన తరువాత దశరథుడు మరణించెను. దశరథ మరణానంతరము భరతుడు వచ్చి దశరథునకు అంత్య క్రియలు జరిపించి తన తల్లి

చేసిన దుష్కృత్యమునకు బాధపడి తల్లిని దూషించి నిండు కొలువులో సయితము తల్లిమాట ద్వారా తనకు లభించిన రాజ్యమునంతయు తిరిగి రామునకు యిచ్చివేయుటకు నిశ్చయించెను. ఆశుభకార్యము చేయుటకు గాను తన తల్లులను, గురువులను మంత్రులను, సేనా నాయకులను, చతురంగ బలములను వెంటబెట్టుకొని రామాశ్రమమునకు వెళ్లి రాముని ఎదుట అగ్రజా! నేను యుక్తవచనములతో నాతల్లి నూరడించితిని. ఆమె యిష్టపడునట్లుగ ఈ రాజ్యమును నాకిచ్చితివి. దానిని తిరిగి నీకు యిచ్చుచున్నాను.

**సాన్త్వితా మామికా మాతాదత్తం రాజ్యమిదంమమ ।**
**తద్దదామి తవైవాహం భుంక్ష్వ రాజ్యమకంటకమ్ ॥**

**అయో.కా.105-4.**

శత్రురహితమగు రాజ్యమును నీవనుభవించుమని భరతుడు తిరిగి సమర్పించెను. అక్కడికి చేరిన వారందరు భరతుని వాక్యములు విని బాగు బాగు అని మెచ్చుకొనిరి. పోయిన రాజ్యము తిరిగి వచ్చినప్పటికి భరతా! మనతండ్రి అరణ్యవాసము చేయమని ఆజ్ఞాపించి యున్నారు. ఆయన శాసనమును పాటించెదను.

**నమయా శాసనం తస్య త్యక్తుం న్యాయ్య మరిందమ ।**
**సత్వయాపి సదామాన్యః స వై బంధు స్సనః పితా ॥**

**అయో.కా.105-39.**

నేను ఆయన ఆజ్ఞను ఆచరింపక విడిచి పెట్టడము తగదు ఆయన ఆదేశము నీకును గౌరవింపదగినదే మన తండ్రి యగు దశరథుని సదాచారము ను దృష్టిలో ఉంచుకొని నీవే రాజువుకమ్ము. అని చేతికి వచ్చిన రాజ్యమును వదలుకొన్నట్టి త్యాగశీలి. శ్రీరాముడు.

## కృతజ్ఞత్వం

కృతజ్ఞత అనునది మానవుని యొక్క సహృదయత్వమును ఔదార్యమును తెలియజేయును. కృతఘ్నత అనునది మానవుని స్వార్థపరత్వమును నీచత్వమును వెల్లడించును. భారతీయులు సహజముగ కృతజ్ఞులు. కృతఘ్నత అనిన మిక్కిలి ఏవగించు కొందురు. కనుకనే రామాయణమున పలుచోట్ల కృతజ్ఞత అను ధర్మము మిక్కిలి ప్రశంసింపబడినది. కృతఘ్నత అనునది మిక్కిలి నిందింపబడినది. ఈక్రింది లక్ష్మణుని వాక్యమును పరిశీలించినచో కృతఘ్నత ఎంత ఏవగింపు కలిగించునో తెలియగలదు.

**గోఘ్నే చైవ సురాపేచ చోరేభగ్న వ్రతే తథా ।**

**నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః ॥** కి.కా.34-12.

బ్రహ్మహత్యకు, మద్యపానమునకు, చౌర్యమునకు వ్రతభంగమునకు సత్పురుషులు ప్రాయశ్చిత్తమును చెప్పియున్నారు. కాని కృతఘ్నత అను పాపమునకు మాత్రము ప్రాయశ్చిత్తములేదు.

శ్రీరాముడు, తన కొరకు తన సర్వ సుఖములను త్యజించి, నవ వధువగు ఊర్మిళను సైతము విడిచి అడవులకు వచ్చి తనను అహర్నిశలు అప్రమత్తతతో కాపాడిన లక్ష్మణుడు రావణుని యొక్క శక్తి ప్రహారముచే మూర్ఛనొంది నప్పుడు కడు దీనముగ విలపించి, తన అనన్య సామాన్యమగు కృతజ్ఞతా భావమును ఈవిధంగా తెలియజేసినాడు.

**కిం మే రాజ్యేన కిం ప్రాణైః యుద్ధే కార్యం న విద్యతే ।**

**యత్రాయం నిహత శ్శేతే రణ మూర్ధని లక్ష్మణః ॥** యు.కా.101-12.

లక్ష్మణుడు ఈవిధముగ శత్రువులచే నిహతుడై యుద్ధ సమయమందు పడి యుండగ నాకు రాజ్యముతో నేమి పని. అతడు లేకుండగ నేను బ్రతికి మాత్రమేమి చేయుదును. ఇక యుద్ధము మాత్రమేల చేయవలెను.

**యథైవ మాం వనం యాంత మను యాతి మహాద్యుతిః ।**

**అహమప్యను యాస్యామి తథైవైనం యమక్షయమ్ ॥**

యు.కా.101-13.

నేను వనమునకు బయలు దేరి నపుడు ఎట్లు మహాద్యుతియగు ఈ లక్ష్మణుడు నావెంట బయలుదేరెనో అట్లే యమసదనమునకు పోవు లక్ష్మణుని వెంటనేను బయలు దేరుదును. అని దుఃఖించి తన కృతజ్ఞతా భావమును తెలియ జేసెను. మరియు విభీషణుని పట్ల, తనకు యుద్ధమున సాయపడిన సుగ్రీవాది స్నేహితులు వారి అనుచరుల పట్ల శ్రీరామచంద్రుడు ప్రదర్శించిన ఆత్మీయత, అతని యుత్కృష్టమగు మైత్రి అతని కృతజ్ఞతకు తార్కాణము.

శ్రీరాముడు సీతను వెదుకుచు లక్ష్మణునితో కలసి అరణ్యమున సంచరించు చుండగ వారికి నెత్తుటిచే తడచి నేలపై బడియున్న జటాయువు కనబడెను. జటాయువును చూచి, జటాయువే సీతను తిని యుండునని భావించి బాణముచే చంపుటకు సిద్ధపడెను. అదిగాంచి జటాయువు దుఃఖముతో దీనవాక్యములతో తాను రావణుని బారినుండి సీతను విడిపించబోయిన విధమును తెలియజేసెను.

ఆమాటలు విని శ్రీరామచంద్రుడు మిక్కిలి కలత నొంది లక్ష్మణా! బహుకాలము నుండి జీవించియున్న ఈ జటాయువు నేడు ఈ విధంగా పడియున్నాడు. కాలము ఎట్టి వారికైనను దురతిక్రమము. నాకు ఉపకారము చేసిన ఈ జటాయువు సీతను విడిపించుటకు రావణునితో పోరాడి అతనిచే నిహతుడైనాడు.

**సర్వత్ర ఖలు దృశ్యంతే సాధవో ధర్మచారిణః ।**
**శూరాశ్శరణ్యా సౌమిత్రే తిర్యగ్యోని గతేష్వపి ॥** అర.కా.68-24.

నా కొఱకు ఈ పక్షిరాజు ప్రాణములు త్యజించినాడు. ఆపదలో యున్నవారిని రక్షించే మహాత్ములు మానవులలోనే కాదు సకల జీవులందును, పశుపక్ష్యాదులందును ఉన్నారు.

**సీతాపహరణం దుఃఖం నమే సౌమ్య తథా గతమ్ ।**
**యథా వినాశో గృధ్రస్య మత్కృతేచ పరంతప ॥** అర.కా.68-25.

లక్ష్మణా! ఈజటాయువు నాకొఱకు మరణించుటచే కల్గుచున్న దుఃఖము సీతాపహరణము వలన గూడ నాకు కలుగుటలేదు.

**రాజా దశరథ శ్శ్రీమాన్యథా మమ మహాయశాః ।**
**పూజనీయశ్చ మాన్యశ్చ తథాయం పతగేశ్వరః ॥** అర.కా.68-26.

గొప్పకీర్తి సంపన్నుడును శ్రీమంతుడునునగు రాజువలె ఈ పక్షిరాజు జటాయువు గూడ మనకు పూజ్యుడు అనెను.

అంతట మృతుడైన ఆజటాయువును నక్కలకు, కుక్కలకు, కాకులకు, గ్రద్దలకు విడచి తనదారినతాను సీత కొఱకు అన్వేషిస్తూ పోకుండ, మంచి వారైన కుమారులు తమ తండ్రి చనిపోయినపుడు, ఎంత భక్తి శ్రద్ధలతో అన్ని కర్మలను చేస్తారో అంత భక్తి శ్రద్ధలతో అతని కర్మ కాండలను చేసినాడు. శ్రీరాముడే స్వయముగ చితిని పేర్చి దహించినాడు. అంతటితో ఊరుకొనక అతనికి పుణ్యాత్ములగు వారు పొందు ఉత్తమ లోకములను అనుగ్రహించుచు శ్రీరాముడు యిట్లనినాడు.

**యా గతి ర్యజ్ఞ శీలానా మా హితాగ్నేశ్చయాగతిః ।**
**అపరావర్తినాం యాచ యాచ భూమి ప్రధాయినామ్ ॥**

అర.కా.68-29.

మహాబలముగల గృధ్రరాజా! యజ్ఞశీలురు, ఆహితాగ్నులు యుద్ధములో వెన్నుచూపనివారు, భూదానములు చేసినవారు.

**మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛలోకాననుత్తమాన్ ।**
**గృధ్రరాజ మహాసత్త్వ సంస్కృతశ్చ మయా వ్రజ ॥** అర.కా.68-30.

మహాత్ములు ఎట్టి ఉత్తమ లోకములను పొందుదురో అట్టి ఉత్తమోత్తములగు లోకములను నాచే సంస్కృతుడవైన నీవు పొందుదువు గాక! అని దీవించెను.

ఈవిధంగా శ్రీరామచంద్రప్రభువు సాధువు, పరోపకారపరాయణుడు, ధర్మవర్తనుడు అయిన జటాయువునకు పుణ్యగతులను అనుగ్రహించి తన కృతజ్ఞతను వెల్లడించాడు. తరువాత పక్షిరాజగు జటాయువుకు జలతర్పణ పిండ ప్రదానాదులను నిర్వర్తించి తన సర్వభూాత సమత్వమును అసదృశమగు కృతజ్ఞత్వమును వెల్లడించుకొనెను. అందుకే శ్రీరామచంద్రుడు మానవులకేగాక సకల జీవరాసులకు ఆదర్శప్రాయుడైనాడు.

మరియు హనుమంతుడు చేసిన ఉపకారమునకు రాముడు తన కృతజ్ఞతను వెల్లడించుకొనుచు యిట్లనెను.

**అహం చ రఘువంశశ్చ లక్ష్మణశ్చ మహాబలః ।**

**వైదేహ్యా దర్శనే నాద్య ధర్మతః పరిరక్షితా ॥** యు.కా.1-11.

హనుమంతుడు లంకలో నున్న సీతను చూచి నన్ను నావంశమును, నాసోదరులను మాఅందరినీ ధర్మతః పరిరక్షించి యున్నాడు. అతడు జానకి యొక్క కుశల వార్తను తెలుపక యుండిన మహా అనర్థము సంభవించి యుండెడిది.

**ఇదంతు మమ దీనస్య మనో భూయాః ప్రకర్షతి ।**

**యది హాస్య ప్రియా ఖ్యాతు ర్నకుర్మ సదృశం ప్రియమ్ ॥**

యు.కా.1-12.

యిట్టి మహత్తరమగు ప్రియవార్తను తెలిపిన ఈ హనుమంతునికి తగిన ప్రియమును చేయలేక పోయినందులకు మిక్కిలి బాధపడెను.

మా ప్రాణములు నిలబెట్టిన అతనికి నేను చేయదగిన ప్రియము ఒక్కటియేయని హనుమంతుని పరిష్వంగము చేసుకొనెను. యిట్టి రాముని కృతజ్ఞత అందరికిని ఆదర్శవంతమైనది.

## ప్రజారంజక పాలన

మనువు మొదలుకొని ఈనాటి వరకు ఎందరెందరో రాజులు దేశములను పరిపాలించుచునే యున్నారు. చరిత్రలో ఎందరో రాజులు తమ ప్రజలను కన్న బిడ్డలవలె పరిపాలించినారని తెలియుచున్నది. ఎంతో మంది శక్తి వంచన లేకుండా తమ ప్రజలను పరిపాలించి యున్నారు. ఆ రాజుల పాలనలో ఎంత సక్రమముగా పరిశీలించిననూ ఏవో

కొన్ని లోటుబాటులు లేకపోలేదు. ఈరాజులందరి పరిపాలన ఒక ఎత్తు శ్రీరామచంద్రుని పరిపాలన ఒక ఎత్తు.

శ్రీరామచంద్రుని పరిపాలన ఆచంద్ర తారార్కము విలసిల్లునట్టిది. ఆయన పాలన భూమండలము నందలి రాజుల కెల్లరకు ఆదర్శప్రాయమైనది. ఎంతమంది రాజులు ప్రయత్నించినను రామరాజ్యమును కొని తెచ్చుటలో విఫలులగుచునే యున్నారు. దీనిని బట్టి రామ రాజ్యము ఎంత ఉత్కృష్టతరమైనదో, దివ్యమైనదో, ఆదర్శప్రాయమైనదో విదితమగు చున్నది. శ్రీరాముడు తండ్రికిచ్చిన మాట ప్రకారము పదునాలుగు సంవత్సరములు వనవాసము చేసి నంది గ్రామమున సోదరులెల్లరిని కలుసుకొని జడలను తీసివేసి సీతాసమేతుడై మునుపు తండ్రిచే యివ్వబడిన రాజ్యమును మరల స్వీకరించెను. రాముడెప్పుడెప్పుడు రాజ్యమును స్వీకరించునా అని ఎదురు చూచుచున్న ప్రజలు ఆనందముతో తమ కోర్కెలు నెరవేరునన్న సంతోషముతో ఆనందము నొందిరి. రాముడు రాజ్యమును చూడ రాముని యెడల భక్తి పూర్వకమగు ధర్మాచరణ తత్పరులై మానసిక బాధనుగాని, శారీరిక సంబంధమగు వ్యాధినిగాని, కరువుకాటకాది భయమును గాని లేనివారై నిశ్చింతగా యుండిరి.

**వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః ।**
**ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి ॥** అయో.కా.2-42.

ప్రజలెవ్వరు అకారణముగ తమకన్నా ముందుగనే పుత్రమరణ బాధను పొందనైరి. స్త్రీలెల్లరును వైధవ్యము లేక దీర్ఘకాలము పతిసేవాపరాయణులై గడుపుచుండిరి. ఎవ్వరును అగ్నిలో పడిగాని, నీటిలో మునిగి గాని ఆత్మహత్య చేసికొనుటకు సిద్ధపడెడి వారుకాదు. పెనుగాలి వచ్చునను భయముగాని ఆ ప్రజలకు లేకుండెను. ఆకలి వలన దొంగలవలన ఏమాత్రము భయములేకుండెడిది. జనులకు కష్టములు కలిగినపుడు శ్రీరాముడు తనకు వచ్చినట్లుగానే భావించి దుఃఖించువాడు. వారికి శుభములు కలిగినపుడు వారి అభివృద్ధిని చూసి తండ్రివలెనే మిక్కిలి సంతోషించు చుండెను. జనపదములన్నియు పైరు పచ్చలతో కూడి ధన ధాన్యసంపన్నులై యుండిరి. కృతయుగమున జనులెట్లు సంతోషము నొంది యుండిరో అట్లే త్రేతాయుగమున కూడ ప్రజలు సుఖశాంతులతో తేలియాడు చుండిరి.



# లక్ష్మణుడు

లక్ష్మణుడు దశరథ సుమిత్రుల పెద్దకుమారుడు. నిరంతరము రామునే అనుసరించువాడు. లక్ష్మణుడు మహావీరుడు, అమితోత్సాహి, మితభాషి, అనుశాసన ప్రియుడు. ఇతడు మహోత్యాగి, జితేంద్రియుడు, పరస్త్రీలను మాతృభావముతో చూడదగిన మహాత్ముడు. కనుకనే అతని సేవలకు అతని ప్రేమకు ముగ్ధుడై శ్రీరాముడు యిట్లు ప్రశంసించెను.

**భావ జ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణః।**
**త్వయా పుత్రేణ ధర్మాత్మా నసంవృత్తః పితామమ ॥** అర.కా.15-29.

పరేంగితజ్ఞుడవును, కృతజ్ఞుడవును, సేవాధర్మజ్ఞుడవును, అయినటు వంటి పుత్రుని వలన ధర్మాత్ముడగు నాతండ్రి పోయినట్లు నేననుకొనుటలేదు. ఇక్కడ వాల్మీకి వ్యంగ్య మర్యాదచే అద్భుతమగు భావమును శ్రీరామ చంద్రుని ద్వారా ప్రకటింప చేసినాడు. నాతండ్రిపోయిన లోపము లక్ష్మణుని మూలమున తీరుచున్నదనియును. అతని యందు ధర్మాత్ముడును, పుత్రవత్సలుడును అగు నా తండ్రిని చూచు చున్నానని అనిపించినాడు.

సుందర కాండలో సీత లక్ష్మణుని గూర్చి యిట్లు చెప్పెను.

**వృద్ధోపసేవీ లక్ష్మీవాన్ శక్తోన బహుభాషితా।**
**రాజపుత్రః ప్రియశ్రేష్ఠ స్సదృశ శ్శ్వశురస్స మే ॥**
**మత్తః ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః।**
**నియుక్తోధురి యస్యాంతు తాము ద్వహతి వీర్యవాన్॥** సు.కా.38.61-63.

లక్ష్మణుడు పెద్దలను సేవించువాడు. శ్రీమంతుడు, సమర్ధుడు, రాకుమారుడు. అందరికి ప్రీతి పాత్రుడు. దశరథునితో సాటియైనవాడు. అతడు నాకెల్లప్పుడు ప్రీతి కలిగించువాడు. తనకప్పగించిన కార్యమును చక్కగ నిర్వహించు శక్తిగలవాడు.

## భ్రాతృ భక్తి

రాముడు తండ్రి మాటను పాటించుటకై అరణ్యమునకు వెళ్లుటకై నిశ్చయించి ఆ విషయమును తన తల్లియైన కౌసల్యకు చెప్పగ ఆమె ఎంతో దుఃఖితురాలయ్యెను. కౌసల్య దుఃఖమును తొలిగించుటకుగాను లక్ష్మణుడు ఆ సమయమున యిట్లు పలికెను.

**నరోచతే మమాప్యేత దార్యే! మద్రాఘవో వనమ్।**

**త్యక్త్వా రాజశ్రయం గచ్ఛేత్ స్త్రియా వాక్య వశం గతః ॥ అయో.కా.21-2.**

అమ్మా ! శ్రీరాముడు ఒకస్త్రీమాటకు కట్టుబడి రాజ్యసంపదను విడిచి అడవికి వెళ్లడము నాకును సమ్మతంగాదు. దశరథుడు కాముకుడై ఈ కార్యమునకు హేతువయినాడు. నేను ధనుస్సును ధరించి రాముని ప్రక్కన యమునివలె నిలిచి నట్లైతే ఎవరును మమ్ము ఎదురించుటకు సమర్థులు కారు. అవసరమైనచో తండ్రిని బంధించెదను.

**గురోరప్య వ లిప్తస్య కార్యాకార్య మజానతః।**

**ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్॥ అయో.కా.21-13.**

తండ్రికూడ గర్వితుడై కార్యాకార్యమేదో తెలియక దుష్టపద్ధతి నాశ్రయించినచో అతడు కూడ దండింపదగిన వాడగును.

**దీప్తమగ్ని మరణ్యంవా యది రామః ప్రవేక్ష్యతి ।**

**ప్రవిష్టం తత్రమాం దేవి ! త్వం పూర్వమవధారయ। అయో.కా.21-17.**

**అనురక్తోస్మి భావేన భ్రాతరం దేవి తత్త్వతః ।**

**సత్యేన ధనుషా చైవ దత్తే నేష్టేన తేశపే ॥ అయో.కా.21-16.**

రాముడు ప్రజ్వరిల్లుచున్న అగ్నిలోగాని, అరణ్యమునగాని, ప్రవేశించినచో అతనికన్నా ముందుగ నేనే అందు ప్రవేశింతును. నేను నిజముగ మనః పూర్వకముగ నాఅన్న రాముని యందు అనురక్తుడనైనచో నా సత్యముతో, ధనుస్సుతో, దానముతో, దేవతార్చనతో, నీకు ప్రమాణము చేసి చెప్పుచున్నాను. అని పలికి శ్రీరాముని యెడల తనకుగల ఉత్తమ సోదర భావమును ప్రకటించెను.

**త్వయా మయాచ వైదేహ్యా లక్ష్మణేన సుమిత్రయా ।**

**పితుర్ని యోగే స్థాతవ్య మేష ధర్మ స్సనాతనః ॥ అయో.కా. 21-48.**

లక్ష్మణుడు పలికిన కోపపూరిత మాటలను రాముడు విని కౌసల్య దుఃఖమును చూచి అట్లు దూషించ వలదని పలికి తండ్రి ఆజ్ఞ పాలించి తిరిగి వనవాసము నుండి యిచ్చటకే వచ్చెదనని, నీవు నేను, సీత, లక్ష్మణుడు, సుమిత్ర ఎల్లరును తండ్రి ఆదేశము ననుసరించియే ఉండవలెనని ఇదియే సనాతనమైన ధర్మమని రాముడు కౌసల్యకు తెలియజేసెను.

అనంతరము లక్ష్మణునితో లక్ష్మణా! అభిషేక విధానములనెల్లా ఆపివేసి యిచటినుండి వెంటనే అడవికి వెళ్ళదలుచుకొన్నాను. నేనడవికి వెళ్లిన పిమ్మట కైకేయి తన ప్రయోజనము నెరవేరినదై భరతునకు రాజ్యమును అభిషేకించగలదు. వనవాసము చేయుటకు, ఈయబడిన రాజ్యము రాకపోవుటకు కారణము దైవమేకాని వేరుగాదు. కైక



పలికిన తీవ్ర వాక్యములకు దైవము తప్ప వేరొకరు కారణముకాదు. సుఖదుఃఖములు, శాంతి క్రోధములు, లాభనష్టములు, ఉత్పత్తి వికాసములు అను యిట్టి ఊహించరాని కారణముగల దెల్లయు దైవకార్యమేగాని వేరొకటిగాదు.

**సుఖదుఃఖే భయ క్రోధౌ లాభాలాభౌ భవా భవౌ ।**

**యచ్చ కించి త్తథా భూతం నను దైవస్య కర్మ వత్ ॥ అయో.కా. 22-22.**

అని పలుకగ లక్ష్మణుడు--

**కిం నామ కృపణం దైవ మశక్తమభి శంససి ।**

**పాపయోస్తే కథం నామ తయోశ్శంకా న విద్యతే ॥ అయో.కా. 23-7.**

అసమర్థమగు దైవమును నీవు సమర్థముగ పలుకుచున్నావు. నీవంటివాడు యిట్లు మాట్లాడుట తగదు. దుర్బలురు మాత్రమే దైవమును విశ్వసించెదరు. శోచనీయము శక్తి లేనిది అగు దైవమును ఏల పొగిడెదవు.

**విక్లబో వీర్యహీనో యస్సదైవ మనువర్తతే ।**

**వీరా స్సంభావి తాత్మానో న దైవం పర్యుపాసతే ॥ అయో.కా.23-16.**

పిరికి వాడు శక్తి లేనివాడు దైవమును అనుసరింతురు. వీరులు ధీరులగువారు మాత్రము దైవమును అనుసరించరు.

**అద్య మత్పౌరుషహతం దైవం ద్రక్ష్యంతి వైజనాః ।**

**యద్దైవా దాహతం తేఽద్య దృష్టం రాజ్యభిషేచనమ్ ॥ అయో.కా.23-19.**

ఏ దైవముచే ఈ రాజ్యాభిషేకము ఆటంక పరచబడినదో ఆ దైవమును నా పౌరుషముతో నాశనము చేసెదను.

**లోకపాలాస్సమస్తాస్తే నాద్యరామాభిషేచనమ్ ।**

**న చ కృత్స్నాస్త్రయో లోకా విహన్యుః కిం పునః పితా ॥**

**అహం, తదాశాం చేత్స్యామి పుతుస్తస్యాప్చ యాతవ ।**

**అభిషేక విఘాతేన పుత్రరాజ్యాయ వర్తతే ॥ అయో.కా.23-21,23.**

దేవతలు కూడ నీ పట్టాభిషేకమును చెడగొట్టలేరు. మన తండ్రి ఎట్లు చెడగొట్టగలడు. నీకెవరు అరణ్యవాసమును విధించిరో వారినే అరణ్యవాసము చేయునట్లు చేసెదను. నీ రాజ్యమును నీకు యివ్వలేక పోయినచో నేను వీరలోకములకు అనర్హుడనయ్యెదనని ప్రతిజ్ఞచేసెను. మిక్కిలి వాడియైన మెరుపు తీగవలె చలించు కాంతిగల కత్తిని ధరించి నా శత్రువు యింద్రుడైనను లెక్కింపను, అని తనకు గల పౌరష ప్రతాపాగ్నులను ఆత్మ విశ్వాసమును చాటుకొనెను.

రాముడు అడవులకు వెళ్ళునపుడు తన అన్న పాదములు గట్టిగ పట్టుకొని యిట్లనెను.

**యది గంతుం కృతా బుద్ధిర్వనం మృగగజాయుతమ్ ।**
**అహం త్వాఽనుగమిష్యామి వన మగ్రేధనుర్ధరః ॥**
**మయా సమేతోఽరణ్యాని బహూని విచరిష్యసి ।**
**పక్షిభిర్మృగ యూథైశ్చ సంయుష్టాని సమంతతః ॥**
**న దేవ లోకాక్రమణ్ నామరత్వ మహం వృణే ।**
**ఐశ్వర్యం వాపిలోకానాం నామయే నత్వయా వినా ॥ అయో.కా.31.3-5.**

అన్నా నీవు అడవికి పోవుటకు నిశ్చయించుకొన్నచో మృగములు ఏనుగులతో కూడిన ఆ అడవిలో విల్లు ధరించి నేను నిన్ను అనుసరింతును. నీవు నాతో కూడి అంతటను పక్షులతో, మృగ సమూహముతో కూడిన అరణ్యములలో విహరింపగలవు. నీవు లేని స్వర్గము నేను కోరను. ముసలి తనము, మరణము లేని కైవల్య రూపమగు మోక్షమును కోరను. త్రిలోకాధిపత్యమును కూడ అంగీకరించను. ఇదంతయు లక్ష్మణుని సోదరభావమును ప్రకటించును.

వనవాసమునకు వెళ్లునపుడు కూడ లక్ష్మణుడు రాముని కన్నా ముందే బయలు దేరెను. శ్రీరాముడు తనకు నారవస్త్రములు తీసికొనిరమ్మని పలుకగా కైకేయి స్వయముగ నారవస్త్రములు తెచ్చి కట్టుకొమ్మని రామునకు యిచ్చెను. అనంతరము లక్ష్మణుడు కూడ తండ్రి ఎదుటనే ఉత్తమ వస్త్రములు తీసివేసి తాపసులు కట్టుకొను నారవస్త్రములను ధరించెను. అరణ్య వాసమున తన అన్నను రక్షింపవలెనని తలచి సీతారాములు నిద్రించినను లక్ష్మణుడు నిద్రింపక అట్లే యుండెను. ఆవిధంగా మేల్కొన్న లక్ష్మణుని చూచి గుహుడు యిట్లనెను.

**ఉచితోఽయం జనస్సర్వః క్లేశానాం త్వం సుఖో చితః।**
**గుప్త్యర్థం జాగ రిష్యామః కాకుత్స్థస్య వయం నిశామ్ ॥ అయో.కా.51.3.**

రాకుమారా! మేమందరము కష్టములకు అలవాటు పడినవారము. నీవు సుఖములకు అలవాటు పడినవాడవు. కావున ఈ రోజు రాముని రక్షణకై మేము మేల్కొందుము. అపుడు లక్ష్మణుడు పాపరహితుడవగు ఓ గుహుడా! ధర్మదృష్టిగల నీవు రక్షించు చుండగ నాకు భయమేల? రాముడు సీతతో గూడి నిదురించు చుండగా నాకు నిద్రవెట్ల వచ్చును. ఆశ్వాసనము ( ఊరడిట్లుట) ఎట్లు ఏర్పడును. సుఖము లెట్లు గలుగును. కావుననే నే వీరిని రక్షించవలసియున్నది. అని రాముని ఎడల తనకు గల కర్తవ్యతను బాధ్యతను తెలియజేసెను. రాముడు అరణ్యమును చేరుకొని చిత్రకూట

పర్వతమునకు వెళ్లగ ఆ సమయమున భరతుడు కైకేయి దుష్టకార్యమునకు కోపపడి కుల క్రమాగతముగ రామునికి రావలసిన రాజ్యమును ఆయనకే అప్పగించవలెనని నిశ్చయించి ఆ ప్రాంతమునకు వచ్చిరి. ఆ సంబ్రమమును చూచి అదేదో కనుగొనవలసినదని రాముడు లక్ష్మణుని ఆజ్ఞాపించెను. లక్ష్మణుడు వెంటనే బాగుగా పూచిన ఒక చెట్టునెక్కి అన్ని దిక్కులు కలయ జూచుచు తూర్పు దిక్కున దృష్టిసారించెను. గొప్పసైన్యముతో భరతుడు వచ్చుటను చూచి భరతుడు రాముని చంపుటకే వచ్చు చున్నాడని భావించి రామునికి వచ్చిన ఆపదను చూచి ఎంతో తల్లడిల్లెను. భరతుని బారినుండి రాముని రక్షింపవలయునని ప్రయత్నించిన ఆదర్శ సోదరుడు లక్ష్మణుడు. దీనినిబట్టి శ్రీరామునికి ఎట్టిబాధ కలుగ కూడదని, రామునిపైకి ఎవరైనా దండెత్తి వచ్చినచో వారిని సమూలముగ నాశనము చేయవలయునన్న భావము కలవాడు లక్ష్మణుడని తెలియుచున్నది.

## ఆజ్ఞాపాలన

సీతా రామలక్ష్మణులు పంచవటికి చేరుకొని అచట ఒక ఫలపుష్పములతో కూడిన సమతలమగు భూభాగమున ఆశ్రమమును నిర్మించవలసినదని రాముడు లక్ష్మణుని కోరెను. అంత లక్ష్మణుడు గోదావరి నదికి పోయి స్నానము చేసి ఫలపుష్పములను కోసికొనివచ్చి వాస్తుశాస్త్రముననుసరించి రామునకు చక్కటి ఆశ్రమమును నిర్మించెను. సుందరమగు ఆ ఆశ్రమమును చూచి ఎంతో సంతోషించి లక్ష్మణుని కౌగలించుకొని లక్ష్మణా! నీవు చాలా గొప్పపని చేసితివి. ఈ కార్యక్రమమునకు సంతుష్టుడనైతిని. అందుకే ఈ కౌగిలింత నిచ్చితినని ప్రశంసించెను.

రాముడు సీతా లక్ష్మణులతో కలసి పంచవటి యందున్నపుడు రావణుని చెల్లెలగు శూర్పణఖ రాముని ఆకారమును చూచి మోహించి తనను వివాహము చేసుకొమ్మని రాముని అడిగెను.

**ఏవం భజ విశాలాక్షిః భర్తారం భ్రాతరం మమ।**
**అసపత్నా వరారోహే! మేరు మర్క ప్రభాయథా॥**
**కథం దాసస్య యే దాస భార్యా భవితు మిచ్ఛసి।**
**సోహమార్యేణ పరవాన్భ్రాతా కమల వర్ణిని ॥** **అర.కా.18-5,9.**

అపుడు రాముడు నాసోదరుడు ఉన్నాడని అతడు నీ రూపమునకు తగిన భర్తయని, అతనిని వివాహము చేసుకొన్నచో నీకు సవతి పోరుండదని పలికెను. అపుడు శూర్పణఖ లక్ష్మణుని వద్దకు వెళ్లి నేను నీకు తగిన భార్యను. నీవునాతో కలిసి సుఖముగ దండకార్యణమున నివసింపుమని పలికెను. ఆ సమయమున లక్ష్మణుడు కమలము వంటి శరీరము కలదానా! నేనే దాసుడను. నాకు భార్యవైనచో నీవుదాసివైయ్యెదవు. రాముడు

నాకు ప్రభువు కావున నీవు ఆయనను వరించడమే శ్రేష్టము. అనిపలుకగా అతని మాటలు నిజమని నమ్మి మరల రాముని వద్దకు వెళ్లెను. రాముడు కాదనగా సీత యున్నంత వరకు తనను పరిగ్రహింపడని తలచి ఆమెను తినుటకై ఆమె పైకి పోయెను. అంత రాముడు లక్ష్మణా! సీతకు అపకారము తలపెట్టిన దను నెపముతో ఈమెకు అంగవైకల్యము గావించమని పలికెను. రాముని వాక్కును వేద వాక్కుగా భావించి లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోసి విరూపిని గావించెను. సోదరుని మాటకు ప్రాముఖ్యము నిచ్చి సోదరాజ్ఞా పాలకుడాయెను.

## సీత ఎడల విధేయత

మారీచుడు బంగారు జింకయై రావణుడు చెప్పినట్లుగా రాముని ఆశ్రమ సమీపమున తిరుగుచు సీత దృష్టిలో పడెను. సీత ఆ బంగారు జింకను కోరగ రాముడు దానిననుసరించుచు పోయి అదిదొరక నందున బాణముతో చంపెను. బాణ ఘాతుకమునకు మారీచుడు నేలకొరిగి రాముని కంఠమును అనుసరించుచు హా! సీతా! హా! లక్ష్మణా! అని అరచెను. భర్త స్వరమును పోలిన ఆ ఆర్తనాదమును విని కలవరముతో లక్ష్మణునితో సీత లక్ష్మణా! నీవుపోయి రామునకు ఏమాయెనో తెలుసుకొని అరణ్యమున ఆ క్రందనము చేయుచున్న నీ అన్నను కాపాడుము అని పలికెను. కాని సీత ఎంత చెప్పినను లక్ష్మణుడు అచ్చటనుడి కదలలేదు. అంతసీత కోపముతో లక్ష్మణా! నీ అన్నకిట్టి దురవస్థ కలిగినను నీవు ఆయన దగ్గరకు పోకుండుట ఏల? నీవు మీ అన్నకు మిత్రరూపముననున్న శత్రువు. నీవు రాముని కైంకర్యము కోసం వచ్చినట్టి వాడవు. అట్టి రామునకే ఆపద కలిగినపుడు నీవు ఆశ్రమమునే ఉన్నావని ఏడ్చి అతనిని మానసికముగ నొప్పించెను. చివరకు ఆమె మాట కాదనలేక ఆమె ప్రీతికొరకు ఆమెను సంతోష పెట్టుటకై లక్ష్మణుడు బయలుదేరి వెళ్లెను.

లక్ష్మణుడు కొంత కటువుగా మాట్లాడినప్పటికీ సీతయందు విధేయతనే ప్రకటించెనే గాని ఆమె అనుకొన్నట్లుగా ప్రవర్తించలేదు. సీత ఎంత కఠినముగ మాట్లాడినను అనరాని మాటలన్నను లక్ష్మణుడు ఆమె చెప్పినట్లు నడుచుకొనడం మిక్కిలి ఆదర్శప్రాయమైనది.

## ధైర్యమును కలిగించుట

రామ లక్ష్మణులు తిరిగి ఆశ్రమమునకు రాగా సీత వారికి కనిపించలేదు. ఆశ్రమ మంతయు కాంతి హీనమైనట్లు ఉండెను. కృష్ణాజినము, దర్భలు చెల్లాచెదరైనవి. అదిగాంచి రాముడు మిక్కిలి విలపించెను. సీతను ఏ రాక్షసుడు అపహరించెనో లేక ఆమె బయటికి పోయి దారితప్పి యుండునా, ఏ క్రూర జంతువు బారిలో పడెనో అని చుట్టు ప్రక్కల

ప్రాంతములలో వెదకిరి. కాని సీత కనపడలేదు. అప్పుడు రాముని శోకము వర్ణించుటకు అలవి గానిదయ్యెను. అడవి చెట్లను పేరుపేరునా పిలిచి, అడవిజంతువులను పేరు పేరునా అడిగి సీత వృత్తాంతమును తెలుసుకొన దలచెను. సీత లేదన్న బాధతో రాముడు పరిపరి విధముల విలపించుచు దీనుడై దుఃఖము ద్విగుణీకృతము కాగా కొంతసేపు మూర్ఛపోయెను. ఆ తరువాత ధైర్యము గల లక్ష్మణుడు రామునితో--

**శోకం విముంచార్య ధృతి భజస్వ**
**ప్రోత్సాహత చాస్తు విమార్గణేஉస్యాః ।**
**ఉత్సాహవంతో హి నరాన లోకే**
**సీదన్తి కర్మస్వతి దుష్కరేషు ॥** **అర.కా.63-19.**

ఆర్యా! నీవు శోకమునువీడి ధైర్యమును వహించుము. సీతను వెదకుటకై ప్రయత్నించుము. లోకమున ఉత్సావంతు లెన్నడును అతిదుష్కర కార్యములు సాధించుటలో సయితము పరాజయము నొందరు. ఈ ప్రకారము లక్ష్మణుడు ఎంతగా పలుకుచున్నను అతడు ఉరడిల్ల లేదు.

**పురేవ మే చారు దతీ మనింది తామ్**
**దిశంతి సీతాం యది నాద్య మైథిలీమ్ ।**
**సదేవ గంధర్వ మనుష్య పన్నగం**
**జగత్స శైలం పరివర్త యా మ్యహమ్॥** **అర.కా.64-75.**

అనంతరము రాముడు నా సీతను ఎప్పటిలాగ క్షేమముగా నా కివ్వకపోయినచో దేవ గంధర్వ మానుష్య ఉరగులతో పర్వతములతో కూడిన ఈ లోకము నంతయు నాశనము చేతును. రాముడావిధముగా కోపావిష్టుడు కాగా లక్ష్మణుడు లోక వినాశ భయముతో తన అన్నకి నమస్కరించి యిట్లు పలికెను.

**పురా భూత్వా మృదు ర్దాంత స్సర్వ భూతహి తే రతః।**
**నక్రోధ వశమాపన్నః ప్రకృతిం హాతు మర్హసి ॥** **అర.కా.65-4.**

అన్నా! నీవు పూర్వము ఎంతయో మెత్తని మనసుగల వాడవు జితేంద్రియుడవు. సకల జీవహితైషివి. నీవిపుడు కోపముతో కూడ కొన్నవాడనై మునుపటి నీస్వభావమును విడుచుట తగదు. ఈ ప్రాంతమున ఒక రథము పోయినట్లు కనబడుచున్నది. ఒక్కని అడుగుజాడలే కనబడుతున్నవి. కావున అపరాధి ఒక్కడే యని తెలియుచున్నది. ఒక్క అపరాధికై లోకములనే నీవు నశింపచేయ తగదు. కావున లోకవినాశరూపమగు ప్రయత్నమును వదలి సీతాన్వేషణకై ప్రయత్నింప వలెను. అందుకు నేనును నిన్ను అనుసరించును. అని లక్ష్మణుడు చిన్నవాడైనప్పటికీ తన అన్నను ఓదార్చి సీతాన్వేషణకు ప్రేరణచేసెను.

రాముడు సుగ్రీవునితో స్నేహము చేసుకొని వాలిని చంపి వానర రాజ్యమునకు సుగ్రీవుని పట్టాభిషిక్తుని గావించెను. ప్రతిజ్ఞ మేరకు సుగ్రీవుడు రాజరికపు విలాసముల లోపడి సీతాన్వేషణ విషయమున ఆలస్యము వహించెను. ఆసమయమున రాముడు సీతావిరహతాప మధికమై నిద్రలేని వాడాయెను. విరహతాపము వలన కలిగిన దుఃఖముతో కనులనుండి కన్నీరు కారుచుండగ కలత చెందిన మనసుతో దుఃఖించుచుండెను.

**అలం వీర వ్యథాంగత్వా నత్వం శోచితు మర్హసి ।**
**శోచతో వ్యవసీదంతి సర్వార్థా విదితం హి తే ॥** కి.కా. 27-34.

అట్టిరాముని చూచి లక్ష్మణుడును దుఃఖమును పొంది సోదరుని అనునయించుచు నీవుయిట్లు దుఃఖంపతగదు. దుఃఖించు వారికార్యము లన్నియు చెడిపోవునని తెలియదా! నీవు పౌరుషము అవలంభించి మున్ముందు కార్యములు చేయవలె ననెడి ధైర్యమును కల్గించెను. రాముని కోరిక పై లక్ష్మణుడు సుగ్రీవుని దగ్గరకు వెళ్లి అతనిని సీతాన్వేషణ కార్యమునకు సంసిద్ధునిచేసెను.

## సదాచారము

లక్ష్మణుడు చక్కటి సదాచార సంపన్నుడు. విశేషించి స్త్రీల యెడల ఎంతో గౌరవభావము తో మెలిగెడివాడు. లక్ష్మణుడు కోపోద్రిక్తుడై కిష్కిందా నగరమునకు రాగా అతని కోపమును చల్లార్చుటకుగాను సుగ్రీవుడు తన వదినయైన తారను నీవే లక్ష్మణుని కడకు వెళ్ళి అతనిని మంచి మాటలతో ప్రసన్ను డగునట్లు చేయుము. అనిపలికి లక్ష్మణుని యొక్క సదాచారము నిట్లు ప్రస్తుతించెను.

**త్వద్దర్శన విశుద్ధాత్మా నసకోపం కరిష్యతి ।**
**నహి స్త్రీషు మహాత్మానః క్వచిత్ కుర్వంతి దారుణమ్ ॥**

సుందరీ లక్ష్మణుడు చాలా గొప్పవాడు. గొప్పవారెన్నడును స్త్రీల ఎడల క్రూరులుగ ప్రవర్తించరు. నిన్ను చూడగనే లక్ష్మణుని మనస్సు ప్రసన్న మగుట చే అతడు కోపించక ప్రసన్నుడగునని చెప్పెను. తార లక్ష్మణునితో మాట్లాడగా, లక్ష్మణుడు స్త్రీల ఎడల ఆదరాభిమాని కావున సుగ్రీవుడు చెప్పినట్లే లక్ష్మణుడు ప్రవర్తించెను. లక్ష్మణుడు సుగ్రీవుని అంతఃపురమునకు వచ్చినపుడు రూపయవ్వనముచే వివిధ రూపములు గల అనేక మంది స్త్రీలను చూచెను. రామునికి సుగ్రీవుని పైగల కోపము తననెంతగ సుగ్రీవునిపైకి ప్రేరేపించినను, సదాచారము తనను అడ్డుకొనగ స్త్రీలతో కూడిన ఆ ప్రదేశమును వదలి అంతఃపురమున ఏకాంతమును చేరుకొనెను. తారమధువును సేవించి నందువలన మదించిన కళ్ళతో సంభోగ చిహ్నములతో లక్ష్మణుని వద్దకు రాగా, ఆమె అట్లు రావడంతో కోపమును నిగ్రహించుకొని తలవంచుకొని నిలబడెను. అంతేగాక తారతో

వినయముతో మాట్లాడెను. యిట్టి ఇంద్రియ నిగ్రహముగల లక్ష్మణుని సదాచారము ఆదర్శవంతమైనది.

## త్యాగ గుణము

లక్ష్మణుని జీవితమంతయు త్యాగమయము. రాజ్యభోగముల పట్ల, అధికారము పట్ల అతనికి గల వైముఖ్యము నిజముగ ఆశ్చర్యజనకములు. సీతాదేవి లక్ష్మణుని పరాక్రమమును గూర్చి తెలియజేయుచు హనుమంతునితో యిట్లు పలికెను.

**ప్రజశ్చ సర్వరత్నాని ప్రియా యాశ్చవరాంగనాః।**
**ఐశ్వర్యం చ విశాలాయాం పృధివ్యామపి దుర్లభమ్॥** **సు.కా.38-16.**

ఆర్యా లక్ష్మణుడు అంతఃపుర సౌఖ్యములను, సకల రత్నరాశులను, ప్రియురాలగు ఊర్మిళను శ్రేష్ఠవనితలను, సువిశాలరాజ్యమును, దుర్లభమగు ఐశ్వర్యములను పరిత్యజించి రాముని సేవించుటకై వనవాసమునకు వచ్చి యున్నాడు.

**అనుకూల్యేన ధర్మాత్మా త్యక్త్వా సుఖమనుత్తమమ్।**
**అనుగచ్ఛతి కాకుత్స్థం భ్రాతరం పాలయన్వనే॥**
**సింహస్కంధో మహాబాహుః మనస్వీ ప్రియదర్శనః।**
**పితృవత్ వర్తతే రామే మాతృవన్మాం సమాచరత్॥** **సు.కా.38-59,60.**

ధర్మాత్ముడగు లక్ష్మణుడు భక్తితో పరమ సుఖమును వదలి అడవిలో తన అన్నయగు రాముని కాపాడుచు ఎల్లప్పుడు అతనినే అనుసరించు చున్నాడు. మరియు రాముని తండ్రి వలెను, నన్ను తల్లివలెను చూచెడివాడు.

యముడు శ్రీరామునకు బ్రహ్మసందేశమును వినిపించుటకు వచ్చి శ్రీరామునితో మనమిద్దరము ఏకాంతమున మాట్లాడు కొనవలెనని కోరెను.

**సమేవధ్యః ఖలు భవే ద్వాచం ద్వంద్వ సమేరితామ్।**
**ఋషీర్మమచ సౌమిత్రే పశ్యేద్వా శృణు యాశ్చయః॥** **ఉ.కా. 103-15.**

అందుకు రాముడు లక్ష్మణుని ద్వారం వద్ద కాపలాగ యుంచి మేమిరువురము మాట్లాడుకొనుచుండగ ఎవరైనా లోనికి వచ్చినను మామాటలు విన్నను వానిని వధింతునని చెప్పెను.

రాముడు యముడు యిరువురు ఏకాంతమున మాట్లాడుకొనుచుండగ అంతలోనే దుర్వాస మహర్షి రాముడుండు స్థలమునకు వచ్చి ద్వారమున నున్న లక్ష్మణునితో--

**సోభిగమ్యతు సౌమిత్రి యువాచ ఋషిసత్తమః।**
**రామం దర్శయమే శీఘ్రం పురామేఽర్థోఽతివర్తతే॥** **ఉ.కా.105-2.**

తాను తక్షణము రాముని దర్శనము చేసుకొనవలెనని తెలిపెను.

**కిం కార్యబ్రూహి భగవన్ కోహ్యార్థః కింకరో మ్యహమ్ ।**

**వ్యగ్రోహి రాఘవో బ్రహ్మన్ ముహూర్తం పరిపాల్యతామ్ ॥** ఉ.కా.105-4.

రాముడు ఇతర కార్యములతో మునిగి యున్నాడని, ముహూర్తకాలము వేచి యుండవలసినదని లేనిచో మీరు వచ్చినపని తెలిపినచో దానిని నేనే నెరవేర్తునని తెలిపెను. అంత దుర్వాసుడు మిగుల కోపించి నీవు యీ క్షణముననే నారాకను శ్రీరామునకు తెలుపకున్నచో నిన్ను, ఈ అయోధ్యానగరమును భరతుని మీ యొక్క సంతతిని అందరినీ శపింతును.

**అస్మిన్‌క్షణే మాం సౌమిత్రే రామాయ ప్రతివేదయ ।**

**అస్మిన్‌క్షణే మాం సౌమిత్రే ననివేదయసే యది ॥**

**విషయం త్వాం పురం చైవ శపిష్యే రాఘవం తథా ।**

**భరతం చైవ సౌమిత్రే యుష్మాకం యాచ సంతతిః ॥** ఉ.కా.105.6-7.

భయంకరమగు ఈ సమస్యను పరిష్కరించుటకు లక్ష్మణుడు ఏమిజరిగిన జరగనిమ్మని, తనమూలముగ యింతమంది నాశన మగుటకు యిష్టపడక లోనికి వెళ్లి శ్రీరామచంద్రునికి విషయమును తెలిపెను. రాముడు విధించిన నియమము ప్రకారము లక్ష్మణుని చంపవలెను. సర్వకాల సర్వావస్థల యందు తనను కాపాడి నట్టి లక్ష్మణుని ఎట్లు వధింతునా అని రాముడు పరిపరి విధముల బాధపడెను. కాని లక్ష్మణుడు తన సోదరుని మాట నెరవేరుటకుగాను రామునితో ఈ విధముగా చెప్పెను.

**న సంతాపం మహాబాహో మదర్థం కర్తుమర్హసి ।**

**పూర్వ నిర్మాణ బద్ధాహి కాలస్య గతిరీదృశీ ।**

**జహిమాం సౌమ్య విస్రబ్ధం ప్రతిజ్ఞా పరిపాలయ ।**

**హీన ప్రతిజ్ఞాః కాకుత్స్థ ప్రయాన్తి నరకం నరాః ॥**

**యది ప్రీతిర్మహారాజ యద్యను గ్రాహ్యతా మయి ।**

**జహి మాం నిర్విశంఖస్త్వం ధర్మం వర్ధయ రాఘవ ॥** ఉ.కా. 106.2-4.

అన్నా! నీవు నా కొఱకు బాధ పడవలదు. కాలగతి ఈ విధముగా నున్నది. కాన నీవు సందేహింపక నన్ను చంపి నీ ప్రతిజ్ఞను పాలింపుము. ప్రతిజ్ఞను పాలింపని నరులు నరకమును పొందుదురు. నా మీద నీకు ప్రీతి యున్నచో నీకు అనుగ్రాహ్యుడ నైనచో అనుమానమును వదలి నన్ను చంపి ధర్మమును వృద్ధి చేయుము. అని తన త్యాగ భావమును ప్రకటించెను.

★★★

# భరతుడు

ఇతడు కైకేయి కుమారుడు. రామలక్ష్మణ భరత శత్రుఘ్నులలో రామునకు వయః క్రమమువనేగాక సుగుణాలలోను రెండవవాడు భరతుడు. ఇతడు మిక్కిలి నిర్మలమైన హృదయము గలవాడు. దశరథుని నలుగురు పుత్రులు పెద్ద చిన్న తారతమ్యమును బట్టి చిన్నవాడు పెద్దవారి ఎడల భక్తిని,పెద్దవారు చిన్నవారి ఎడల వాత్సల్యమును కలిగియుండిరి.కాని నిత్యసాహచర్యమును బట్టి రామలక్ష్మణులు ఒక జంటగను, భరతశత్రుఘ్నులు మరియొక జంటగను మసలు చుండిరి. కాని శ్రీరామచంద్రుని పట్ల భరత లక్ష్మణ శత్రుఘ్నులు ముప్పురును పితృసమానమగు భక్తిని చూపుచుండిరి.

భరతుని చారిత్రము నందు ముఖ్యముగ మూడు గుణములు మనకు గోచరించును. అతని పితృభక్తి, ధర్మనిష్ఠ, భ్రాతృభక్తి వీటిలో అతని ధర్మనిష్ఠ అనన్య సామాన్యము.

## పితృభక్తి

దశరథుని మరణానంతరము వశిష్ఠుని ఆదేశముపై కేకయ దేశమునందున్న భరతుని పిలుచుకొని వచ్చుటకై రాజ దూతలు కేకయ దేశమునకు వచ్చిరి. దూతలు ఏ రాత్రి అయితే రాజ గృహమునకు వచ్చిరో అదే రోజు రాత్రి భరతునికి ఒక దుఃస్వప్నము వచ్చెను.

అట్టి స్వప్నము వలన కలతచెందిన భరతుడు తనో ( లేక) రాముడో, దశరథుడో, లక్ష్మణుడో మరణించునని నిశ్చయించుకొని దీనాతి దీనుడై దుఃఖించెను. ముఖ్యముగా తన తండ్రిని స్వప్నంలో చూచి మిక్కిలి బాధపడెను. దీనిని బట్టి తన తండ్రికి ఏ మాత్రము దుఃఖము కలిగినను చూచి సహింపలేని వాడని తెలియుచున్నది. భరతుడు కేకయ రాజ్యము నుండి వచ్చి అయోధ్యలో ప్రవేశించి నేరుగా తండ్రి గృహమును ప్రవేశించుటను బట్టి భరతునికి తండ్రిపైగల భక్తి ఎలాంటిదో విదితమగుచున్నది. తరువాత దశరథుడు అచట లేడని తెలుసుకొని వెంటనే తల్లి భవనమునకు వెళ్లి 'అమ్మా !' నాతండ్రియైన దశరథమహారాజు మంచము శూన్యముగ నున్నది. అతనికి సన్నిహితులగు వారు కూడ సంతోషముగ లేరు. తరచు ఆయన నీయింటి యందే యుండును కదా! ఆయనను చూడగోరి యిచటకు రాగా ఆయన నాకు యిచ్చట కనిపించుటలేదు ఆయనకు పాదాభివందనము చేయవలెను. ఆయన ఎచట నున్నాడో తెలుపవలసినది.

**పితుర్గ్రహిష్యే చరణౌ తం మమాఖ్యాహి పృచ్ఛతః।**

**అహోస్విత్ అంబ జ్యేష్ఠాయాః కౌసల్యాయా నివేశనే॥ అయో.కా. 72-13.**

కౌసల్యా భవనము నందున్నచో ఆవిషయమును కూడ తెలుపుము. అనుటలో అతనికి తండ్రిపైగల భక్తి ప్రస్ఫుటముగ తెలియుచున్నది. తండ్రి మరణించినాడన్న వార్త తల్లియగు కైకద్వారా విని భరతుడు పొందిన దుఃఖము వర్ణనాతీతము.

అనంతరము భరతుడు తన తల్లితో తండ్రి మరణసమయమున నా తండ్రి ఏమైన నన్ను గూర్చి చెప్పి యున్నాడా! అని పలికి తండ్రి చెప్పిన చివరి మాటలను వినుటకై కుతూహలము చూపెను. అనంతరము భరతుడు పరిపరివిధముల వాపోయి తల్లితో తల్లీ! నా తండ్రికి సర్వ విధ ప్రాయశ్చిత్తము చేసి నీవు కలిగించిన అపకీర్తిని తొలగించి ఉత్తమ కీర్తిని వర్ధిల్లునట్లు చేసుకొనెదను.

ఈ విధముగా కేకయ రాజ్యము నుండి వచ్చినది మొదలుకొని తన తండ్రికి ఔర్ధ్వదైహిక కార్యములను నిర్వహించు నంత వరకు భరతుడు చూపిన పితృభక్తి ఎంతయో కొనియాడదగినది.

## భ్రాతృభక్తి

భరతుడు తన తల్లి ద్వారా దశరథుని మరణ వార్త విని ఎంతో దుఃఖము నొందెను. అటు తరువాత తండ్రితో సమానుడగు, తండ్రి తరువాత తండ్రియంతటి వాడగు రామునిపై దృష్టిని ప్రసరించెను.

**యోమే భ్రాతా పితా బంధుర్యస్య దాసోఽస్మి ధీమతః। అయో.కా. 72-32.**

భరతునకు రాముడు అన్న, తండ్రి, బంధువు. భరతుడే స్వయముగ రాముని గూర్చి యిట్లు పలికెను.

**పితా హి భవతి జ్యేష్ఠో ధర్మ మార్యస్య జానతః।**

**తస్య పాదౌ గ్రహిష్యామి సహీదానీం గతిర్మమ॥ అయో.కా. 72-33.**

ధర్మ మెరిగిన సుశీలునికి పెద్దన్న తండ్రియే గదా! నేను ఆయన పాదములు పట్టుకొందును. తండ్రిలేని నాకు రాముడే శరణ్యమని పలికెను. రాముడు సీతాలక్ష్మణులతో కలసి దండకారణ్యమునకు వెళ్లినాడన్న విషయమును తెలుసుకొని తన వంశము వారు దురాచారమునకు విముఖులు, సదాచారనిరతులు అను అంశమును దృష్టి యందుంచుకొని తన సోదరుని సదాచారమునకు ఏమైనా లోపము కలిగినదా అని భయపడి మరల తల్లితో ఇట్లు పలికెను.

**కచ్చిన్న బ్రాహ్మణ ధనం హృతం రామేణ కస్యచిత్ ।**

**కచ్చిన్నాఢ్యోదరిద్రో వా తేనా పాపో విహింసితః ॥** **అయో.కా.72-44.**

అమ్మా! రాముడు ఏ బ్రాహ్మణుని ధనమైనను అపహరించలేదు గదా! ఏ పాపము ఎరుగని ధనికునిగాని, దరిద్రునిగాని రాముడు పీడించలేదు గదా ! రాముడు పరభార్యలను కోరలేదు గదా! వేదాధ్యయనం చేసిన వానిని చంపలేదు కదా! అని సోదరుని పట్లగల విశేష అనురాగమును వ్యక్త పరిచెను. భరతుడు రాముని అడవులకు పంపడం ఎంత మాత్రము సహించలేదు.

**పుత్రశోక పరిద్యూనః పంచత్వ ముపసేదివాన్ ।**

**త్వయా త్విదానం ధర్మజ్ఞ రాజత్వ మవలంబ్యతామ్ ॥**

**త్వత్కృతే హి మయా సర్వ మిదమేవం మయాకృతమ్ ॥**

**అయో.కా. 73.51-52.**

కైకేయి భరతునితో కుమారా! రాజు పుత్రశోకంచే మరణించెను. నేను ఈ కార్యమంతయు నీకొరకే చేసితిని నీవిపుడు రాజువై భూమినంతయు పాలింపుము. నీతండ్రిని గూర్చి దుఃఖించకుము. ప్రస్తుతం ఈ రాజ్యమంతయు నీ అధీనమై యున్నది. కావున దీనికి పట్టాభిషిక్తుడవుకమ్ము అని పలికెను.

భరతుడు దశరథుడు మరణించినాడని సోదరులిరువురు సీతతో సహా అడవికి వెళ్లినారని మిక్కిలి దుఃఖించెను. ఒకవైపు పితృభక్తి మరోవైపు భ్రాతృభక్తి. పితృ నిధనము, భ్రాతృవివా సము ఈ రెండును అతనికి భరింపలేని దుఃఖమును కలుగ చేసెను. కోసల దేశమునకు రాజునయ్యేదనను విషయము తెలిసి కూడ ఎంతమాత్రము సంతోషము పొందలేదు. కారణము అతనికి శ్రీరాముని పైగల భక్తి భావమే. తండ్రితో సమానుడగు అన్నను దూరము చేసుకొన్నానే అని బాధపడుచు సోదరుడులేని తనకు రాజ్యముతో ఏమి ప్రయోజనము అని దుఃఖించినట్టి భ్రాతృభక్తి పరాయణుడు.

భరతుడు కేకయ దేశమునుండి వచ్చినాడన్న వృత్తాంతమును తెలుసుకొని కౌసల్య అతనిని ఆహ్వానించి నాయనా! --

**ఇదంతే రాజ్య కామస్య రాజ్యం ప్రాప్త మకంటకమ్।**

**సంప్రాప్తం బత కైకేయ్యా శీఘ్రం క్రూరేణ కర్మణా ॥** **అయో.కా. 75-11.**

నీవు రాజ్యమును కోరుచుంటివి గదా ! నీ తల్లి కైకేయి రాముని అడవికి పంపి నీ పట్టాభి షేకము జరుపుకొనునట్లు వరము కోరినది. క్రూరమగు ఈపనిచే త్వరగా నీకు రాజ్యము లభించినది . అని నిష్ఠుర వాక్యములు పలుకగా భరతుడు ఎంతో దుఃఖించి తనకట్టి ఉద్దేశ్యము ఏదియు లేదని రామునిపై తనకుగల భ్రాతృభక్తిని నిరూపించుకొనెను.

దశరథునికి ఔర్ధ్వదైహిక క్రియలు నిర్వహించిన పిమ్మట రాజ్యాభిషేకమునకు నియమించిన వారెల్లరు వచ్చి భరతునితో యిట్లనిరి. రాజపుత్రా! నీవిపుడుమాకు రాజువు కావలసింది. వంశపరంపరాగతమైన ఈరాజ్యమును చేపట్టి మమ్ము పాలింపవలసినదని కోరగా, అచంచల భ్రాతృభక్తి కలిగిన భరతుడు అభిషేకమునకై తేబడిన శుభవస్తు సముదాయమునకు ప్రదక్షిణచేసి వారితో యిట్లు పలికెను.

**జ్యేష్ఠస్య రాజతానిత్య ముచితాహి కులస్యనః ।**
**నైవం భవన్తో మాం వక్తు మర్హంతి కుశలా జనా ॥**
**రామఃపూర్వోహి నోభ్రాతా భవిష్యతి మహీపతిః ।**
**అహంత్వరణ్యేవ త్స్యామి వర్షాణినవ పంచ చ ॥**
**యుజ్యతాం మహతీసేనా చతురంగ మహాబలాః ।**
**ఆనయిష్యామ్యహం జ్యేష్ఠభ్రాతరం రాఘవం వనాత్ ॥**

**అయో.కా.79.7-9.**

ఆర్యులారా! మీరు మిక్కిలి బుద్ధికుశలురు. జ్యేష్ఠుడే రాజు కావలయును. అనునది మా వంశోచితమని మీకు తెలియును. మీరే నన్ను యిట్లు రాజువు కమ్మనుట తగదు. అని రాజ్యముపై ఏమాత్రము మమకారమును చూపలేదు. ఏనాటికైనను మాఅన్న రాముడే మహారాజు కాగలడు. అతనికి మారుగా నేను పదునాలుగు సంవత్సరములు అడివిలో నివసింతును. చంతురంగ బలములతోకూడి రాముని అడవినుండి యిటకు తీసికొని వచ్చెదను.

**అభిషేచనికం చైవ సర్వమేత దుపస్కృతమ్ ।**
**పురస్కృత్యగమిష్యామి రామహేతో వనం ప్రతి ॥**
**తత్రైవం తం నరవ్యాఘ్ర మభిషిచ్య పురస్కృతమ్ ।**
**ఆనేష్యామి తువైరామం హవ్యవాహ మివా ధ్వరాత్ ॥**

**అయో.కా. 79.10-11.**

అభిషేకము కొరకు మీరు తీసికొనివచ్చిన ఈ ఉపకరణము లన్నింటిని తీసికొని రామాభిషేకమునకై అడవికి వెళ్లెదను అని చెప్పెను. ఆ అడవిలోనే రామునికి పట్టాభిషేకంచేసి యజ్ఞము నుండి అగ్నినివలె రాముని అయోధ్యకు కొనివచ్చెదనని పలికెను.

ఈమాటలను బట్టి చూచినచో భరతుని యొక్క భ్రాతృ భక్తి, భ్రాతృ ప్రేమ మహోన్నత మైనదని, అనితరసాధ్యమైనదని, దేశము నందలి సోదరలందరూ అనుకరించ దగినదని, మహా ఆదర్శప్రాయమైనట్టిదని తెలియుచున్నది.

భరతుడు శృంగిబేర పురమును చేరుకొని గుహుని ఆతిథ్యమును స్వీకరించి రామాదులు యిచట ఏమి ఆహారము తీసికొనిరి, ఎచట శయనించిరి అని గుహునిప్రశ్నించెను. గుహుడు భరతునకు యిట్లు చెప్పెను. వారు సేవించిన విషయము వారు సేవించిన పదార్థములను తెలియజేసెను. తన మూలముగ రాముడు ఎన్నో యిబ్బందులు పడుచున్నాడని తెలుసుకొని దుఃఖించెను. దుఃఖించడమేగాక ఒక స్థిర నిశ్చయమునకు వచ్చెను.

**అద్యప్రభృతి భూమౌతు శయిష్యేహం తృణేషువా ।**
**ఫలమూలాశనో నిత్యం జటాచీరాణి దారయన్ ॥**
**తస్యార్థముత్తరం కాలం నివత్స్యామి సుఖం వనే ॥**
**తం ప్రతి శ్రవ మావముచ్య నాశ్యమిథ్యా భవిష్యతి ॥ అయో.కా.88.26-27.**

నేను యిటుపై పండ్లు, దుంపలు, తినుచు, జడలు నారబట్టలు ధరించి, నేలపై లేదా గడ్డిపైశయనించెదను. రాముడిప్పటి వరకు అనుభవించిన వనవాసకాలము గడువగ తక్కిన సమయము రామునికి బదులుగ అడవిలో నివసించెదను. అన్నను తాను చేసిన ప్రతిజ్ఞనుండి విడిపింతును. నేనట్లు చేయుట వలన ఆయన ప్రతిజ్ఞ అసత్యము కానేరదు అని నిశ్చయించుకొనెను.

భరతుడు చిత్రకూట పర్వతమును చేరుకొనుట తోడనే రాముడు రాజు కనుక అతనివద్దకు వినయముగా పోవలయునను ధర్మమును పురస్కరించుకొని తన సైన్యమును అచ్చటనే నిలిపి పాదచారియై పోవతలంచెను. రాముడు రాజు కాకపోయినప్పటికీ పరంపరాగతమైన జ్యేష్ఠుడే రాజు కావలయును అను నియమమును పాటించి లోకోత్కృష్టుడయ్యెను.

**గుహో జ్ఞాతి సహస్రేణ శరచాపాసి ధారిణా ।**
**సమన్వేషతు కాకుత్స్థౌ వస్మిన్పరివృత స్స్వయమ్ ॥**
**అమాత్యై స్సహపౌరైశ్చ గురుభిశ్చ ద్విజాతిభిః ।**
**వనంసర్వం చరిష్యామి పద్భ్యాం పరివృత స్స్వయమ్ ॥**
**యావన్నరామం ద్రక్ష్యామి లక్ష్మణం వా మహాబలమ్ ।**
**వైదేహీం చ మహాభాగాం నమే శాంతిర్భవిష్యతి ॥ అయో.కా. 98.4-66.**

గుహుడు ధనుర్బాణములు తాల్చిన తన బంధువులు వేయి మందితో ఈ చిత్రకూట పర్వతము చుట్టును స్వయముగ రామలక్ష్మణులను వెదకును.

మంత్రులతోను, పౌరులతోను, గురువులతోను, బ్రాహ్మణులతోను కూడి పాదచారియై స్వయముగ ఈ అడవియందు రాముని వెదకుటకు సంచరింతునని భరతుడు

పలికెను. రామునిగాని మహాబలుడగు లక్ష్మణునిగాని గొప్ప అదృష్టవతియగు సీతనుగాని చూడనంతవరకు నాకు శాంతిలేదు.

**యావన్నరాజ్యే రాజ్యార్హః పితృపైతా మహేస్థితః ।**
**అభిషేక జలక్లిన్నో నమే శాంతి ర్భవిష్యతి ॥** **అయో.కా. 98-9.**

రాజార్హుడగు నాఅన్న తండ్రి తాతల నుండి సంక్రమించిన ప్రజాపరిపాలనా ధికారమున నిలచి పట్టాభిషేక జలములచే తడసిన వాడు కాడో, అప్పటివరకు నాకు శాంతి ఏర్పడదు. ఈ ప్రకారము స్థిర నిశ్చయము కలిగిన నిష్కల్మషమైన భ్రాతృభక్తికి ప్రతీకయై, లోకమునకు ఉత్తమ ఆదర్శప్రాయుడైన సోదరునిగా చరిత్ర పుటలలో నిలిచి పోయినాడు.

భరతుడు చిత్రకూట పర్వతమును చేరుకొని రామాశ్రమమును గాంచి రాముడు తన మూలముగ పడుచున్న కష్టములను తలుచుకొనుచు--

**జగత్యాం పురుషవ్యాఘ్ర ! ఆస్తే వీరాసనేరతః ।**
**జనేంద్రో నిర్జనం ప్రాప్యదిఙ్మే జన్మస జీవితమ్ ॥** **అయో.కా. 99-15.**
**ఇతిలోక సమాకృష్టః పాదేష్వద్య ప్రసాదయన్ ।**
**రామస్య నిపతిష్యామి సీతాయా లక్ష్మణస్యచ ॥** **అయో.కా. 99-17.**

నా మూలముగ నిర్జనమగు అరణ్యమునందు కష్టములను అనుభవించుచున్నాడు. దీనికి కారణం నేనే. నా జన్మ నిరర్థకమైనదని వాపోయెను. ఇప్పుడతని పాదములపైనను, సీతాదేవి పాదములపైనను, లక్ష్మణుని పాదములపైననుపడి ప్రసన్నుని గావించుకొనెదను.

రాముని అయోధ్యా సింహాసనముపైన కూర్చొండబెట్టునంతవరకు విశ్రమించనని ప్రతిన బూనెను. కాని శ్రీరాముడు పితృవాక్యపాలన నిమిత్తమై అయోధ్యకు తిరిగి వచ్చుటకు సమ్మతించలేదు.

**సపాదుకే సంప్రణమ్య రామం వచన మబ్రవీత్ ।**
**చతుర్దశహి వర్షాణి జటా చీరధరో హ్యహమ్ ॥**
**ఫలమూలాశనో వీర! భవేయం రఘునందన ।**
**తవాగమన మాకాంక్షన్ వసన్ వై నగరా ద్బహిః ॥**
**తవ పాదుకయోర్న్యస్త రాజ్యతంత్రః పరం తప ।**
**చతుర్ద శేహి సంపూర్ణే వర్షేహని రఘూత్తమ ।**
**నద్రక్ష్యామి యదిత్వాంతు ప్రవేక్ష్యామి హుతాశనమ్ ॥** **అయో.కా. 114.23-25.**

రాముడట్లు తిరస్కరించుటతో భరతుడు అన్నపాదములపైబడి మాటిమాటికి రాజ్యము స్వీకరించమని ప్రార్థించెను. విధిలేని పరిస్థితులలో రాముని పాదుకలు తీసికొని

రామునితో యిట్లు పలికెను. వీరుడగు రాఘవా! పదునాలుగు సంవత్సరములు జడలు నార వస్త్రములు దాల్చి ఫలములు దుంపలు తినుచు నీరాకకెదురు చూచుచు నగరముబయట నివసించుచు నీపాదుకలపైననే రాగతంత్రముల నుంచెదను. పదునాల్గు సంవత్సరములు పూర్తి అయినవెంటనే నిన్ను చూడనిచో నేను అగ్ని ప్రవేశము నొనర్తును. అను కఠోర ప్రతిజ్ఞను చేపట్టి లోకోత్తరమగు తమ్మునిగా భరతుడు ముద్రపడుట వలన అనుజ లోకమునకు దివ్యమగు ఆదర్శప్రాయమని తెలియుచున్నది.

## ఋజుత్వము

కేకయ దేశమునుండి వచ్చిన భరతుని రాజ్యాధికారము చేపట్టమని వసిష్ఠుడు కౌసల్యాదులు చెప్పగా అతడు మిక్కిలి దుఃఖించి రాజ్యాధికారములను తిరస్కరించెను. మరియు యిట్టి కార్యమునకు కారణభూతురాలైన తన తల్లిని నానా దుర్భాషలాడెను. తరువాత రాముని తీసుకొని వత్తునని సైన్యాదులతో కూడిన వాడై అడవికి బయలుదేరెను. మార్గమధ్యమున నిషాద రాజగు గుహుడు ససైన్యముగ భరతుడు వచ్చుటను గాంచి రామునిపై దండయాత్రకు వెడలుచున్నాడని నిశ్చయించుకొనెను. సుమంతుని ద్వారా భరతుని విషయముతెలుసుకొన్నప్పటికి గుహుడు భరతుని అంతర్యమును కనుగొనుటకై భరతునితో యిట్లు పలికెను.

**కచ్చిన్న దుష్టో వ్రజసి రామస్యా క్లిష్టకర్మణః ।**
**ఇయంతే మహతీసేనా శంకాం జనయతీవమే ॥** అయో.కా.85-7.
**తం నిర్వర్తయితుం యామి కాకుత్స్థం వనవాసినమ్ ।**
**బుద్ధి రన్యానతే కార్యా గుహః సత్యం బ్రవీమి తే ॥** అయో.కా. 85-10.

రాజపుత్రా! ఎవరికినీ కష్టము కలిగించని రాముని విషయమున ఎలాంటి దుష్టభావము లేకయే పోవుచుంటివా! నీ ఈ పెద్ద సైన్యము నాకు పెద్ద సందేహమును కలిగించుచున్నది. గుహుని భావమును గ్రహించిన భరతుడు ఏ మాత్రము కోపము వహింపక నీవు నన్ను శంకింప వలదు. రాముడు నా జ్యేష్ఠ భ్రాత తండ్రితో సమానుడు. రాముని అయోధ్యకు తీసుకొని పోవుటకే వచ్చినాము. నీవు వేరుగ ఆలోచింపకుము. నీకు నేను సత్యమునే చెప్పుచున్నాను. అనిపలికెను.

మరొకసారి భరద్వాజుడు భరతునితో రాజకుమారా! ఏ మహాకీర్తి సంపన్నుడు తన సవతి తల్లి కైకేయిచే ప్రేరితుడైన తండ్రిచే పదునాలుగు సంవత్సరములు అడవిలో నివసింపుమని పంపబడెనో, అట్టి పాపరహితుడగు రాముని విషయమునను, తమ్ముడగు లక్ష్మణుని విషయమునను మీ రాజ్యము శత్రురహితము కావలయునన్న తలంపుతో వారిని చంపుటకు నీవు యిష్టపడుట లేదుగదా అనిపలికెను. కఠోరమైన మాటలను విని భరతుడు కన్నీరు కార్చుచు దుఃఖముతో మాటలు తడబడగా యిట్లు బదులు పలికెను.

**న చైవ దిష్టం మాతా మే యదవో చ న్మ దంతరే ।**

**నా హమే తేన తుష్టశ్చనతద్వచన మాదధే ॥**

**అహంతు తం నరవ్యాఘ్రముపయాతః ప్రసాదతః ।**

**ప్రతినేతు మయోధ్యాం చ పాదౌ తస్యాభి వందితుమ్ ॥ అయో.కా.90.16-17.**

స్వామీ! నేను సమీపమున లేనపుడు నాతల్లి పలికిన పలుకులు అంగీకార యోగ్యములు కావు. నా తల్లి కోరిన వరములచే నేను సంతోషపడుట లేదు. ఆమె మాటలను లెక్కపెట్టుట లేదు. నేను రాముని ప్రసన్నుని చేసుకొని అయోధ్యకు తీసికొని పోవుటకును, ఆయన పాదములకు నమస్కరించుటకు వచ్చితినేగాని వేరొక భావమేమియు లేదు. అని తెలిసి ఋజుత్వమును ప్రమాణపూర్వకముగ తెలుపుకొనెను. ఈ ప్రకారముగ ఎన్నెన్నో వడిదుడుకులకు తట్టుకొని ఎందరెందరో శంకించగా వారిపై కోపించక వినయ విధేయలతో ఇతరులకు తన ఎడలగల దుష్టభావములను తొలగించుకొన్న ధీశాలి. అట్టి మహాత్ముని ఋజువర్తనమనెడి ఈ గుణము అనుజలోకమున కెల్లా ఆదర్శప్రాయమైనదనుటలో లేశమాత్రమైనను సందేహము లేదు.

## ధర్మపథ నిర్వహణ

భరతుడు అయోధ్యకు వచ్చి తల్లి ద్వారా మహారాజగు దశరథుడు మరణించినాడన్న వార్త విని మిక్కిలి శోక పూరితుడాయెను.

**ఉత్తిష్ఠోత్తిష్ఠ కింశేషే రాజన్న త్ర మహాయశః ।**

**త్వ ద్విధా నహి శోచంతి సంత స్సదసి సమ్మతాః ॥ అయో.కా.72-24.**

దు:ఖములో ఉన్న కుమారుని దు:ఖము పోగొట్టవలెనని గొప్ప కీర్తి గలరాజా! లెమ్ము. ఇంకా నేలపైబడి యుండుట ఏల. మాన్యులగు మీవంటి సజ్జనలు ఎంత మాత్రము దు:ఖింప వలదు. కావున స్థిరముగా నుండుము. అని ఒదార్చెను. అటు తరువాత భరతుడు రాముడు ఏకారణముగా అడవికి వెళ్లినాడో తెలుపవలసినదిగా అడిగెను.

**మయాతు పుత్రశ్రుత్వైవ రామస్యైవాభిషేచకమ్ ।**

**యాచి తస్తే పితా రాజ్యం రామస్య చ వివాసనమ్ ॥ అయో.కా.72.49.**

**మృత్యు మాసాదితో రాజా త్వయామే పాప దర్శిని ।**

**సుఖంపరి హృతం మోహాత్కు లేస్మిన్ కులపాంసని ॥ అయో.కా.73.5.**

అప్పుడు ఆమె దశరథుడు యివ్వవలసిన రెండు వరములలో మొదటి వరము నీకు రాజ్యము కావలయునని, రెండవ వరము రాముడు అడవులకు వెళ్ళవలయునని కోరితిని-- అని చెప్పెను. అందువలన రాముడు అడవికి వెళ్లినాడని తెలియజేసెను. ఆ సమయమున భరతుడు తల్లియగు కైకతో-- పాపిష్ఠురాలా! నీ వలననే రాజు మరణించినాడు. వంశము చెఱచుదానా! అజ్ఞానముతో నీవీ వంశములో సుఖము లేకుండా

చేసితివి. ఈ వంశమున జ్యేష్ఠుడే రాజ్యాభిషిక్తుడగుచున్నాడు. నీవు రాజ ధర్మమును తెలుసుకొని ఆచరించుట లేదని భావించుచున్నాను. సనాతనమగు రాజ వృత్తాంత మెట్టిదో నీవెరుగవని భావించుచున్నాను. జ్యేష్ఠుడే ఎల్లప్పుడు రాజ సంప్రదాయానుసారము పట్టాభిషిక్తుడగు చున్నాడు. రాజులకెల్లరకు ఈ ధర్మము సమానము, విశేషించి ఇక్ష్వాకు రాజులలో ఈధర్మమునకు అధిక ఆదరమున్నదని తల్లిని నిందించి ఆమె చేసిన అపరాధమునకు నిష్ఠురములగు వాక్యములు పలికెను.

ఇచ్చట కైకేయి భరతుని సొంత తల్లి. భరతుని శ్రేయస్సు కోరియే తనకు రావలసిన రెండు వరములలో భరతునికి పట్టాభిషేకము చేయమని వరముగా కోరినది. అయినప్పటికి తనకు రాగల యోగమును ఏమాత్రము లెక్క పెట్టక సంప్రదాయమును ఉల్లంఘించుటకు యిష్టపడక పైపెచ్చు అధర్మ కార్యమును చేసినందుకు తల్లినే ఎదిరించినట్టి ఆదర్శ పురుషుడు లోకమున యిట్టి వారుండుట అరుదు. యిచట తల్లి తప్పు చేసినదని, అధర్మ మార్గమున చివరకు సొంత తల్లి పయనించినను ఎదిరించవలసిన ఆవశ్యకత ఎంతో యున్నది. అను ఉత్కృష్ట ఆశయము మానవాళి కెల్లరకును ఆదర్శప్రాయమైనది.

దశరథుని అంత్యక్రియలైన తర్వాత పదునాల్గవ రోజున రాజ్యాభిషేకము చేయించుటకు నియమితులైన వారెల్లరు కలసివచ్చి భరతునితో రాజపుత్రా! నీవిపుడు మాకు రాజువు కావలసినది. ఈ రాజ్యమును స్వీకరించుము. పట్టాభిషిక్తుడవై మమ్ములను పాలింపుము అని చెప్పినను వారి మాట గ్రహింప దగినదైనను మా వంశమున జ్యేష్ఠుడు రాజగుట ఉచితమని తెలిపి మృదువుగ తిరస్కరించెను. వారందరు బుద్ధి మంతులైనప్పటికి వారిని వారి మాటకు ఎదురు చెప్పెను.

మరియొకసారి పండితజనముతో కూడుకొనియున్న నిండుసభలో వశిష్ఠుడు సభలోని ప్రజలందరిని ఒక్కమారు చూచి భరతునితో యిట్లుపలికెను. నాయనా! సత్యపరిపాలనమను ధర్మము నాచరించుచు నీతండ్రి దశరథమహారాజు ఈభూమిని నీకిచ్చి స్వర్గస్థుడైనాడు. కాన ఈ రాజ్యమును అనుభవించుము. మంత్రులను ప్రసన్నులను నొలరించుచు శ్రీఘ్రమే పట్టాభిషిక్తుడవగుము అని పలికెను. ధర్మాత్ములైన వశిష్ఠుడు ఉపదేశించడము భరతునకు సంతోషము కలిగించలేదు. వశిష్ఠుడు కులగురువు. తానును వశిష్ఠుని వద్దనే విద్యనభ్యసించినాడు. ఇక్ష్వాకు వంశజులందరికీ వశిష్ఠుని మాట శిరోధార్యము. అయినప్పటికి వశిష్ఠునిఉపదేశము అధర్మమని తలచి అహితముతో కూడుకొన్నట్టి గురువు వాక్యమును నిరాదరించి నిందించినాడు.

అనగ తల్లియైనను ,గురువైనను వారెంత వారైన ప్పటకిని నిలదీసి ప్రశ్నించగల భరతుని ఈగుణము ధర్మాచరణ శీలురైన వారందరికిని ఆదర్శప్రాయము. ★★★

# శత్రుఘ్నుడు

ఇతడు సుమిత్ర రెండవ కుమారుడు, రామ లక్ష్మణ భరతుల కన్నా చిన్నవాడు. రాముడు విష్ణుఅంశము కావున, ఆదిశేషుడైన లక్ష్మణుడు ఎల్లప్పుడు ఆయునను అనుసరించు చుండెడివాడు. లక్ష్మణుడు, శత్రుఘ్నుడు ఏకోదరులైనప్పటికి చక్రాయుదాంశచే జనించిన వాడు శత్రుఘ్నుడు. భరతుడు శంఖ అంశముచే జన్మించిన వాడు. శంఖ చక్రములు ఆయుధములు కాబట్టి అవిరెండు ఒకే చోట నుండును. కనుక వాటి రూపాంతరములైన భరత శత్రుఘ్నులు కలిసి జంటగ మెలగటం రామాయణంలో మనకు కనిపిస్తున్నది. వాల్మీకి శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నః అని శత్రుఘ్నుడు అంతరి శత్రువులను జయించినవాడుగ వర్ణించినాడు. దీనినిబట్టి ఇతడు మహా పరాక్రమశాలి అని తెలియుచున్నది.

రామలక్ష్మణ భరతులన్న ఇతనికి విశేషమైన ప్రీతి. భరతుడు తన మేనమామ యుధాజిత్తు కోరికపై కేకయ దేశమునకు బయలు దేరునప్పుడు శత్రుఘ్నుని కూడ వెంటబెట్టుకొని పోయెను. శత్రుఘ్నుడు తాను తమ్ముడు కావున అన్న ఆజ్ఞపాటింప వలయునని ఆజ్ఞాపరతంత్రుడైగాక తన అన్నపైగల ప్రీతిచే [illegible] అతనిని అనుసరించెను.

## పితృ భక్తి

ఇక్ష్వాకు వంశములోని వారందరు చక్కటి పితృ భక్తి గలవారు. రాముని అడవికి పంపించుటకు కైకేయి కారణమని తెలిసినను సహజముగ క్షణకాలము దశరథుని పైకోపము ప్రదర్శించినప్పటికి వారి పితృభక్తి విషయములో ఏమాత్రము అనుమానించుటకు అవకాశము లేదు .

క్షితిపైబడ్డ తండ్రి దేహము బుడిద కాగా సహించలేని శత్రుఘ్నుడు తెలివి తప్పి నేలపై బడెను. తమకు అవసరమగు సహాయములందు యిష్టములగు వస్తువులనిచ్చి లాలించిన తమ తండ్రియొక్క చేతులుమున్నగు అవయవములు భస్మమగుటను గాంచి మిక్కిలి బాధపడెను.

> నను భోజ్యేషు పానేషు వస్త్రేష్వా భరణేషు చ ।
> ప్రవార యసి న సర్వాం స్తన్నః కోఽన్యః కరిష్యతి ॥ అయో. కా. 77.15.

భోజ్య పదార్థములు పానీయములు, వస్త్రములు ఆభరణములు మున్నగు వాటిలో మాకు ఏది ఇష్టమో వాటిని మాకు యిచ్చి మమ్ము లాలించు

చుండెను. యిప్పుడెవరు మాకిట్లు అందజేతురు. అని భరతునితో పాటు శత్రుఘ్నుడు కూడ విలపించెను. ఈ విధముగ శత్రుఘ్నుని పితృభక్తి ప్రశంసనీయమ్మైనది.

## భ్రాతృభక్తి

తండ్రికి ఉత్తర క్రియలు పూర్తిగావించిన పిమ్మట శ్రీరాముడు అడవికి వెళ్ళిన విషయమును శత్రుఘ్నుడు తెలుసుకొని ఎంతో పరితపించెను. అనంతరము భరతుని తోపాటు రాముని అన్వేషించుటకు వెళ్ళిన శత్రుఘ్నుడు చిత్రకూట పర్వతము నందున్నట్టి శ్రీరాముని సమీపించి నార చీరలు ధరించినట్టి ఆయన దుస్థితిని చూచి సహింపజాలక శ్రీరాముడు అడవికి వెళ్ళుటకు కారణము కైకేయి కదా! మిక్కిలి రోదించుచు ఆయన పాదములకు ప్రణమిల్లెను.

**పూర్వమేవతు నిగ్రాహ్య స్సమవేక్ష్యనయానయా ।**
**ఉత్పథం యస్సమారూఢో రాజా నార్యావశంగతః ॥ అయో.కా. 79.4.**

శ్రీరాముడు అడవికి వెళ్ళుటకు కారణము కైకేయి కదా! స్త్రీకి వశులై అడ్డుపడినపుడు న్యాయాన్యాయములు పరశీలించి లక్ష్మణుడు తండ్రినేల దండించలేదు. అనిపలుకుచుండగ మంథర సకల ఆభరణములను దాల్చి తూర్పువాకిలి వద్దకు వచ్చెను. శరీరమునకు చందనము పూసికొని రాజ వస్త్రములను ధరించి అనేక ఆభరణములను వివిధ రీతులలో ధరించిన కుబ్జను ద్వారపాలకులు పట్టితెచ్చి శత్రుఘ్నునితో యిట్లు చెప్పిరి.

**యస్యాః కృతే వనేరామో న్యస్త దేహశ్చ వః పితా ।**
**సేయం పాపా నృశం సా చ తస్యాః కురు యథా మతిః ॥ అయో.కా. 78.9.**

ఎవతె కారణముగా రాముడు అడవికేగెనో, మీతండ్రియు మరణించెనో అట్టి పాపవతి, క్రూరాత్మురాలగు ఈమెకు తగిన దండన విధించుము అని పలికిరి. ఆమాటలు విని తమ కుటుంబమునకు అంతయు హాని కలిగించినట్టి ఆమెను గట్టిగా పట్టుకొని రోషముచే కన్నులు ఎర్రబడగా ఆ కుబ్జను భూమిపై పడవైచి ఈడ్చెను.

**తాం ప్రేక్ష్య భరతః క్రుద్ధం శత్రుఘ్నమిద మబ్రవీత్ ।**
**అవధ్యా సర్వభూతానాం ప్రమదాః క్షమ్యతామితి ॥ అయో.కా. 78.21.**

కైకేయి అభ్యర్థన మేరకు భరతుడు శత్రుఘ్నునితో స్త్రీలను ఎవ్వరు చంపరాదు. కాన ఆమెను క్షమించుము అని నివారించెను. భరతుని పై నున్నట్టి భ్రాతృగౌరవముచే ఆ కుబ్జను వదలిపెట్టెను. ఈ విధమైన భ్రాతృభక్తివలన ఇతని పాత్ర యితరులకు ఆదర్శవంతముగ నున్నది.

★★★

# సుమంత్రుడు

**దృష్టిర్జయంతో విజయః సిద్ధార్థో హ్యర్థసాధకః ।**
**అశోకో మంత్రపాలశ్చ సుమంత్ర శ్చాష్టమోఽభవత్ ॥ బా. కా. 7.3.**

దశరథ మహా రాజుకు ఎనిమిది మంది మంత్రులుండిరి. వారు వరుసగా దృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంత్రుడు. ఈ ఎనిమిది మందాయేగాక సుయజ్ఞుడు,వామదేవుడు, జాబాలి కాశ్యపుడు వశిష్ఠుడు గూడ దశరథునికి మంత్రులతో సమానము. యింతమంది మంత్రులు పురోహితులు ఉన్నప్పటికి సుమంత్రునకు ఎక్కువ ప్రాముఖ్యత ఉండెడిది. ఎనిమిది మంది మంత్రులలో సుమంత్రుని స్థానము ఎనిమిదవది. అనగ అందరి మంత్రుల తరువాత సుమంత్రుడు మంత్రిగ నియమింపబడినాడని తెలియుచున్నది. సుమంత్రుడు దశరథునికి మంత్రియేగాక రథమునడిపెడిసారథికూడా. సుమంత్రుడు అయోధ్యాపట్టణములో అంతఃపురమునకు చెందిన ముఖ్యులగు వారి యిండ్లకు వెళ్ళునపుడు ద్వారపాలకులెవ్వరు అతనిని అడ్డగించెడివారుకారు. అనగ ఎవరి యింటికి వెళ్లినను ఇతనికి అడ్డుచెప్పెడి వారు లేరని అర్థమగు చున్నది. సాక్షాత్తు దశరథ మహారాజే సుమంత్రుని రాక కు ఎవరు అడ్డుచెప్పవలదని పలికి యున్నాడు. సుమంత్రుని యొక్క కార్యకరణకౌశలము ముఖ్యాతిముఖ్యమైన గుణము. అట్టి గుణము వలననే సుమంత్రునకు రఘువంశపురాజుల ఎదుట ఎంతోగౌరవం లభించెను. సుమంత్రునకు ఏకార్యము నప్పగించినప్పటికీ వెంటనే అవలీలగా చేసెడివాడు. దశరథ మహారాజు అశ్వమేధ యాగము చేయవలెనని సంకల్పించి సుమంత్రునితో- సుమంత్రా! ప్రసిద్ధులగు మా గురువులను, పురోహితులను తోడ్కొని రండు అనిపలికెను. అంత సుమంత్రుడు చాలా వేగముగా నడుచుకొని పోయి వేదవిదులగు పురోహితులతో కూడిన దశరథ గురువుల నందరినీ అచ్చటకు తీసికొనివచ్చెను. సుమంత్రుని ప్రబోధ వలన దశరథ మహారాజు ఋష్యశృంగుని ఋత్విజునిగా నియమించెను. వశిష్ఠుడు కూడా సుమంత్రుని కార్యకరణకౌశలమును చక్కగ నెఱిగినట్టివాడు. అందువలననే యజ్ఞమునకు కావలసిన పనులన్నియు పూర్తియైనపిమ్మట వశిష్ఠుడు సుమంత్రుని రప్పించి ఆర్యా! ఈభూమండలమునగల ధర్మాత్ములగు రాజులందరినీ యాగమునకు ఆహ్వానించమని పలికి మిథిలానగర రాజగు జనకుని, కాశీమహారాజును, కేకయరాజును, అంగ దేశాధిపతియగు రోమపాదుని స్వయముగ వెళ్లి

విషయములను తెలుసుకొనుటకై ప్రయత్నించడము, శత్రువుకన్నా ముందుగనే మేల్కొనడము మొదలగు విషయములలో దూరదృష్టితో చేసిన పనులుగనే అనిపించుచున్నది. అనగ ముందు జాగ్రత్తగలవాడని తెలియుచున్నది. దూరదృష్టితో ముందు జాగ్రత్త కలిగి ఉండడము అను ఈ గుణము సేవకులకును సామంత రాజులకును ఆదర్శప్రాయమైనది.

## స్వామి భక్తి

గుహుడు గంగానదీ తీరమున రాముని కలుసుకొనెను. తన ప్రభువుకు అట్టికష్టపరిస్థితి రావడము భరించలేక పోయెను. శ్రీరాముని చూచి--

**యథాఽయోధ్యా తథే యంతే రామ కిం కరవాణితే ।**
**ఈదృశం హి మహాబాహో కః ప్రాప్య తిథిం ప్రియమ్ ॥**
**స్వాగతం తే మహాబాహో తవేయ మఖిలామహ ।**
**వయం ప్రేష్యా భవాన్మర్తా సాధురాజ్యం ప్రశాధినః ॥**

**అయో.కా. 50-36,38.**

రామా! నీకు అయోధ్య ఎట్లో అట్లే నా ఈ దేశమును భావించవలయును. నీకేమి సహాయము చేయగలను. నీవంటి ప్రియ అతిథి ఎవరికి లభించును. స్వామీ! మీకు స్వాగతము ఈ భూమండలము అంతా మీదే. మేము పాలితులము. నీవు మా పాలకుడవు. మమ్ము చక్కగా పాలింపుము. అని రాముని వద్దకు వచ్చి ఆహ్వానించి స్నేహ భావమును ప్రదర్శించెను.

భరతుడు శృంగిబేరపురమునకు వచ్చినపుడు భరతుని సైన్యమును గాంచి ముందుగా శంకించినప్పటికీ భరతుడు అయోధ్యా పట్టణమునకు రాజుఅని, శ్రీరామునికి ప్రాణములకంటే మిక్కిలి ప్రియుడని భరతుని చూడవలయునని నిశ్చయించెను. భరతునిచే అనుమతింపబడిన గుహుడు బంధువులతో గూడి ఆనందముగ భరతునివద్దకు వెళ్ళి నమస్కరించి--

**నిష్కుటశ్చైవ దేశోఽయం వంచితాశ్చాపి తేవయం ।**
**నివేదయామ స్తే సర్వే స్వకే దాసకులే వస ॥** **అయో.కా.84-16.**

రాజా! నా ఈ దేశమంతయు నీయింటి పెరటి తోటగ తలంపుము. నీరాక ముందు తెలియక వంచితులమైతిమి. నీదాసులయిల్లని భావించి ఇచట నుండవలసినదని ప్రార్థించెను. శ్రీరామచంద్రునికై భరతుడు బాధపడటం చూచి అంతకంటే మిక్కిలి మనోవ్యథను పొందెను. ఈ ప్రకారము గుహుడు శ్రీరాముని ఎడల భరతుని ఎడల

ఎనలేని స్వామి భక్తిని ప్రకటించిన ఆటవిక ప్రభువు. అడవియందు నివసించి నప్పటికీ స్వామి భక్తిలో గుహునికి సాటివచ్చువారు ఎవరును లేరని పై అంశముల వలన తెలియుచున్నది. మరియు గుహుడు, శ్రీరామాదులు తమ దేశమునకు వచ్చినప్పుడు వారివారికి తగిన అతిథి సత్కారములు చేసెను. మరియు వారితో విచ్చేసిన సైన్యమునకు గుఱ్ఱములకు కావలసిన భోజన, దాణాది సదుపాయములను కలుగచేసి ఇక్ష్వాకు వంశప్రభువులపై తనకుగల గౌరవమును చాటుకొనెను.



# కౌసల్య

కౌసల్య దశరథ మహారాజు యొక్క జ్యేష్ఠభార్య. పట్టపురాణి .ఈమె కోసలరాజు పుత్రిక.

**కౌసల్యా బిభృయాదార్య సహస్రం మద్విధాన పి ।**
**యస్యాః సహస్రం గ్రామాణాం సంప్రాప్త ముపజీవినామ్ ॥**

**అయో.కా. 31-22.**

కోసల మహారాజు అత్తగారింటికి పంపిస్తూ ఆమెకు వేయి గ్రామములను పెక్కుమంది దాసదాసీజనులను అరణముగ యిచ్చెను. ఈమె ఉదార స్వభామికలది. వాత్సల్యముతో నిండిన మాతృహృదయముగల ఉత్తమ యిల్లాలు. సహృదయురాలు. దయ, మమత, కరుణ మొదలగు మానవతా లక్షణములు గలది. మరియు పతి భక్తి పరాయణురాలు. వ్రతోపవాసనిరత, కష్టసహిష్ణువు. ఆమె తనకు వచ్చు ఆదాయముతో తన వారినేగాక ఇతరులను కూడ పోషింపగల ఆర్థికస్తోమత కలది.

**ఇదంతు దుఃఖం యదనర్థ కాని మే వ్రతాని దానానిచ సంయమాశ్చహి।**
**తపశ్చ తప్తయదపత్య కామ్యయా సునిష్ఫలం బీజమివోప్త మూషరే ॥**

**అయో.కా.20.42.**

ఈమె సంతానప్రాప్తికై అనేక వ్రత,దాన,ఉపవాస యోగాది నియమములు అవలంబించి పెక్కుపాట్లు పడినట్లు తెలియుచున్నది.

కౌసల్య ముందు చూపు కలిగినట్టిది. రాబోవు అనర్థమును కూడ ఊహించునట్టిది. ధర్మమునే అవలంబించి తన సవతియైన కైకేయిని కూడ తోబుట్టువుగ భావించినట్టి విశాల హృదయురాలు.

## పతి భక్తి

కౌసల్యను గూర్చి సాక్షాత్తు దశరధుడే కైకేయితో యిట్లు చెప్పెను.

**యదా యదా హి కౌసల్యా దాసీవచ్చసఖీవచ ।**
**భార్యావద్భగినీ వచ్చ మాతృవచ్చోప తిష్ఠతి ॥** **అయో.కా. 12.68.**

కౌసల్య తాను పట్టమహిషి అయినను సేవ చేయుచున్న సమయమున దాసీవలె, ద్యూత క్రీడాది సమయమున స్నేహితురాలివలె, ధర్మానుష్ఠాన సమయమున భార్యవలె, ఇతర భార్యలను చేసుకొనునపుడు తోడ బుట్టిన దానివలె, శరీరపోషణ మున్నగు సమయములలో తల్లివలె ప్రవర్తించుచుండెను.

**కార్యేషు దాసీ కరణేషు మంత్రి**

**భోజ్యేషు మాతా శయనేషు రంభా ।**

**రూపేచ లక్ష్మీ క్షమయా ధరిత్రీ**

**షట్కర్మ యుక్తా కుల ధర్మపత్నీ ॥**

అన్నివిధముగ భార్యకు ఉండవలసిన లక్షణములు ఏవో అట్టి లక్షణములను పునికి పుచ్చుకున్న ఉత్తమ ఇల్లాలు.

దశరథుడు కైకేయి నాశ్రయించి కౌసల్యను దూరముగ నుంచెను.

**గతి రేకా పతిర్నార్యా ద్వితీయాగతి రాత్మజః ।**

**తృతీయా జాత యో రాజం శ్చతుర్థీనేహ విద్యతే ॥ అయో. కా. 61.24.**

స్త్రీకి భర్త మొదటి దిక్కు. పుత్రుడు రెండవ దిక్కు దాయాదులు మూడవ దిక్కు. ఈముగ్గురు తప్ప వేరెచటను స్త్రీకి స్వాతంత్ర్యము లేదు. ఇదేవిషయమును మనువు కూడ ధ్రువీకరించెను.

**పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవ్వనే ।**

**రక్షంతి స్థావిరేపుత్రా న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి ॥ మనుస్మృతి. 9-3**

బాల్యమునందు తండ్రి, యౌవ్వనమందు భర్త, వృద్ధాప్యమునందు పుత్రుడు సంరక్షించును. ఇచట దశరథుడు కౌసల్య సవతియైన కైకేయికి అధీనుడు. కావున ఆయన సహాయము లేనట్లే. రెండవ దిక్కు రాముడు ఎచటనో దూరముగ అడవిలో నున్నాడు. కావున అతడును లేనట్లే. కాని కౌసల్య భర్త కలదగుటచే అడవికి పోలేదు. దీనిని బట్టి ఆమెకు భర్త పైగల గౌరవ ప్రపత్తులు తెలియుచున్నవి.

దశరథుడు కౌసల్యతో-- దేవీ! నీవెల్లప్పుడు శత్రువులపై కూడా దయ చూపునట్టి దానవు. మంచి మనసుగలదానవు. నీవు నిత్యము ధర్మపరాయణురాలవు జీవితములో ఒడిదుడుకులు చూచిన దానవు. అనిపలుకగనే కౌసల్య భర్త యొక్క దీనస్థితికి ఎంతో బాధపడి తాను మునుపు పడ్డ దుఃఖము నంతయు మరచి కన్నీరు కార్చెను.

కైకేయి దశరథుని గూర్చి నర్మగర్భితములగు మాటలు మాట్లాడినందుకు ఏడ్చుచు రాజొనర్చిన అంజలిని పద్మమునవలె పట్టుకొని తన తలపై ధరించి, ధర్మమునకు వెరచినదై తత్తరపాటుతో తడబడుచున్న అక్షరములు గల మాటలతో కౌసల్య యిట్లనెను.

**ప్రసీద శిరసా యాచే భూమౌ నిపతి తాఽస్మితే ।**

**యాచితాస్మి హతాదేవ హంతవ్యాఽహంనహిత్వయా ॥**

**అయో. కా. 62.12.**

దేవా! ప్రసన్నుడవగుము. నా తలను వంచి భూమిని తాకి ప్రణామము చేయుచున్నాను. నీచే యాచింప చేసుకొన్న దుష్టురాలను. అని పలికి క్షమింపమని వేడెను.

కౌసల్య పతిభక్తి పరాయణురాలు కావుననే దశరధుడు మరణించుటకు పూర్వము తనకీ దుస్థితి కలుగుటకు కారణభుతమగు శ్రవణ కుమారుని కథను కౌసల్యకు వివరించెను. అవసాన సమయమున దశరధుడు తన దగ్గరకు వచ్చెనని ఆమె ఏ మాత్రము బాధ పడకుండ భార్యగ, ఉత్తమ గృహిణిగా, తన కర్తవ్యమును తాను నెరవేర్చి దశరధునకు ఎంతో ఊరట కలిగించినట్టి సాధ్వీమణి. ఈ విధముగా కౌసల్య నారీ లోకమునకు ఆదర్శప్రాయముగ నిలిచినది.

## పుత్రప్రేమ

శ్రీరాముడు పితృవాక్యమును నెరవేర్చదలచి పదునాలుగు సంవత్సరములు వనమునకు వెళ్ళుటకై నిశ్చయించుకొని తల్లి అనుమతి పొందుటకై ఆమె అంతఃపురములో ప్రవేశించెను. పట్టాభిషిక్తుడు కాబోయే కుమారుని చూసి ఎంతో సంతోషపడి తన పాదములకు నమస్కరించిన రాముని యిట్లు దీవించెను. నీవు, పెద్దలు ధర్మప్రవృత్తి గలవారు రాజర్షులు మహాత్ములు అగువారి కీర్తిని, వంశమున స్వాభావికమగు కీర్తిని పొందుము. పుత్రుడు తనకడకు వచ్చినాడన్న తలంపుతో సహజ మాతృభావము ఉట్టిపడగ అందరితల్లులవలె ఆసన మొసంగి భుజింపుమని కోరెను. అనంతరము రాముడు మెల్లగ తాను పదునాల్గు సంవత్సరములు అడవికి వెళ్లుచున్నట్లు తెలుపగనే ఆమె మనస్సు ఎంతో తల్లడిల్లెను. అంతేగాక నీవు లేనిదే నాకు తగిన స్థానము లభించదని వాపోయెను.

రాముని మాటలు విన్న కౌసల్య మనస్సు దిటవుచేసుకొని రాజకుమారుడైన రాముడు అడవిలో ఉంచ వృత్తితో ఎట్లు జీవించగలడు.

**యస్య భృత్యాశ్చ దాసాశ్చ మృష్టా న్యన్నాని భుంజతే ।**
**కథం స భోక్ష్యతేఽనాథో వనే మూల ఫలాన్యయమ్ ॥** అయో.కా. 24-3.

దాస దాసీలతో శ్రేష్టమగు ఆహార పదార్థములు భుజించునట్టి రాముడు దుంపలు, పండ్లు ఎట్లు తినగలడు. అనివాపోయెను. మరియు పుత్రప్రేమచే ఆమె నేనును నీతో అడవికి వత్తునని చెప్పెను.

**భర్తుశుశ్రూషయా నారీ లభతే స్వర్గముత్తమమ్ ।**
**అపియా నిర్నమస్కారా నివృత్తా దేవపూజనాత్ ॥** అయో.కా. 24-26.

అనంతరము రాముడు స్త్రీకి పతి సేవయే పరమ ధర్మము, భర్తకు శుశ్రూష చేయుటవలన స్త్రీ ఉత్తమమగు స్వర్గమును పొందగలదనెను. రాముని మాటలు విన్న కౌసల్య ఈవిధముగ పలికెను.

గచ్ఛ పుత్ర త్వమే కాగ్రో భద్రం తేస్తు సదా విభో ।

పున స్త్వయి నివృత్తేతు భవిష్యామి గతవ్యథా॥ అయో.కా.24.33.

కుమారా! నీవిక వెళ్ళిరమ్ము. నీవు తిరిగి వచ్చిన తోడనే నాక్లేశము తొలగును. నేను గొప్ప సుఖము నొందెదను. క్షేమముగా తిరిగి వచ్చి ప్రియము, మనోహరము అగు మాటలతో నన్ను సంతోష పెట్టగలవు అని ఆదరముతో మంగళకర లక్షణములుగల వాక్యములు పలికి ఆచమనము చేసి పరిశుద్ధయై మంగళాశాసనము గావించెను.

యం పాలయసి ధర్మం త్వం ప్రీత్యాచనియమేన చ ।

సవై రాఘవ శార్దూల ధర్మస్త్వాం అభిరక్షతు ॥

యేభ్యః ప్రణమసే పుత్ర దేవేష్వాయతనేషు చ ।

తేచ త్వామభి రక్షంతు వనే సహ మహర్షిభిః ॥

యానిదత్తాని తేఽస్త్రాణి విశ్వామిత్రేణ ధీమతా ।

తాని త్వా మభి రక్షంతు గుణైః సముదితం సదా ॥

పితృ శుశ్రూషయా పుత్ర మాతృ శుశ్రూషయా తధా ।

సత్యేవ చ మహా భాహో చిరంజీవా భి రక్షతః ॥

సమిత్కుశ పవిత్రాణి వేద్యశ్చా యతనాని చ ।

స్థండిలాని చ విప్రాణాం శైలావృక్షః పాహ్లదాః ॥

పతంగాః పన్నగాః సింహా స్త్వాం రక్షంతు నరోత్తమ ।

లోకపాలాశ్చచే సర్వే వాసవ ప్రముఖాస్తధా ॥

ఋతవః షట్ చతే సర్వే మాసాః సంవత్సరాః క్షపాః ।

దినాని చ ముహూర్తాశ్చ స్వస్తి కుర్వన్తు తే సదా ।

శ్రుతిః స్మృతిశ్చ ధర్మశ్చ పాతు త్వాం పుత్ర సర్వతః ॥ అయో.కా.25.3-10.

ధర్మమే నిన్ను రక్షించుననియు, అరణ్యము నందుండు మహర్షులు కాపాడుదురని, గురువుల అస్త్రములే రక్షించునని, తల్లిదండ్రుల శుశ్రూష, సత్యము కాపాడునని, సమిధలు, దర్భలు, అగ్నివేదికలు, దేవాలయములు, కొండలు, చెట్లు మడుగులు, పక్షులు, పాములు, సింహములు, ఋతువులు, మాసములు, సంవత్సరములు, దేవాసురులు నిన్ను కాపాడెదరని ఆశీర్వదించి తనకుగల పుత్రప్రేమను తెలియజేసెను.

## సనాతనాచారం

సనాతనాచారములు పాటించుటలో దిట్ట అయినది కావుననే కౌసల్యాదేవి విద్యావంతురాలని తెలియుచున్నది. శ్రీరాముడు దశరధుని ద్వారా తన పట్టాభిషేక విషయమును గూర్చితెలుసుకొని ఆయనకు నమస్కరించి, తన తల్లియగు కౌసల్యకు విషయమును చెప్పుటకు వెళ్లెను. ఆసమయమున ఆమె వివిధ దేవతలను ఆరాధించి రామునికి సంపదలను కోరుకొనుటకై--

**తత్ర తాం ప్రణవామేవ మాతరం క్షౌమ వాసినీమ్ ।**
**వాగ్యతాం దేవతాగారే దదర్శాఽఽ యాచతీం శ్రియమ్ ॥**

**అయో.కా. 4.30.**

వ్రతమునకు తగిన పట్టువస్త్రములను అలంకరించుకొని మౌనము దాల్చినది. సుమిత్ర, సీత, లక్ష్మణులు ఆమెను సేవింపగ ప్రాణాయామముతో శ్రీమహావిష్ణువును కన్నులు మూసుకొని ధ్యానించుచుండెను.

శ్రీరామ పట్టాభిషేకను ముందు రోజు రాత్రి కౌసల్యాదేవి నియమవతియై యుండి పెందలకడనే కుమారుని మేలుకోరి విష్ణువునకు పూజ చేసెను.

**ఇతి మాల్యైః సురగణాన్ గంధైశ్చాపి యశస్వినీ ।**
**స్తుతిభిశ్చాను రూపాభి రానర్చాఽఽయత లోచనా ॥**
**జ్వలనం సముపాదాయ బ్రాహ్మణేన మహాత్మనా ।**
**హావయామాస విధినా రామ మంగళకారణాత్ ॥ అయో.కా. 25.26-27.**

కౌసల్య పూలమాలలతోను, గంధములతోను తగిన స్తోత్రములతోను దేవతల నర్చించెను. ఆతరువాత యజ్ఞ హోత్రమును తెచ్చి మహాత్ముడగు ఒకానొక బ్రాహ్మణునిచే శాస్త్రోక్తముగ హోమమును చేయించెను. అనంతరము అభీష్టమగు దక్షిణకూడ నొసగెను. దీనిని బట్టి చూడ, కౌసల్యాదేవి సనాతనాచారపరాయణురాలని స్పష్టముగ బుజువగుచున్నది. యిట్టి సనాతనాచార పరాయణత్వము సకల స్త్రీలకున్ను ఆదర్శభూతమైనట్టిది.



# సుమిత్ర

సుమిత్ర దశరథునకు గల పట్టపు రాణులలో రెండవది. ఈమె అవసరానికి పనికి వచ్చే దివ్యఔషధంలాంటిది. కైకేయి జీవితం పరమభౌమంఅయితే సుమిత్ర పరమ ఆధ్యాత్మిక తత్త్వానికి ప్రతీక. సదా భగవత్సేవకు అంకితమైన దాసుడగు లక్ష్మణుని శత్రుఘ్నుని కనిన ధన్యురాలు. భాగవత సేవకు అంకితమైన స్నేహశీలి. ఈమెను గూర్చి వాల్మీకి చాలా తక్కువగా చిత్రించినాడు. సుమిత్ర క్షాత్రగుణము కలది. ఆమె ఎట్టి కష్టములనైనను, స్థైర్యముతో నెదుర్కొనును. మరియు చాలా ఓర్పుగలది. జ్ఞానసంపన్నురాలు, పతి భక్తి పరాయణసేవా తత్పరురాలు. ఈమె అందరినీ మించినట్టి బుద్ధి సంపన్నురాలని రామాయణ కావ్యము ద్వారా తెలియుచున్నది. సుమిత్ర శీల సంపన్నురాలు. కైక కన్నను, కౌసల్య కన్నను, మిక్కిలి ఆధ్యాత్మిక పరురాలు. వాల్మీకి మహర్షి అనేక సార్లు లక్ష్మణుని సౌమిత్రి అని సంబోధించి యుండడముచే ఆమెకు గల గొప్పతనము తెలియుచున్నది. ఈమె కౌసల్యయందు మిక్కిలి మమత గలది. ఆమెనే నిత్యమూ అనుసరించుచుండును.

## ఉపదేశ వైలక్షణ్యం

లక్ష్మణుడు వనవాసమునకు పోవు సమయమున తన తల్లి అనుమతిని పొంది ఆమె దగ్గరశెలవు తీసికొనుటకై ఆమెకు నమస్కరించెను. అపుడు ఆమె కుమారునితో--

**వ్యసనీ వా సమృద్ధోవా గతిరేష తవానఘ ।**
**ఏషలోకే సతాం ధర్మో యజ్జ్యేష్ఠ వశకో భవేత్ ॥**
**రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్ ।**
**అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాతయథా సుఖమ్ ॥ అయో.కా.40.6,9.**

కుమారా! నీవు రాముని సదా అనుసరించుచు రక్షించు చుండుము. నీ అన్న ఆపదలపాలైనను, సుఖముగనున్నను అతడే నీకు ఆశ్రయనీయుడు. పెద్దవాని అధీనములో చిన్న వాడుండడము సజ్జన ధర్మము. నీవు సీతా రాములను సేవించునపుడు సీతను నన్నుగా భావింపుము. రాముని నీ తండ్రియగు దశరథునిగా భావింపుము. అరణ్యమును అయోధ్యగా భావింపుము. ఈ ప్రకారము రాముని అనుసరించుటయే నీకు సుఖప్రదము అని చక్కటి ఉపదేశమును చేసినది.

## క్రాంతదర్శిత్వం

సుమిత్ర క్రాంతదర్శిత్వము కలిగినట్టి స్త్రీ. రాబోవు విషయమును ముందుగనే ఊహించునట్టిది. ఒకరకముగ తార మండోదరులవలె భవిష్యత్తును చక్కగ తెలుసుకొను నట్టిది. శ్రీరాముడు సీతాలక్ష్మణులతో సహా అడివికి వెళ్ళగ కౌసల్య మిక్కిలి విలపించుచుండెను. ఆ సమయమున సుమిత్ర కౌసల్యను ఈ ప్రకారముగ అనునయించి తనకుగల క్రాంతదర్శిత్వమును కౌసల్య ఎదుట ప్రదర్శించెను.

**తవార్యే సద్గుణైర్యుక్తః పుత్ర స్స పురుషోత్తమః ।**
**కింతే విలపితే నైవం కృపణం రుదితేనవా ॥** అయో.కా.44.2.

సద్గుణవతీ! నీ పుత్రుడు పురుషోత్తముడు. అనేక కళ్యాణ గుణములకు నిలయుడు. కావున నీపుత్రుడను బుద్ధితో చింతింపకుము. దశరథునకు పరలోక హితమును గూర్చునట్టి ధర్మమును ఆచరించుచున్నాడు. కాన అతనిని గూర్చి నీవు దుఃఖించవలదు. లక్ష్మణుడు రాముని విషయమున అనురక్తుడై, ఉత్తమమగు కైంకర్యమును ఆచరించుచున్నాడు. మహాత్ముడగు రామునికి సేవ చేయుటయే అతనికి పురుషార్థము. రాత్రులందు నిద్రపోవుచున్న నీకుమారుని చంద్రుడెట్లు చల్లని కిరణములతో స్పర్శించుచు ఆహ్లాదమును కలిగించునో అట్లు రామునికి లక్ష్మణుడు ఆహ్లాదమును కలుగ చేయగలడు.

**యాశ్రీ శ్శౌర్యం చ రామస్య యాచ కళ్యాణ సత్త్వతా ।**
**నివృత్తారణ్య వాస స్సక్షిప్రం రాజ్య మవాప్స్యతి ॥** అయో.కా.44.14.

సర్వ లక్షణ సంపన్నమగు నవయవశోభ, పరాక్రమము, ప్రశస్తమగు బలములచే రాముడు అరణ్యవాసము చేసి తిరిగి రాజ్యమును పొందగలడు. నీవిక దుఃఖమును, మోహమును వదలి పెట్టుము. నేను నీతో సత్యమునే పలుకు చున్నాను. అని ఈ ప్రకారము తన ఉహా జ్ఞానముచే రాబోవు విషయములను ముందే తెలుసుకొనునట్టి ప్రజ్ఞాశాలి సుమిత్ర.

ఈప్రకారము చక్కని ఉపదేశ గుణము కలిగినట్టిదియు రాబోవు విషయములను ముందే ఉహించునట్టిదియును, యథార్థమును చెప్పుటలో దిట్టయునై పేరు గాంచినది. ఈమెకున్నట్టి ఈగుణములు ఆపద లోనున్నట్టి వారికి అమృతపు జల్లులవలె ఉపయోగ పడును. అట్టి ఈగుణములు సమాజమునకు ఆదర్శ ప్రాయ మైనట్టివి.



# కైకేయి

ఈమె కేకయ దేశాధిపతియైన అశ్వపతి కుమార్తె. యుధాజిత్తు చెల్లెలు. ఈమె చాలా అందగత్తె. ఎంత అందమైనదో అంత తెలివి తేటలు గలది. యుద్ధకళయందు కూడ మంచి ప్రావీణ్యము కలది.

**అపవాహ్య త్వయాదేవి సంగ్రామా న్నష్ట చేతసః ।**

**తత్రాపి విక్షతః శస్త్రైః పతిస్తే రక్షిత స్త్వయా ॥** అయో.కా.9.16.

అందువలనే శంబరునితో దశరధుడు యుద్ధము చేయుటకు పోయినపుడు రాక్షసులచే క్షత, విక్షత గాత్రుడైన అతనిని కాపాడి అతడికి విజయమును చేకూర్చి పెట్టినది. ఈవెంది ఉడువుపట్టు.ఎంత సరళ స్వభావమో అంత కఠినాత్మురాలు. దశరథుడు తన భార్యలలో కెల్ల కైకేయి పైననే ఎక్కువ మక్కువ చూపించెడివాడు.

**యథావై భరతోమాన్యః స్తథా భూయోపి రాఘవ ॥** అయో.కా.8.18.

రాముని ఋజుస్వభావమును, భక్తిని, వినయమును చూచి భరతునితో సమానముగ ప్రేమించెడిది. కైకేయి తన పుత్రుని పైననే గాక తన సవతి పుత్రులైన శ్రీరామ, లక్ష్మణ, శత్రుఘ్నులపై కూడ మంచి పుత్ర వాత్సల్యమును చూపించుచుండెను.

## సవతి పుత్రుల పైగల వాత్సల్యం

కైకేయి దాసియగు మంధర శ్రీరామ పట్టాభిషేక వార్తవిని కైకేయితో--

**ఉత్తిష్ఠ మూఢే కింశేషే భయం త్వా మభి వర్తతే ।**

**ఉపప్లుత మఘౌఘేన కిమాత్మానం నబుధ్యసే ॥** అయో.కా. 7.14.

మందబుద్ధివగు ఓ కైకేయా! నీవు ఏల నిద్రించుచున్నావు. నీకిపుడు భయంకరమగు దుఃఖము కలుగ బోవుచున్నది. దశరథ మహా రాజునకు నీవు మిక్కిలి ఇష్టమైన దాని వైప్పటికీ నీ శ్రేయస్సు కోరి ఏమియు చేయలేకున్నాడు. అని నిష్ఠురముగ మాట్లాడినది. కైకేయి మంధర ద్వారా రామాభిషేక వార్తవిని ఆనందముతో శయ్యనుండి లేచి ఆశుభవార్త విన్నందుకు గాను-- ఒక అమూల్యమగు ఆభరణమును కుబ్జయగు మంధర కిచ్చెను.

**రామేవా భరతే వాహం విశేషం నోపలక్షయే ।**

**తస్మా త్తుష్టా స్మి యద్రాజా రామం రాజ్యేఽభిషేక్ష్యతి ॥**

మరియు భరతునకు రామునకు మధ్య నాకు కొంచెమైనను భేదము లేదు. దశరథుడు రామునకు రాజ్యాభిషేకము చేయుచున్నాడని తెలిసి మిక్కిలి సంతోషించు చున్నాను. రామాభిషేకవార్త కన్నా మిగుల ప్రీతికరమగు వార్త నాకేమియులేదు. సకలప్రీతికరమగు మాటలను మించినట్టి ప్రీతికరమగు వార్తను చెప్పితివి. అందుకుగాను నీవు మరొక వస్తువును కోరుకొనుము. యిచ్చెదనని పలికెను. కైకేయి చెప్పిన ఈమాటలు ఆమెను ఉన్నత శిఖరములకు తీసుకొనిపోయినవి. లోకమున సామాన్యముగ సవతి పిల్లల మీద ప్రేమ చూపించుట అరుదు. ఒకవేళ చూపించినను అది కృతకముగానే యుండును. కైకేయి తన సవతి పుత్రుడగు రాముని పై చూపించిన ప్రేమ అనితరసాధ్యము కానట్టిది. యిట్టి ఈ ఆదర్శ గుణముకైకేయి ద్వారా సవతి తల్లులందురు గ్రహించదగినట్టి గుణము. అందకు మంధర ఎంతో బాధనొంది పరిపరి విధముల కైకేయి భావి జీవనమును గూర్చి ముమ్ముందు ఆమెకు రాగల కష్టములను గూర్చి కనులకు కట్టినట్లు వివరించి చెప్పెను. ఆప్రకారముగ మంధర పలికినప్పటికి కైకేయి రాముని గుణగణములనే ప్రశంసించెను.

**ధర్మజ్ఞో గుణవాన్ దాన్తరి కృతజ్ఞః సత్యవాన్శుచిః ।**
**రామో రాజసుతో జ్యేష్ఠో యౌవరాజ్యమతోనర్హతి ॥ అయో.కా. 8.14.**

రాముడు ధర్మము నెఱిగినవాడని,గురువులచే సుశిక్షితుడని ఇతరులు చేసిన ఉపకార లేశమును గూడ ఘనముగ భావించెడివాడని యదార్థవాదియని, పరిశుద్ధుడని, విశేషించి మహారాజుకు జ్యేష్ఠ పుత్రుడు కావున యౌవ రాజ్యమునకు తగిన వాడని చిరంజీవియగు రాముడు తన సోదరులను తండ్రివలె కాపాడువాడని మంధరకు చెప్పి తన బుజావర్తనమును స్పష్టముగ తెలిపినది.

ఇంకను కొంచెము ముందుకు వెళ్ళి తనకు భరతుడెట్లు మాన్యుడో, అంతకన్నా రాముడు మాన్యుడని చెప్పినది. అంతగ చెప్పినప్పటికినీ మంధర తన పట్టు విడువక రామునిపై, దశరథునిపై ఎన్నెన్నో అపవాదములు చెప్పి కైకేయి మనసు విరుగునట్లు చేసి రాముని వనవాసమునకు పంపించుటకు కైకేయిని నిమిత్తమాత్రురాలిగ చేసినది. అందుకు కారణము మంధరయే గాని కైకగాదు. కావున కైకేయి పుత్రవాత్సల్యము భరతునిపై కన్న శ్రీరామునిపైననే అధికముగా కలదని చెప్పుట యుక్తముగాతోచుచున్నది.



# శ్రీ సీత

రామాయణము నందు వాల్మీకి శ్రీరామచంద్రుని పాత్రతో పాటు సీత పాత్రకు కూడ సమాన ప్రాధాన్యత కల్పించినాడు.

**కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్ ।**
**పౌలస్త్యవధ మిత్యేవం చకార చరిత వ్రతః ॥** బా.కా.4-7.

కనుకనే శ్రీమద్రామాయణ మహాకావ్యమునకు 'సీతాయాశ్చరితం' అని పేరుకూడా పెట్టియున్నాడు. తన శీల వృత్తములచే ఎట్లు శ్రీరాముడు పురుషోత్తముడుగ నెంచబడెనో అట్లే సీతాదేవి కూడ--

**శ్యామా సమవిభక్తాంగీ స్త్రీరత్నం రత్న భూషితా ॥**

సీతాదేవికూడ తన పవిత్ర చారిత్రముచే స్త్రీరత్నముగను వర్ణించబడినది. ఈమె యావన్నారీలోకమునకే ఆదర్శభూతకాదగిన పతివ్రతా తిలకము.

**ఇయం సా ధర్మ శీలస్య మైథిలస్య మహాత్మనః ।**
**సుతా మైథిల రాజస్య సీతాభర్తృ దృఢవ్రతా ॥** సు.కా.16-15.

సీతాదేవి రాజర్షి, ధర్మశీలుడు, మహాత్ముడగు మిథిలాధిపతియైన జనకుని పుత్రిక, ఈయన యజ్ఞము చేయుటకై భూమిని శోధించు చుండగ నాగటి చాలు నుండి ఆవిర్భవించెను. నాగటి చాలులో లభించుటచే జనకుడామెకు 'సీత' అని నామకరణం చేసెను. ఇంకను ఈమెకు మైథిలి, జానకి అనియు పేర్లున్నట్లు రామాయణంలో కన్పించుచున్నది.

సీతాదేవి జనకునిచే పోషింపబడ్డకూతురు అసమాన ప్రజ్ఞా, నైపుణ్యము, కీర్తి, ఆదరము, ఆప్యాయతలతో కూడుకొన్న సాధ్వీమణి, పతివ్రతలలో అగ్రేసరురాలు.

ప్రకృతిలోని రూప సౌందర్యము నంతటిని గ్రహించి సీత యొక్క ప్రతిమను నిర్మించి అందు సుగుణ సౌరభములు నింపి ఆమె పాత్రను, సర్వాతి శయముగ రూపొందించి ఆదికవియగు వాల్మీకి 'కవిబ్రహ్మ' అను బిరుదమునకు అన్వర్థము గావించెను.

**అనురక్తా హివై దేహీ రామే సర్వాత్మనా శుభా ।** సు.కా. 59.24.

సీతాదేవి సర్వాత్మనా తన పతియగు శ్రీరామ చంద్రుని ఆశ్రయించిన పరమసాధ్వీమణి. ఈమె నిశ్చల మగు పతి భక్తి, పెద్దల ఎడ గౌరవము, ధర్మనిష్ఠ, వినయవివేకసౌశీల్యాదులు, కష్టములందు అచలత్వము, అసాధారణమగు క్షమ, కరుణ,

నిర్మలమగు ప్రేమ పవిత్రత మొదలగు సద్గుణములన్నియు ప్రోగుపడి సీతరూపుదాల్చినవని చెప్పవచ్చును. సీతాదేవికిగల గుణములన్నియు ఆదర్శప్రాయములైనట్టివే.

## పతిసేవ

తెల్లవారితే రాముని అభిషేకం జరుగునని అభిషేకము కోసము సహధర్మచారిణిగా వ్రత ఉపవాసాది నియమములను ఆచరించుచుండెను. అందుకై ఆమె స్వయముగ దేవ పూజ నొనర్చి తన భర్తయగు శ్రీరాముడు పట్టాభిషిక్తుడుకాగా పట్టమహిషి గంధపుష్పాదులతో అతని పాదములకు పూజచేయవలయునను ఆచారము తెలుసుకొన్నదై మిక్కిలి సంతోషము నొందిన మనస్సు కల దాయెను. తెల్లగొడుగు, చామరములు, సింహాసనము మొదలగు లక్షణములను గూర్చి ఆలోచించుచు రాముని రాకకై నిరీక్షించు చుండెను. ఆ సమయమున కాంతి హీనమైన ముఖము కలిగిన రాముని చూచి పరిపరివిధముల దుఃఖపీడితయయ్యెను.

అంత రాముడు తండ్రి యాజ్ఞపై అడవికి వెళ్ళుచున్నానని భరతాదులను లెస్సగ గౌరవించవలయునని భరతుడు రాజు గనుక ఎన్నడు అతనికి అయిష్టతను కల్గించ కూడదని, ధర్మము నందాసక్తురాలవై ఎవరికినీ అప్రియమును కలిగించక నడుచుకొమ్మని సీతకు తెలియజేసెను. అంత సీత రామునితో--

భర్తుర్భాగ్యంతు నార్యైకా ప్రాప్నోతి పురుషర్షభ ।
అతశ్చా వాహ మాదిష్టా వనే వస్తవ్య మిత్యపి ॥
న పితా నాత్మజో నాత్మా న మాతా న సఖీ జనః ।
ఇహ ప్రేత్యచ నారీణాం పతిరేకో గతిస్సదా ॥ అయో.కా.27.5-6.

పురుషశ్రేష్ఠుడా! భార్య ఒక్కతియే భర్త భాగ్యమును పొందును. కాన నేనును నీతోపాటు అడవిలో నివసించుటకు ఆదేశింపబడినట్లే భావించవలయును. ఇహలోకమున, పరలోకమున స్త్రీలకు తండ్రిగాని, కొడుకుగాని, తల్లిగాని, చెలికత్తెలుగాని చేరదగినట్టివారుకారు. ముల్లోకాలను కూడ లెక్క సెట్టక నీ శుశ్రూషయే పరమావధిగా భావించి--

సుఖంవనే నివత్స్యామి యథైవ భవనే పితుః ।
అచిన్తయన్తి త్రీన్‌లోకాన్ చిన్తయన్తిపతి వ్రతమ్ ॥
శుశ్రూషమాణా తేనిత్యం నియతా బ్రహ్మచారిణీ ।
సహరంస్యే త్వయావీర వనేషు మధుగంధిషు ॥ అయో.కా.27.12-13.

అడవినిసైతము నా తండ్రి ఇల్లుగా భావించి సుఖముగనివసింతును. నియమవతినై నిత్యము నిన్ను సేవించుచు నీతోపాటు అడవిలో సంచరించెదను. అని భర్త కష్టదశలో ఉన్నప్పటికీ సుఖదు:ఖములలో భర్తనే అనుసరించ వలయునను హైందవ ఆర్యోక్తిని పాటించిన గొప్ప సాధ్వీమణి.

అరణ్యము అనేక క్రూరమృగములతో కూడుకొన్న దనియు, తినుటకు ఫలములు తప్ప ఇతర మైనవి దొరక వని కావున అడవి జీవితము కష్టసాధ్యమని సీతతో రాముడు చెప్పెను. అయినప్పటికీ పతిసేవా పరాయణురాలైన ఆమె వాటిని లెక్కపెట్టక పతిని వదలిన స్త్రీ జీవింపజాలదని రాముడు అనేక సార్లు చెప్పిన మాటనే తిరిగిపల్కెను.

**భక్తాం పతివ్రతాం దీనాం మాం సమాం సుఖ దుఃఖ యోః ।**
**నేతు మర్హసి కాకుత్థ్స సమాన సుఖదుఃఖ నీమ్ ॥**
**యది మాం దుఃఖి తామేవం వనం నేతుం న చే చ్ఛసి ।**
**విషమగ్నిః జలం వాహ మాస్థా స్యే మృత్యు కారణాత్ ॥**

**అయో.కా.29.21-22.**

అనంతరము రామునితో కాకుత్థ్స వంశ సంభవుడా! భక్తిమతి, పతివ్రత, దీనురాలనై సుఖదుఃఖము లందు సమాన స్థితి కలిగినట్టి నన్ను అడవికి తీసుకొని పోక పోయినచో విషము వలనో, అగ్నివలనో, నీటి ద్వారానో మృత్యువునకు ఆహుతి అయ్యెదనని పలికెను. అయినను రాముడు ఆమెను విరమింపజేయుటకు ఎంతో ప్రయత్నించెను. అందుకు సీత రామునితో నిన్ను వదలి నేను ఒక్కక్షణము జీవించలేను అని రాముని కౌగిలించుకొని దీనముగఏడ్చెను. అందుకు సీత రాముని తో ఎట్లైనను సతికి పతియే గతిఅని భావించి సుఖదుఃఖము లందు అతనిని అనుసరించవలయునని నిశ్చయించుకొని వెట్టపనులు చేసి యైనను తన భార్యను తాను భరింప వలెనని మనువు చెప్పియున్నాడని చెప్పెను.

**కింహి కృత్వా విషణ్ణస్త్వం కుతోవాభయమస్తితే ।**
**యత్పరి త్యక్తుకామ స్త్వం మామనన్య పరాయణామ్॥** **అయో.కా. 30.5.**

నీవు తప్ప అన్యుని మనస్సున తలంపని నన్ను ఏభయముతో నీవు నన్ను విడిచి పెట్టి పోవుటకు సిద్ధపడుచున్నావు. నీవు అడవికి తీసికొని పోనిచో నీ సన్నిధిలోనే విషము తీసికొందును. నీవు అడవికి వెళ్ళిన పిమ్మట దుఃఖముచే నేను జీవింపజాలను. నీచే విడువ బడిన నాకు నీ ఎదుటనే మరణము మేలు. నీ ఎడబాటు ఒక్కక్షణము కూడా సహింప లేను. అట్టినేను పదు నాలుగు సంవత్సరములు ఎట్లు దుఃఖముతో గడుపగలను. అని ఆమె మిక్కిలి దుఃఖ పీడితయై రాముని కౌగిలించుకొనెను.

నదేవి తవ దుఃఖేన స్వర్గమప్య భిరో చయే ।
నహిమేస్తి భయం కించి స్త్వయం భోరివ సర్వతః ॥
య త్స్రృష్టాసి మయా సార్థం వనవాసాయ మైథిలీ ।
న విహాతుం మయా శక్యా ప్రీతి రాత్మవతా యథా ॥ అయో.కా.30.27-29.

అంత రాముడు ఆమెతో - "నాతో వనవాసము చేయుట కై నిన్ను యిట్లు సృష్టించినాడు. కాన నిన్ను నేను విడువ జాలను. నీవు నాతో కూడి యుండుటకు నిశ్చయించుకొంటిని. కాన నీవు నన్ను అనుసరించుము. నాకు సహ ధర్మ చారిణివి కమ్ము. నీవు లేనిది స్వర్గము కూడ రుచింపదు. శీఘ్రముగ బయలు దేరమనెను". ఈ ప్రకారము సీతదేవి భర్తయే దైవముగా భావించి కేవలము సంతోష సమయము లందు మాత్రమే అతనిని అనుసరింపక క్లిష్టమైన వనవాసమున కలుగు కఠిన జీవనమును రాముని నోటి గుండా విన్నను ధర్మాన్ని ఆచరించి--

వ్రజతు చరతు ధర్మం భర్తునాథాహి నార । ప్రతిమా నాటకమ్.

ఎచ్చటకి వెళ్ళినను స్త్రీలు భర్తలనే నాథులుగా భావించెడి వారని ప్రతిమా నాటక కర్తయైన భాసుని పై వాక్యమునకు అనుగుణముగా కష్టసమయ మందును శ్రీరాముని అనుసరించి నట్టి ఉత్తమ యిల్లాలు. కనుక పతి సేవా పరాయణాత అనుగుణము స్త్రీ లందరికి ఆదర్శ ప్రాయమైనది.

## దైవ భక్తి

రాముని పట్టాభిషేకమునకు పూర్వము సీత వ్రత ఉపవాసాది నియములు ఆచరించు చుండెను. సీత స్వయముగ దేవపూజ నాచరించినట్టిది. దీనిని బట్టి సీత దైవ పూజ పరాయణురాలని తెలియచున్నది.

సీతాదేవి వస్తుతః గొప్ప దైవభక్తి గలది. ఆనాటి స్త్రీలు చెట్టును పుట్టను, గట్టును, భావిని నదులను ఎట్లు పూజించిరో అట్లే సీతాదేవియు దైవభక్తితో వాటినన్నింటినీ పూజించు చుండెడిదని రామాయణము నందలి కొన్ని ముఖ్యమైన ఘట్టముల ద్వారా తెలియుచున్నది. శృంగిబేరిపురము నుండి శ్రీరాముడు సీతాదేవితో కలిసి గుహుని సహాయముతో గంగానదిని దాటునపుడు సీతాదేవి గంగా నదిని ఉద్దేశించి --

పుత్రో దశరథస్యాయం మహరాజస్య ధీమతః ।
నిదేశం పాల యత్వేనం గంగే త్వద భిరక్షితః ॥
చతుర్దశ హి వర్షాణి సమగ్రా ణ్యుష్య కాననే ॥
భ్రాతా సహ మయా చైవ పునః ప్రత్యాగమిష్యతి ।

తతస్త్వాం దేవి సుభగే క్షేమేణ పునరాగతా ॥
యక్ష్యే ప్రముదితా గంగే! సర్వకామ సమృద్ధినీ ॥ అయో.కా.52.83-85.

అమ్మా! నాభర్తయగు శ్రీరామచంద్రుడు నీచే రక్షింప బడిన వాడై పదునాలుగు సంవత్సరములు అరణ్యావాసముచేసి తండ్రియాజ్ఞపాటించి లక్ష్మణుని తోడను నాతోడను అయోధ్యకు తిరిగి రాగలడు. నేనప్పుడు నా కోర్కెలన్నియు నెరవేర్చుకొని క్షేమముగ తిరిగివచ్చి మిక్కిలి సంతోషముతో మీకు అనేక విధముల పూజలొనర్తును.

గవాంశత సహస్రంచ వస్త్రాణ్యన్నంచ పేశలమ్ ।
బ్రాహ్మణేభ్యః ప్రదాస్యామి తద ప్రియ చికీర్షయా ॥ అయో.కా.52.88.

నా భర్త క్షేమముగా తిరిగి వచ్చి రాజ్యమును పొందిన చో నీకు లక్షఆవులను వస్త్రములను, మంచి అన్నమును బ్రాహ్మణులకు యిచ్చెదను. నీ తీరము నందున్న దేవత లందరినీ పూజింతును. నీతీరము నందున్న కాశి మున్నగు పవిత్ర క్షేత్రములను పూజింతును అని పలికెను. దీనిని బట్టి ఆమె మంచి దైవ భక్తురాలు ప్రకృతి ఆరాధకులని స్పష్టమగు చున్నది.

భరద్వాజాశ్రమము నుండి బయలుదేరిన సీతారామలక్ష్మణులు యమునా నది మధ్య ప్రదేశమునకు వచ్చుటతోడనే సీత ఆనదికి నమస్కరించి--

యక్ష్యే త్వాం గో సహస్రేణ సురాఘటశతేన చ ।
స్వస్తి ప్రత్యాగతే రామే పురీ మిక్ష్వాకు పాలితామ్ ॥ అయో.కా.55.20.

తల్లీ! నేనిపుడు నిన్ను దాటుచున్నాను. నాభర్తవనవాసవ్రతమును తీర్చుకొని అయోధ్యాపట్టణమునకు మరలివచ్చినంతనే వేయి ఆవులు దానమిచ్చి నిన్ను పూజింతును. అని దోసిలి యొగ్గి ప్రార్థించెను. అనంతరము యమునానది తీరము నందలి మఱ్ఱిచెట్టును చేరుకొనిరి.

భరద్వాజుడు చెప్పినట్లుగ సీతాదేవి ఆ వృక్షమును సమీపించి--

నమస్తేస్తు మహావృక్ష పారయేన్మే పతివ్రతమ్ ।
కౌసల్యాం చైవ పశ్యేమ సుమిత్రాం చ యశశ్వినమ్ ॥
ఇతిసీతాంజలి కృత్వా పర్యగచ్ఛాన్మనస్వినీ ॥ అయో.కా. 55-25.

ఓ మహావృక్షమా! నీకు నమస్కారము నా భర్త వనవాసవ్రతమును పూర్తిచేయుగాక అనంతరము కీర్తిమంతురాలగు కౌసల్యాదేవిని, సుమిత్రా దేవిని చూచెదనుగాక అని సీత అంజలి ఘటించి ఆ మహావృక్షమునకు ప్రదక్షిణము చేసెను. దీనిని బట్టి సీతాదేవి దైవభక్తి మనకు తెలియుచున్నది.

## పాతివ్రత్యం

రాముని పట్టాభిషేకవార్తనని ఆమె స్వయముగ దేవపూజ గావించి రాముని రాకకై ఎదురుచూచుచుండెను. అట్టి సమయమున రాముడు సీతా వాసమున ప్రవేశించెను. రాముని గాంచినసీత మిగుల దుఃఖితురాలైనది. అంత రాముడు సీతతో పూజ్యుడగు నాతండ్రి నన్ను అడవికి పంపుచున్నాడు అని పలికెను. శ్రీరాముడు సీతను అరణ్యమునకు వలదని వారించినను ఆమె రాముని అనుసరించవలయునని, నిశ్చయించుకొనగ చివరకు రాముడు ఆమెకోర్కెను అంగీకరించెను.

రాముడు మాయలేడిని తరుముచు అడవిలో చాలాదూరము ముందుకు వెళ్లెను. చివరకు మాయలేడి రామబాణమునకు గురియై హా సీతా ! హా లక్ష్మణా ! అని అరచి చనిపోయెను. సీత ఆ ఆర్తనాదమును విని లక్ష్మణునితో నీవు పోయి రామునికి ఏమైనో తెలుసుకొని కాపాడవలసినది. కావున యిచ్చటి నుండి వేగముగ వెళ్లుము. అని సీతాదేవి ఆజ్ఞాపించెను. సీతా రక్షణమున ఉండవలసినదని రాముడు ఆజ్ఞాపించి నందు వలన లక్ష్మణుడు అచట నుండి వెడల లేదు.

సౌమిత్రే! మిత్రరూపేణ భ్రాతుస్త్వమసి శత్రువత్ ।
యస్త్వ మస్యా మవస్థాయాం భ్రాతరం నాభివత్స్యసే ॥ అర.కా.45.5.

అంత సీత లక్ష్మణునితో నీ అన్న కిట్టి దురవస్థ కలిగినను నీవు ఆయన కడకు పోకుంటివేల. నీవు నిజముగ నీ అన్నకు మిత్రరూపమునున్న శత్రువువలె నున్నావు.

యిచ్ఛసి త్వం వినశ్యం తం రామం లక్ష్మణ మత్కృతే ।
లోభాన్మమ కృతే నూనం నాను గచ్ఛసి రాఘవమ్ ॥ అర.కా.45.6.

నీవు నా కొఱకై నీ అన్న నశించవలెనని కోరుకొనుచున్నావు. నాయందు ఆశగలవాడవై రాముని అనుసరించకున్నావు. అని నానా దుర్భాషలాడెను. నీవెవరిని సేవించుటకు వచ్చితివో ఆయనకు ఆపద కలిగినపుడు నీవు ఈ ఆశ్రమమున ఉండి ఏమి లాభము అని కన్నీరు కార్చెను. అంత లక్ష్మణుడు రాముని బలపరాక్రమములను గూర్చి ఎంత గొప్పగ వర్ణించినను వినక, రామునికి వచ్చు కష్టము నీకు చాలా ప్రియమైనదని నేనిపుడే తెలుసుకొంటిని.

సుదుష్టస్త్వం వనే రామ మేక మేకోఽనుగచ్ఛః ।
మమ హేతోః ప్రతిచ్ఛన్నః ప్రయుక్తో భరతేనవా ॥
తన్న సిధ్యతి సౌమిత్రే తవాపి భరతస్యవా ।
కథమిందీవర శ్యామం రామం పద్మనిభేక్షణమ్ ॥
ఉపసంశ్రిత్య భర్తారం కామయేయం పృథగ్జనమ్ ।

**సమక్షం తవ సౌమిత్రే ప్రాణాస్త్యక్ష్యామ్య సంశయమ్ ।**

**రామం వినాక్షణమపి నైవ జీవామి భూతలే ॥ అర.కా.45.24-26.**

నీవు మిక్కిలి దురాత్ముడవు నీవు స్వయముగగాని, భరతునిచే ప్రేరితుడవైగాని, నన్ను కోరి ఈ విధముగ మోసముగ వ్యవహరించు చుంటివేని నీకు గాని భరతునికి గాని ఆ కోరిక సిద్ధించదు. రాముని లేని సమయమున ఈ భూమండలముపై ఒక్క క్షణమైనను జీవించను. నీ ఎదుటనే ప్రాణములను విడిచెదను. అంత లక్ష్మణుడు సీతాదేవి పలికిన కఠినములగు మాటలు విని సహింపలేక ఆమెకు నమస్కరించి, ఒంటరిగా ఆమెను విడిచి వెళ్ళవలసి వచ్చి నందుకు బాధపడి మాటి మాటికి ఆమెను చూచుచు రాముని కడకు వెళ్లెను. ఈ ఘట్టము ఆమె పాతివ్రత్యగుణమునకు పరాకాష్ఠ వంటిది.

లక్ష్మణుడు సీత ఆజ్ఞపై రాముని వెదకుటకై అడవికి వెళ్ళగ అదనుకై నిరీక్షించుచున్న రావణుడు అట్టి అవకాశము కలుగుటతోడనే సన్యాసి రూపముతో సీతను సమీపించెను. సీతయు అతడు బ్రాహ్మణ సన్యాసి అని అతిథి సత్కారము గావించెను. ఆమె అందచందములకు ముగ్ధుడైన రావణుడు సుందరీ! నేను నిన్ను కామించు చున్నాను. నేను రావణుడను, రాక్షసరాజును నీవు నన్ను చేపట్టమని తెలిపెను. అంత జానకి అనుకోని ఈ హఠాత్ సంఘటనకు తత్తర పడి కోపించి ఆ రాక్షసునితో --

**మహాగిరి మివాకంప్యం మహేంద్ర సదృశం పతిమ్ ।**

**మహోదధి మివాక్షోభ్య మహం రామ మను వ్రతా ॥ అయో.కా.47.33.**

**అక్షి సూచ్యాప్రమృజసి జిహ్వయా లేక్షి చక్షురమ్ ।**

**రాఘవస్య ప్రియాం భార్యాం యోఽధి గంతుం త్వమిచ్ఛసి ॥**

**అయో.కా.47.40.**

మహా పర్వతమువలె కదల్చుటకు వీలులేనట్టి వాడును. దేవేంద్రునితో సాటియగు వాడును, మహాసముద్రమువలె తొనకరాని వాడును అగు రామునికి యిల్లాలిని. నేను ఆయనను అను వర్తించు దానను. రాముని ప్రియ భార్యయగు నన్ను పొందగోరి నీవు సూదితో కన్నుపొడుచుకొను చున్నావు. నాలుకతో కత్తిని నాకు చున్నావు. నీవు నన్ను అపహరించినను నేను నీ వశముగాను. నీకు మరణము కలిగింతును అని పలికెను.

అందుకు రావణుడు నేను లంకాధిపతిని. దేవతలు, గంధర్వులు, పిశాచులు, రాక్షసులు నన్ను చూచి భయముతో పారిపోవుచుందురు. అని తన గొప్పతనమును గూర్చి చెప్పుకొనెను. అందుకు సీత కోపముతో కన్నులు ఎర్రబారగా నిర్జనారణ్యమున రావణునితో యిట్లనెను.

కథం వైశ్రవణం దేవం సర్వభూత నమస్కృతం ।
భ్రాతరం వ్యపదిశ్య త్వమశుభం కర్తు మిచ్ఛసి ॥
అపహృత్యశచీం భార్యాం శక్య మింద్రస్యజీవితుమ్ ।
నహి రామస్య భార్యాం మామపనీయాస్తి జీవితమ్ ॥ అర.కా.48.21-23.

సకల జీవులకు నమస్కరింప దగినట్టి ఉత్తమ దేవుడగు కుబేరుని నీ తమ్మునిగా పేర్కొని ఎట్లు ఈ అశుభమును ఆచరించుచున్నావు. నీవు ఎవరికి అధిపతివో ఆ రాక్షసులందరు నీ కారణముగ చచ్చుట తథ్యము. నీవొకవేళ దేవేంద్రుని భార్య అయిన శచీ దేవిని అపహరించి జీవించవచ్చును గాని రాముని భార్య నపహరించి నీవు జీవించుట మాత్రము అసంభవమని భయపెట్టిన ధైర్యవంతురాలు, సీతాదేవి. అనంతరము రాముడు సీతను అపహరించి లంకకు చేరుకొనెను. అంత సీతాదేవి శోక పీడితయై నిరంతరము దుఃఖింపసాగెను. రావణుడు అనేక విధముల ప్రలోభపెట్టినను అతనికి లొంగక సీత తన ప్రాతివ్రత్యమును నిలబెట్టుకొన్న సాధ్వీమణి సీతాదేవి.

## ఆతిథ్యము

బ్రాహ్మణ సన్యాసి వేషమును ధరించి వచ్చిన రావణుని చూచి అతనికి అతిథి సత్కారమొనర్చి పూజించెను. అనంతరముఅతనిని ఉద్దేశించి ఇదిగో ఆసనము దీనిపై కూర్చుండుము.

ఇయం బృసీ బ్రాహ్మణ కామ మాస్యతా ।
మిదంచ పాద్యం ప్రతి గృహ్యతా మితి ॥
ఇదంచ సిద్ధం వనజాత ముత్తమం ।
త్వదర్థ మవ్యగ్ర మిహోప భుజ్యతామ్ ॥ అర.కా.46.35.

ఇదిగో అడవియందు లభించు శ్రేష్ఠమగు కందమూలములు నీకై పక్వము చేయబడినవి. నీవింక ఏ లోటు లేకుండా భుజింపుము. అన్నమంతయు సిద్ధముగా నున్నదని పలికెను. ఈవిధముగ అతనికి అతిథిసత్కారము గావించుచున్న సీతతో ఓ శుభాంగీ! నీవెవ్వతెవు? నీవారెవ్వరు నీ వెక్కడినుండి వచ్చితివి. భయంకరమగు ఈ దండకారణ్యమున ఒంటరిగా ఏల తిరుగుచుంటివి. అని రావణుడు వేసిన ప్రశ్నలకు జవాబు చెప్పదలచినది. కారణము అతడు బ్రాహ్మణుడు, అతిథియై వచ్చినాడు అని అతిథికిగౌరవము యివ్వవలసినదని లేనిచో అతడు శపించునని అతని ప్రశ్నలకు సమాధాన మిచ్చెను.

ఆవిధముగ సమాధానమునిచ్చి అయ్యా, నీవొక ముహూర్తకాలము ఇచట ఉండి సేదతీర్చుకొనుము. ఇంతలో నాభర్త అడవినుండి తిరిగి రాగలడు. అని హైందవ

స్త్రీగా గృహిణిగా ఆతిథ్యమొసగినది. యిట్టి ఆతిథ్యగుణము గృహస్థ జీవనము గడుపు స్త్రీలందరికీ ఆదర్శ ప్రాయమైనది.

## వినయము

శ్రీరాముడు దండకారణ్యము ప్రవేశించి మహర్షులను అకారణముగ హింసించు, రాక్షసులను చంపుదునని మహర్షులకు అభయ ప్రదానము చేసిన సందర్భమును పురస్కరించుకొని క్షాత్రవృత్తిని త్యజించి, ముని వృత్తిని అవలంభించుటకై అరణ్యమునకు వచ్చిన శ్రీరాముడు అకారణముగా రాక్షసులతో వైరము పెట్టుకొని తిరిగి క్షాత్ర వృత్తిని చేపట్టుట మంచిది కాదనియు

**క్షత్రియాణా మిహ ధనుర్హుతాశస్యేంధనానిచ ।**
**సమీపతః స్థితం తేజో బలముచ్ఛ్రయతే భృశమ్ ॥** అర.కా.9.15.

ఏవిధముగ అగ్ని చెంత కట్టెలున్నచో తేజము ఎట్లు ఎక్కువగునో అట్లే క్షత్రియుని దగ్గర ధనస్సున్నచో అతని పరాక్రమము మిక్కిలి అతిశయించును. కావున శస్త్రన్యాసము చేసి శాంతముగ జీవనముగడుపుట మంచిదని సీత చెప్పెను. ఆమె హింసావృత్తిని త్యజించి అహింసా ధర్మమును పాటించుటలో గల మేలును సోదాహరణముగను యుక్తియుక్తముగను చెప్పుట ద్వారా ఆమె సూక్ష్మబుద్ధి, వాక్పటుత్వము తెలియుచున్నది. మరియు తన సహజ వినయముతో తన భర్తతో యిట్లనెను. నేను నీయందలి స్నేహము వలన గౌరవము వలన నీకీ విషయమును గుర్తు చేసితిని గాని నీకు తెలియని విషయమును తెలియ చెప్పుట లేదు. ఇది ఆమె మృదుస్వభావమునకు చక్కని ఉదాహరణము.

## క్షమాగుణము

శ్రీరామచంద్రుని ఆజ్ఞపై విభీషణుడు సీతాదేవి వద్దకు వెళ్లి ఆమెకు భర్త ఆజ్ఞను వినిపించి ఆమె కిష్టము లేకున్నను దాసీ జనముచే మంగళ స్నానములు చేయించి ఆభరణములను ధరింపజేసి పల్లకి పై ఎక్కించుకొని తీసికొనిపోయి శ్రీరామ చంద్రుని ముందు నిలబెట్టెను. భర్తను చూచి దుఃఖమును ఆపుకొనలేక ఆర్యపుత్రా! అని అరచి ఆమె విలపించెను.

**తా మాగతా ముపశ్రుత్య రక్షోగృహ చిరోషితామ్ ।**
**హర్షో దైన్యంచ రోషశ్చ త్రయం రాఘవ మావిశత్ ॥** యు.కా.114.17.

రాముడు సీతను చూచినపుడు సీతను క్షేమముగా చూచినందుకు హర్షము, రావణ భవనమున యిన్ని రోజులు ఉండుటవలన కలిగిన సంశయ మూలమున దైన్య

దోషములు కలిగెను. ఆ సమయమున రాముడు సీతతో పరుషముగా యిట్లనెను. భద్రే! నేను శత్రువును యుద్ధమున సంహరించి అతని హస్తగతమైన నిన్ను తిరిగి పొందితిని. పురుషాకారమున నేను చేయదగిన దంతయు చేసితిని శత్రువు చేసిన అపకారమునకు, అవమానమునకు తగు ప్రతీకారమును జేసి నా పౌరుషమును లోకమునకు చాటితిని హనుమంతుని దౌత్యము, లంకా వినాశనము, సర్వములు సఫలములయినవి. దుర్మార్గుడైన సోదరుని విడిచి నన్నాశ్రయించిన విభీషణుడికి తగిన ఉపకారము చేసితిని. మరియు రావణునిగెలిచి అతని నుండి నిన్ను విడిపించితిని. నేను యిది అంతయును నా మిత్రుల బలపరాక్రమములు వెల్లడిచేయుటకును, లోకోపవాదమును పోగొట్టుటకును, నావంశమునకు కల్గిన కలంకమును తుడుచి వేయుటకు మాత్రమే చేసితిని. నీ కొరకు మాత్రము కాదు. అని ఇంకను యిట్లనెను.

ప్రాప్త చారిత్ర సందేహా మమ ప్రతిముఖేస్థితా ।
దీపో నేత్రా దురస్యేవ ప్రతికూలాః మే ధృఢమ్ ॥
త ద్గచ్ఛత్వాఽను జానేద్య యథేష్టం జనకాత్మజే।
ఏతా దశదిశో భద్రే కార్యమస్తినమే త్వయా ।। యు.కా.115.17-18.
నహిత్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోహరాం ।
మర్షయు త్యచిరం సీతే స్వగృహే పర్యవస్థితామ్ ॥
తదద్య వ్యాహృతం భద్రే మయ్యైతత్ కృత బుద్ధినా ।
లక్ష్మణే వా అథ భరతే కురు బుద్ధిం యథా సుఖమ్ ॥
శత్రుఘ్నే వాథ సుగ్రీవా వా విభీషణే ।
నివేశయ మనస్సీతే యథావా సుఖమాత్మనః ॥ యు.కా.115.22-24.

నీ చారిత్రముపై నాకు సందేహమున్నది. అందువలన నేత్ర రోగికి దీపము బాధ కలిగించు విధమున నీవు నాకు సంతోషమునకు బదులు దుఃఖమును కలిగించుచున్నావు. నీవు నాకు అనుకూలురాలుగా గాక ప్రతికూలరాలుగ కనిపించు చున్నావు. కావున ఓ జానకీ! నీతో నాకు పనిలేదు. నీకు స్వాతంత్ర్యమిచ్చుచున్నాను. ఈ పదిదిక్కులలోను నీయిష్టం వచ్చిన చోటుకు పొమ్ము. మరియు ఓ జానకీ! నీవు దివ్యరూపము గలదానవు. మిక్కిలి అందమైన దానవు. తన యింటిలో నున్న నిన్ను చూచి రావణుడింత కాలము చూచుచూ ఊరకుండునా! కావున లక్ష్మణ భరత శత్రుఘ్నులలో ఎవరివద్దకు గాని లేక సుగ్రీవ విభీషణులలో ఎవరి వద్దకు గాని పోయి ఉండుము. నీతో నాకు పనిలేదు. అనెను. తాను దైవముగ ఆరాధించిన భర్త తననింత చులకనగా మాట్లాడినను పదిమందిలో తన చారిత్రము పైన సందేహమును ప్రకటించి

నిక్కిలి కఠినముగ మాట్లాడి తన మనసునొంచినను ఆ పతి వ్రతా క్షమామూర్తి తన స్త్రీ సహజమగు ఓర్పును వదలక సంయమమును కోల్పోక యిట్లనెను.

నేను నీవనుకొన్నట్లు చారిత్ర దూషిత నుగాను. నీవు సాధారణమైన స్త్రీల చారిత్రమును బట్టి స్త్రీజాతినే శంకించుచున్నావు. నాగుణించి నీవు పూర్తిగా నెఱుగుదువు. కావున అట్టి అనుమానమును వదలి పెట్టుము. రావణుడు నన్ను అపహరించిన సమయమున నాకు పరపురుషస్పర్శ కలిగెనందువా, అదినా తప్పుగాదు. నాశరీర మపుడు నా అధీనము నందు లేదు . నాహృదయము మాత్రము నా అధీనము నందేయున్నది . అది సర్వదా నీయందే లగ్నమై యున్నది.

మదధీనంతు యత్తన్మే హృదయంత్వయి వర్తతే ।
పరాధీనేషుగాత్రేషు కింకరిష్యామ్య నీశ్వరా ॥ యు.కా.119.9.

ఇంతటి అనుమానమున్నప్పుడు నన్ను చూచుటకు హనుమంతుని ఎందులకు పంపితివి? నీవు హనుమంతుని పంపినాకు ఊరట కల్గించుకున్న నేను ప్రాణములను త్యజించి యుండెదను. నీవు అలా చేసి యున్నట్లయితే నీ అనుచరులకు నీ స్నేహితులకు గూడ నా మూలమున యింతటి బాధ కలిగి యుండెడిదిగాదు.

ఓ నరశార్దూలా! సామాన్య మనిషివలె నీవు గూడ అనుమానపడుచున్నావు. నా శీలమును పరికించనైతివి. భర్తకు సంతోషము కలిగింపక భర్తృ పరిత్యక్తనై జీవింపజాలను. అంటూ అగ్నిలోనికి ప్రవేశించి--

యథామే హృదయం నిత్యం నా పసర్పతి రాఘవాత్ ।
తథా లోకస్య సాక్షీమాం సర్వతః పాతు పావకః ॥
యథా మాం శుద్ధ చారిత్రాం తుష్టాం జానాతి రాఘవ ।
తథా లోకస్య సాక్షీమాం సర్వతః పాతు పావకః ॥
కర్మణా మనసా వాచా యథా నాతి చరా మ్యహమ్ ।
రాఘవం సర్వ ధర్మజ్ఞం తథా మాం పాతు పావకః ॥ యు.కా.25.26.

నా యొక్క హృదయము నిత్యము రాఘవుని తప్ప ఇతరుల మీదకు పోకుండా యున్నచో, (మనసా, వాచా, కర్మణా రాఘవుని తప్ప నేరెవరిని స్మరింపకున్నచో) లోకసాక్షియగు అగ్నిదేవుడు నన్ను సర్వవిధముల రక్షించుగాక అనెను. అంతట అగ్ని దేవుడు సీతను ఒడిలో కూర్చుండ బెట్టుకొని చితి బయటకు వచ్చి పరమ పతివ్రతా శిరోమణి సీతాదేవి యొక్క శీలమును గూర్చి యిట్లు చెప్పెను.

ఏ షాతే రామ వైదేహీ పాపమస్యాం న విద్యతే । యు.కా.118.6.
ప్రలోభ్యమానా వివిధం తర్జ్యమానా చ మైథిలీ ।

**నాచింతయత తద్రక్ష స్త్వద్గతే నాంత రాత్మనా ॥**

**విశుద్ధభావాం నిష్పాపాం ప్రతి గృహీష్వ మైథిలీమ్ ।**

**నకించి దభి దాతవ్యమహమాజ్ఞాపయామితే ॥** యు.కా.118.10-11.

ఓ రామా! యిదిగో నీ వైదేహి పాపరహితమగు ఈమెను పరిగ్రహింపుము. రావణుడు ఎన్ని విధములగు ప్రలోభములు చూపినను ఎంత బెదిరించినను నీయందు లగ్నమైన అంతరాత్మ గలది అగుటచే వానిని గూర్చి కనీసం ఆలోచించను గూడ లేదు. కాబట్టి మారు మాట్లాడక ఈమెను గ్రహింపుము. అని తెలియ జేసెను. పై మాటలను బట్టి సీతాదేవి యొక్క క్షమాగుణము మనకు తెలియుచున్నది.

## సహృదయత్వం

శ్రీరామ చంద్రుడు రావణుని యుద్ధమున ఓడించి సీతాదేవిని తన రాజ్యమునకు తీసుకు వచ్చిన తరువాత తన రాజ్యములోని ప్రజలు అనుకొను మాటలను గూఢచారుల ద్వారా తెలుసుకొనిన వాడై సీతను అడవులలో వదలిరమ్మని లక్ష్మణుని ఆజ్ఞాపించెను. ఇంతటి కఠినమైన నిర్ణయమును తీసికొన్న తన భర్త పై సీతాదేవి ఏమాత్రము కోపించక తన సహృదయ తను ఈవిధంగా తెలియ జేసినది.

ఈ దుఃఖముచే దేహము నందు రోత పుట్టి ఈ దేహంతో నేనిక చేయవలసిన కార్యము లేదు. కావున ఈదేహమును వదలి పెట్టినచో నామగడు దయలేని వాడని రఘువంశమున శాశ్వతమైన అపకీర్తి తప్పక కలుగును. ఈనాడు లంకలో దేవతలు వానరులు రాక్షసులు మొదలగు వారు కలరు గదా! వారు లోకమున నిర్దోషురాలని చెప్పదురు కాని చెప్పకపోరు. అంత పాపము లోకము సహింపదు. నేనిపుడు మరణించితినా రామచంద్రమూర్తి కేవలము నిర్దయుడు, నిష్కారణముగా భార్యను చంపెనని చెప్పుదురు. కాని నా మగడట్టి నిందల పాలగుటకు నేను కారణము కారాదు అనుకొనెను. లోకంలో భర్త యింతటి ఘోర కార్యముము చేసినను అతనిపై యిట్టి సహృదయతను కలిగివున్న భార్య సీతాదేవి ఒకతియే. ఇట్టి భావ మితర స్త్రీల యందు దుర్లభము.

ఇంకను లక్ష్మణునితో యిట్లు చెప్పెను.

**యథాజ్ఞా కురు సౌమిత్రే త్యజమాం దుఃఖ బాగినీమ్ ।**

**నిదేశే స్థీయతాం రాజ్ఞః శృణు చేదంవచో మమ ॥**

**శ్వశ్రూణా మవిశేషేణ ప్రాంజలి ప్రగ్రహేన చ ।**

**శిరసా వంద్య చరణౌ కుశలం బ్రూహి పార్థివమ్ ॥**

**శిరసాభినతో బ్రూయాః సర్వాసామేవ లక్ష్మణ ।**

**వక్తవ్య స్చాపిన్నపతిః ధర్మేషు నమహో హిత ॥** బా.కా.48.9.11.

నీవు రాజాజ్ఞ ప్రకారము ప్రవర్తింపుము. నీకు నేను ఏమియు అడ్డము చెప్పను. ఈనిర్భాగ్యురాలిని ఈఅడవిలో విడిచి పొమ్ము. రాజాజ్ఞ యందు నిలువుము. నీకు పుణ్యము కలుగును. నేను నమస్కరించితినని మా అత్తగార్లకు, రాజునకు చెప్పుము.

మరియు లక్ష్మణా! రాజుగారితో ధర్మమందే దృష్టి యుంచి కామాదులచే అధర్మ మార్గమున పోవలదని చెప్పుము. లోకులు నన్ను నిందలాడిరని వారిపై కోపింపవలదని చెప్పుము. జానకి నిర్మలమైన మనస్సు కలదనునది నీమనస్సుకు తెలిసిన విషయమే అని చెప్పుము. నేను నీ మేలు కోరు దానను, నీ భక్తురాల ననునది నీ మనస్సునకు స్పష్టమని చెప్పుము. యిట్లుండియు లోకనిందకు భయపడి దిక్కులేని దానివలె వదలి పెట్టబడితిని గాని దోషురాలను కాదని నేనెఱుగుదునని చెప్పుము. కావున నీవే నాకు ఉత్తమ గతివగుటచే నీకు నాకు వచ్చిన అపకీర్త తొలిగించుట నాకును తగిన కార్యమే అని చెప్పుచూ నాయనా ఇవి యన్నియు నా మాటలుగా నాయందు దయయుంచి మీ అన్నగారితో చెప్పుము.

**వక్త వ్యశ్చైవ నృపతిః ధర్మేణ సుసమాహితః ।**
**యథా భ్రాతృషు వర్తేథాః తథా పౌరేషు నిత్యదా ॥**
**యథాపవాదః పౌరాణాం తథైవ రఘునందన ।**
**పతిర్హిదేవతా నార్యాః పతిర్బంధుః పతిర్గురుః ॥**
**ప్రాణైరపి ప్రియం తస్మాత్ భర్తుః కార్య ం విశేషతః ।**
**ఇతిమద్వచనాత్ రామో వక్తవ్యోమమ సంగ్రహః ॥**

అ.కా.48-14,17,18.

ఇంకను పౌరులను తన సోదరులవలె రక్షింపుమని నిరంతరము ధర్మమార్గమున భూమినేలుమని శాశ్వత కీర్తి వహింపుమని మీ అన్నగారికి విన్నవించుము. పురజనులాడు నిందలకు పాలుగాకుండునట్లు రాజ్యభారమును బూనుమని చెప్పుము. భార్యకు భర్తే దైవము, చుట్టము, గురువు కావున ప్రాణము కంటే ఆడుది తన పెనిమిటి కార్యములు నెరవేర్చుటయే ఎల్లప్పుడును యుక్తము. ఇవన్నియు సంగ్రహముగ తన భర్తకు చెప్పుమనెను. పై వాక్యములను బట్టి సీతాదేవి భర్త పట్ల రాజ్యంపట్ల ఉన్న సహృదయత ఎటువంటిదో మనకు తెలియుచున్నది.

## ఆదర్శవనిత

రావణునిచే కొనిపోయిన సీతాదేవి లంకా పట్టణము నందలి అశోకవనము నందుంచబడినది. హనుమంతుడు లంకకు వెళ్లిన మరునాడే రావణుడు సీతాదేవి మనసుమార్చుటకై ఆమె వద్దకు వెళ్లెను. ఆసమయమున సీతాదేవి పెనుగాలికి కదలిపోవు

అంటి చెట్టువలె నణికి పోయెను, రాముని వియోగ దుఃఖముచే వాడిపోయి నిరంతరము రాముని గూర్చి విలపించుటచే అలసిపోయి దుఃఖపడుచు రామునే ధ్యానించుచున్నట్టి అప్పటి ఆమె పరిస్థితి దీనాతి దీనము గానుండెను. అట్టి దీనస్థితి యందున్న సీతను గాంచి రావణుడు మంచి మాటలతో ఆమెను అనునయించుటకు ప్రయత్నించెను.

**కామయే త్వాం విశాలాక్షి బహుమన్య స్వమాం ప్రియే ।**

**సర్వాంగ గుణ సంపన్నే సర్వలోక మనోహరే ॥** సు.కా.20.3.

సుందరీ! విశాలమగు కన్నులుగల దానవు. సర్వాంగ సౌందర్యముచే అలరారుదానవు. సకలజనులకు మనోహరమగు నిన్ను మోహించు చున్నాను.

**విచిత్రాణి చ మాల్యాని చందనా న్యగరూణి చ ॥**

**వివిధాని చ వాసాంసి దివ్యాన్యాభరణాని చ ॥**

**మహార్హాణి చ పానాని శయనాన్యాసనాని చ ।**

**గీతం నృత్తం చ వాద్యం చ లభమాం ప్రాప్యమైథిలీ ॥** సు.కా.20.9-10.

నన్నుచేరి అనేక వర్ణములు గల పుష్పమాలలు చందనము అగరు పూతలు వివిధ వస్త్రములు దివ్యాభరణములు గొప్పవిలువగల పానీయములు, శయనములు, ఆసనములు, గీత నృత్య వాద్యములు ఈ సకల భోగములను అనుభవింపుము. నీవు నా భార్యవుకమ్ము. నా పరాక్రమముతో సకల లోకములనుండి సంపాదించిన రత్నములు, ఈ లంకా రాజ్యము, నేనును నీ వారమే. ఈ భూమినంతయు నీకై జయించి నీ తండ్రి జనకునికిచ్చెదను. ముల్లోకములలోను ఉత్తములగు నా అంతఃపుర కాంతలు శ్రీదేవికి అప్సరసలవలె నీకు పరిచర్య చేతురు. రాముడు నీకు తగనివాడు అని పలికెను ఈ విధముగ రావణుడు సీతను ప్రలోభ పెట్టెను. అతని ప్రలోభములకు లొంగక చావుకైనను సిద్ధమే గాని రావణుని చేపట్టనని నిశ్చయించు కొన్నట్టి ఉత్తమ యిల్లాలు.

రావణుడు పలికిన మాటలు విని దుఃఖమునొంది దీనురాలైన సీతాదేవి హీన స్వరముతో తన భర్తయగు రామునే ధ్యానించుచు యిట్లు పలికెను.

**నివర్తయ మనో మత్తః స్వజనే క్రియతాం మనః ।**

**నమాం ప్రార్థయితుం యుక్తం సుసిద్ధిమివ పాపకృత్ ॥**

**అకార్యం నమయా కార్య మేక పత్న్యా విగర్హితమ్ ।**

**కులం సంప్రాప్తయా పుణ్యం కులే మహతి జాతయా ॥**

**నాహ మౌపయికీ భార్యా పర భార్యా సతీ తవ ।**

**సాధు ధర్మ మవేక్షస్వ సాధు సాధు వ్రతంచర ॥** సు.కా.21-3,4,6.

రావణా! నీ మనస్సును నానుండి మరల్చి నీ భార్యల యందు ప్రవర్తింపచేయుము. నీవునన్ను కోరవలదు. శ్రేష్ఠమగు వంశమున బుట్టి ఉత్తమమగు ఇక్ష్వాకు వంశమున మెట్టి పతివ్రతనగు నేను నింద్యమగు నీకోరికను ఆచరించలేను. మరియు అతనివైపు చూడక అనాదరముగ మరల యిట్లు పలికెను. నేను పరభార్యనగుటచే నీకు భార్యనగుటతగదు. నీవు సజ్జన ధర్మములను పరిశీలింపుము. సజ్జనుల ఆచారములే అనుష్ఠింపుము.

**యథా తవ తథాన్యేషాం దారారక్ష్యా నిశాచర ।**
**ఆత్మాన ముపమాం కృత్వా స్వేషు దారేషురమ్యతామ్ ॥**
**అతుష్టం స్వేషు ధారేషు చపలం చపలేంద్రియమ్ ।**
**నయంతి నికృతి ప్రజ్ఞం పరధారాః పరాభవమ్ ॥** సు.కా.21.7-8.

నీకెట్లు నీభార్యలు శీలవంతులగునట్లు కాపాడదగినవారో అట్లే పర భార్యల శీల సంరక్షణము చేయవలసినవాడవు. ఆత్మ దృష్టాంతముతో నిశ్చయించి నీ భార్యలతో రమింపుము. తన భార్యలతో తృప్తినొందక, చపలచిత్తుడై ఇంద్రియముల చాంచల్యమునకు వశుడై పరభార్యలతో రమించువాని ఆయువు ఐశ్వర్యము మొదలగునవి పరభార్యలు క్షీణింపజేయుదురు.

**శక్యా లోభయితుం నాహ మైశ్వర్యేణ ధనేనవా ।**
**అనన్యా రాఘవేణాఽహం భాస్కరేణ ప్రభా యథా ॥**
**ఉపదాయ భుజం తస్య లోకనాథస్య సత్కృతమ్ ।**
**కథం నామోపధాస్యామి భుజమన్యస్యకస్యచిత్ ॥**
**అహమౌ పయికీ భార్యా తస్యైవ వసుదాధిపతేః ।**
**వ్రతస్నాతస్య విప్రస్య విద్యేవ విధి తాత్మనా ॥** సు.కా.21.15-17.

నేను సూర్యుని కంటే వేరుగాని వెలుగువలె రాముని కంటే వేరైన దానినిగాను. రాముని పూజనీయమగు కుడిచేయిని ఉపదానము చేసికొని శ్లాఘింపబడిన నేను వేరొకరిని అపూజ్యమగు భుజమును ఎట్లు ఉపదానముగ చేసుకొనెదను. వేదస్నాతుడు బుద్ధిమంతుడు ఆత్మజ్ఞానియగు రామునికే తగిన భార్యను, రామువిరహంచే నేను దుఃఖితనై యున్నాను. కాన నీవు రాముని ఆహ్వానించి ఆయనతో నన్ను కూర్చవలసినదని రావణునికి చెప్పి ఉత్తమ ఇల్లాలు చేయవలసిన కర్తవ్యమును అనుష్ఠించినది.

సీత పాతివ్రత్యబలగర్వితయై రాక్షసరాజగు రావణునితో ఓరి అల్పుడా! అమిత పరాక్రమశాలియగు రాముని భార్యయగు నన్ను ఏ పాపపుమాటలు పలికితివో, వాని ఫలము అనుభవింపకతప్పదు. నాకు రామాజ్ఞలేదు గాన పాతివ్రత్యరూపమగు తపస్సుచే

నిన్ను భస్మము చేయవలసి యున్నను చేయుటలేదు. దైవము నీ మృత్యువు కొరకే యిట్టి దుర్మార్గకార్యము చేయించు చున్నాడు. అని సీతాదేవి నిర్భయముగ, నిష్ఠురముగ పలికి ఉత్తమ యిల్లాలుగా తన కర్తవ్యమును తాను నిర్వర్తించెను. చివరకు పట్టరాని కోపముతో రావణుడు సీతను పరిపరి విధముల పీడించమని రాక్షస వనితలకు ఆజ్ఞనిచ్చి వెడలి పోయెను. ఆరాక్షసాంగనలు పరిపరి విధముల పీడించినను, బెదిరించినను, సీతాదేవి తన నిర్ణయమును మాత్రము మార్చుకొనక సకల స్త్రీ లోకమునకే వన్నె తెచ్చినది. విధముగ సీతాదేవి ఉత్తమ యిల్లాలుగా సకల స్త్రీ జనమునకు ఆదర్శ ప్రాయురాలై నిలచినది.



